స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు శబ్దచిత్రణ

# వందేమాతరం

మూలం : శివరాము

అనువాదం : డాక్టర్ ప్రసాదరాయకులపతి

జాగృతి ప్రచురణ

రామమందిరం వీధి

విజయవాడ-2

'వందే మాతరం'

సుజలాం సుఫలాం మలయజ శీతలాం
సస్య శ్యామలాం మాతరం

శుభ్ర - జ్యోత్స్న - పులకిత యామినీం
ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం
సుహాసినీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం

కోటి కోటి కంఠ కలకల నినాద కరాలే
కోటి కోటి భుజైర్ధృత ఖర కరవాలే
అబలా కే నో మా ఏత బలే
బహుబల ధారిణీం నమామి తారిణీం
రిపుదల వారిణీం మాతరం

తుమి విద్యా తుమి ధర్మ
తుమి హృది తుమి మర్మ
త్వంహి ప్రాణాః శరీరే
బాహుతే తుమి మా శక్తి
హృదయే తుమి మా భక్తి
తోమారయి ప్రతిమాగడి
మందిరే మందిరే
త్వంహి దుర్గా దశప్రహరణ ధారిణీ
కమలా కమలదళ విహారిణీ
వాణీ విద్యాదాయినీ
నమామి త్వాం

నమామి కమలాం అమలాం అతులాం
సుజలాం సుఫలాం మాతరం
వందే మాతరం
శ్యామలాం సరలాం సుస్మితాం భూషితాం
ధరణీం భరణీం మాతరం

# మనవి



జాతీయభావస్ఫోరకంగా ఉన్న విశిష్ట రచనలను తెలుగు పాఠక లోకాని కందించడానికి జాగృతి ప్రకాశన్ ట్రస్టు పనిచేస్తున్న విషయం తెలుగు పాఠకులకు సువిదితమే. 'వందేమాతరం' గ్రంథాన్ని తెలుగు పాఠకమహాశయుల కందిస్తున్నందుకు ఎంతగానో సంతోషిస్తున్నాం. 'Story of a Song' అన్న ఆంగ్ల గ్రంథంనుండి తెలుగులోనికి అనువదించుకొనేందుకు అనుమతినిచ్చిన 'రాష్ట్రోత్థాన సాహిత్య, బెంగుళూరు' వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు సమర్పించుకొంటున్నాం. తెలుగులోనికి అనువదించిన డాక్టర్ ప్రసాదరాయకులపతికి, అనువాదాన్ని సరిచూడటంలో తోడ్పడిన శ్రీ పులుసు గోపిరెడ్డికి, శ్రీ పురాణపండ రంగనాథ్‌కు మా ధన్యవాదాలు. ముఖపత్రాన్ని అందంగా చిత్రీకరించి అందించిన శ్రీ యస్. సత్యనారాయణకు, చక్కగా ముద్రించి సకాలంలో అందించిన భారత ముద్రణాలయంవారికి మా ధన్యవాదాలు.

— ప్రకాశకులు

# ప్రశంతి

## వందేమాతరం....

భారతీయ సంస్కృతీ చైతన్య స్రవంతి సమగ్రస్వరూపం. అదొక స్వాతంత్ర్య విరహుల ఆత్మనివేదన. అదొక కోటికోటి కలకంఠ స్వరాల సరస సంవేదన.

భారతీయులకొక మహోజ్వల చరిత్రను సృష్టించిందీ గీతం. భిన్నత్వంలో ఏకత్వంసాధించి ప్రజాహృదయాలలో పీఠంవేసుకొందీ గీతం. వందేమాతరం గీతం వినగానే ప్రతి భారతీయ హృదయం స్పందించింది. ఆ స్పందనకు ప్రతిస్పందనే స్వాతంత్ర్య సముపార్జన.

మాతృ స్వరూపిణియగు భారతభూమి వైభవ ప్రాభవాలకు, ప్రకృతి రామణీయతకు ప్రతిరూపం వందేమాతరం. భారతజాతి ఆశయాలను, ఆదర్శాలను అభివర్ణించిన అనర్ఘ రత్నమీ గీతం.

సుగమ సంగీత సరళిలో సాగిన వందేమాతరగీతం. మాతృమూర్తి మహోన్నత్యాన్ని మన్ననచేసుకొంటూ, సస్యశ్యామలత్వాన్ని సంస్మరించుకొంటూ సాగిపోయింది. సుజలాం, సుఫలాం అయిన భారతమాత శక్త్యాత్మకమై, అబలత్వానికి సబల స్వరూపాన్ని సృష్టింపచేసుకొని, అరివీర భయంకరమై, ఆవిర్భవించింది. దుర్గ దశప్రహరణ ధారిణియై, లక్ష్మీదేవియై, సరస్వతియై, "బంకించంద్రుని" ఆనందమఠంలో అవతరిల్లింది. సర్వ శక్త్యాత్మక తత్వాలకు భారతదేశం సాకారరూపం. సమస్త శక్తి యుక్తుల సంగమమే వందేమాతరం.

జాతీయతాసౌధానికి చరిత్ర పునాదిరాయివంటిది. గతచరిత్రను గుర్తు చేసుకొంటూ భావితరాలకు బాటలు దిద్దుకొంటూ, జాతి నూత్నజీవం పోసుకొంటూ పురోగమించడానికి వందేమాతరం వంటి గ్రంథాలు ముఖ్యం. అవి జాతీయతా ఆవశ్యకతనుగూర్చి ప్రజలకు ప్రబోధిస్తాయి. నేటి యువతరానికి వందేమాతరం గీతాన్నిగూర్చి అంతగా తెలియదు. సామాన్యులమాటదేముదెరుగు. జాతీయనాయకులను కొన్నవారికే స్వాతంత్ర్యోద్యమ సంగ్రామంలో వందేమాతరం గీతం ఎంతటి చారిత్రాత్మక స్థానాన్ని వహించిందీ. ప్రజలలో ఎలాంటి స్ఫూర్తిని కల్గించిందీ తెలియకుండాపోయింది. ఆగీత ప్రాముఖ్యం బహిర్గతం కాకుండా చేయడానికి అగ్రశ్రేణినాయకులు కొందరు విశ్వప్రయత్నాలు జరిపారు.

జాతీయతాభావ స్ఫురణకు ముఖ్యాతి ముఖ్యమైన వందేమాతరం గీతం కొన్ని బలవత్తర కారణాలవల్ల జాతీయగీతపుస్థాయికి చేరుకోలేక పోయింది. బుద్ధి సూక్ష్మతకు, పరాక్రమానికి, త్యాగశీలతకు నిలయమై పాఠకమహాశయుల హృదయాలలో ఆనందరస ప్రవాహాన్ని జాలువారించవలసిన వందేమాతర గీతపు గాధ మనోవేదనకు మార్గదర్శకమైంది. జాతీయతా స్వేచ్ఛకొరకు జరిగిన సుదీర్ఘ దుస్సహతర సమరంలో ఉన్నతమైన ధైర్యసాహసాలను, త్యాగనిరతిని, ప్రబోధించి తన మంత్రశక్తిచే సామాన్య మానవ హృదయాలను పరవశింపచేసింది. స్వాతంత్ర్య సముపార్జనా సమరంలోను, శాంతి పోరాటంలోను వందేమాతరంగీతం ప్రముఖ స్థానాన్ని వహించింది. ఆగీతంలోని ప్రత్యణువు నిత్యసత్యమైన జాతీయతను బహుముఖాల బహిర్గతం చేస్తోంది ఇట్టి ఆ పాటలోని ప్రతిపదం భారతీయ సంస్కృతీ సుగంధాన్ని వెదజల్లుతోంది.

భారతమాత అనుంగుబిడ్డల ఆశలకు, ఆదర్శాలకు వారి మనో వికాసానికి అభ్యుదయ నిర్మాణానికి వందేమాతర గీతం శాశ్వతమైన పరిపూర్ణోత్తేజాన్ని ప్రసాదిస్తుంది. కోట్లాది ప్రజలహృదయాలలో దేశభక్తి స్పందనకు కారణమైన యీ మహత్తరగీతం, దేశప్రజల భవిష్యత్తును తీర్చి దిద్దేందుకు పరిపూర్ణంగావినియోగించబడాలి, ఆత్మవిస్మృతితో బాధపడుతున్న

జాతికి యిదొక్కటే ఏకైకమార్గం. మనము విజ్ఞానధనులమై దేశభక్తి ప్రపూర్ణహృదయాలతో, విభేదాలను విస్మరించి, భుజబలయుతులమై మాతృమూర్తి యెదుట ముకులిత హస్తాలతో మనజాతి కీర్తిప్రతిష్ఠలను ప్రపంచ దేశాలలో సుప్రతిష్ఠితం చేయాలి. అప్పుడే మనము నిజమైన మాతృమూర్తి బిడ్డల మనిపించుకొంటాము.

స్వాతంత్ర్యోద్యమ మహాయజ్ఞంలో సామాన్యునకు ప్రేరణనిచ్చిన వందేమాతరం నేటి అస్తవ్యస్త పరిస్థితులలో జాతీయ సంఘటనా పథంలో కరదీపిక కాగలదని మా విశ్వాసం. నాడుమనలను ఆత్మసన్నద్ధులను చేసిన వందేమాతరం నేడు ఆత్మశోధనకు స్ఫూర్తి నివ్వగలదని మానమ్మిక. వందేమాతరం గీతం ద్వారా మాతృభూమికై అసువులు అర్పించి నవనవోజ్వల భారతనిర్మాణానికి కలలుగనిన మహావీరుల మహదాశయాలకు కార్యరూపం సంతరించడానికి ఉపక్రమించడమే నేటి మనకర్తవ్యం. అదే మాతృమూర్తికి నిజమైన అర్చన అవుతుంది.

నేటి యువతరానికి గతాన్ని గుర్తుచేస్తూ, చరిత్ర వైభవాన్ని స్మృతిపథంలో సంస్మరింపచేయిస్తూ, నూత్నోత్తేజాన్ని, ప్రసాదింపచేసే వందేమాతరం గ్రంథంలో స్వాతంత్ర్య సమర సన్నాహాలు మొదలుకొని స్వాతంత్రసముపార్జనా సంరంభాలవరకుగల భారతజాతి మహోజ్జ్వలచరిత్ర సహృదయ హృదయరంజకంగా సంగ్రహించబడింది. శివరాముగారు ఎంతో విశేష పరిశ్రమచేసి ఎందరెందరినో కలుసుకొని, ఎన్నెన్నో గ్రంథాలను పరిశీలించి "ఒందు కథె ఒందు వ్యథె" పేరున కన్నడంలో వ్రాశారు. దీనిని జి. హెచ్. ప్రహ్లాదరావు ఆంగ్లంలో వ్రాశారు. తెలుగు పాఠకులకు ఈ గ్రంథమాధుర్యాన్ని చవిచూపించాలన్న తలంపుతో ఆంధ్రీకరణ బాధ్యతలను శ్రీ ప్రసాదరాయకులపతి గారికి అప్పగించాం. మా ఒత్తిడిని సహించి వారు అనతికాలంలోనే అనువాదాన్ని పూర్తిగావించారు. అట్టి సుగంధ భరితమగు గ్రంథాన్ని ఇప్పుడు మీ ముందుంచుతున్నాం. ఇక చదవండి.

# ప్రకరణ పరిచయం



# వందేమాతరం

బారిసాల్ నగరవీధులలో ఆనాడు ప్రళయతాండవం చేసింది బ్రిటిష్ సైనిక పటాలం. "కొట్టండి – కొట్టండి" అనే కటు కంఠారావాలమధ్య స్వాతంత్ర్య సమరవీరుల దేహాలపై స్వైరవిహారం సలిపాయి లాఠీలు. ఐనా అజేయమైన 'స్వాతంత్ర్య సముపార్జనా సంకల్పం' ముందు అవి పరాజితమైనవి. సమర నినాదం ఎడతెగక ఉద్భవిస్తూ, వినిపిస్తూనే ఉంది.

వందే మాతరం

పైశవికమైన పోలీసు లాఠీఛార్జీ తీవ్రతను అధిగమించి మనోదిక్చక్రాన్ని వేగవైద్యుతకాంతులతో నింపుతున్న గీతం అది. ఉజ్జ్వలమైన దేశభక్తి భావనకు శ్రావ్యరూపాన్ని సంతరిస్తూ ఆవిర్భవిస్తూనే ఉంది ఆ పిలుపు–

వందే మాతరం!

కొట్టబడినా, పడగొట్టబడినా, ప్రజాప్రవాహం క్రమబద్ధంగా సాగింది. దారిపక్క పడిపోయినవాళ్ళు తమ స్థానాలలోకి మళ్ళీ వేగంగా వచ్చారు. గుండెలోతులనుండి దృఢనిబద్ధమగు మేళమువలె, కంఠమునుండి ఒక శ్రుతిబద్ధమగు వాద్యమువలె గర్జారావం ఉరుముతున్నది.

**వందేమాతరం!**

పరాక్రమోపేతమై బారులుతీరిన భారతీయుల ఉప్పొంగే అంత రంగపుటలలు శతాబ్దాలనుండి స్వాతంత్ర్యంకోసం ఆకలితో అలమటిస్తూ తీరాన్ని తాకి గర్జిస్తున్నవి.

వందే మాతరం !

పశ్చిమ బెంగాల్‌లోని బారిసాల్ వీధులనుండి లేచి, శతసహస్ర కంఠములనుండి ఉదయించి, భూనభోంతరాళాన్ని తననాదంతో నింపుతూ శత్రుహృదయాలను మధిస్తూ యావద్భారతమూ ప్రతిధ్వనించింది.

వందే మాతరం !

* * *

వంగభూమి వికలాంగమై విశ్లథమైంది. రేగే మానవహృదయపు లోతులలో ఒక చల్లారని అగ్ని బహిర్గతంకావటానికి అసహనంతో మార్గం వెతుకుతున్నది. దాని నాలుకలు ముందుకుదూకి వేడినెత్తురు నాస్వాదించ టానికి ఆత్రంగా ఉన్నవి.

భారత జాతీయకాంగ్రెస్ బెంగాల్‌రాష్ట్రశాఖ సమావేశం జరగవలసి ఉంది. విభజనను వమ్ముచేయటానికి ప్రతిజ్ఞ తీసుకోవలసి ఉంది. పరదాస్య బంధము, చిరావమానవైక్లబ్యము తొలగింపబడవలసి ఉంది. స్థలనిర్ణయం జరగాలి.

కాని విధి ఆ ఏర్పాటప్పటికే చేసింది. వంగవిభజన అనేమాట వినిపించిననాటినుండి ఆపట్టణం కాంతిహీనమై, అవమానకుపితమై కన్నెర్ర చేసింది. విభజనతర్వాత, ఆ సవాలును స్వీకరించటానికి అసంతృప్తితో, అసహనంతో అది కుతకుతలాడుతున్నది. 'వందే మాతరం' పంచ భూతాత్మకమై ప్రతిధ్వనిస్తోంది. ఆ పట్టణం అనేక సమావేశాలను, ఊరేగింపులను, నినాదాలను ఎడతెగకుండా చూచింది. అవిలేకుండా ఒక రోజుకూడా గడవలేదు. ఎప్పుడూ వార్తలలో అది ఉండేది. అదే తూర్పు బెంగాల్‌లోని బారిసాల్-పుట్టుకతోనే విప్లవకారుడు, దేశభక్తుడూ ఐన అశ్వినీకుమారదత్ స్వస్థానం.

బారిసాల్ తూర్పుబెంగాల్‌లో స్వాతంత్రసంగ్రామానికి ఆయువుపట్టు. స్వదేశీ ఉద్యమంతో విదేశవస్తుబహిష్కరణను అది నడిపింది. సహజంగా ప్రభుత్వ ప్రత్యేకదృష్టి దానిమీద ఉంది. దేశభక్తులైన అక్కడి ప్రజల విషయంలో జాగ్రత్తతీసుకోటానికి స్థానిక పోలీసుబలం చాలదని ఆరువందల గూర్ఖాసైనికులతో ఒక పటాలం అక్కడికి పంపబడింది.

కాని బారిసాల్‌ను అణచివేయటం అంతసులభం కాదు. ఒకసభలో లార్డ్‌కర్జన్ బొమ్మ తగులబెట్టబడి శాస్త్రోక్త కర్మకాండ జరుపబడింది. శత్రువుల అవశేషాలపై స్వాతంత్ర్యభారతిని ప్రతిష్ఠించడానికి జయగీతికగా వేల గొంతులనుండి 'వందేమాతరం' వెలువడింది. తెల్లవాణ్ణి పోలీసును చూడగానే వందేమాతరం అని అరవటం ఒక 'ఫాషన్'గా మారింది.

భారత జాతీయకాంగ్రెస్ సమావేశం జరపటానికి బారిసాల్‌ను మించిన ప్రదేశం మరేముంటుంది? దేశభక్తుల స్వేదంతో, రక్తంతో పునీతమైన ఆ పట్టణ మహత్వాన్ని గుర్తించి సముచితంగా ఎన్నికచేయడం జరిగింది.

స్థలనిర్ణయమైంది. ఏర్పాట్లు జరుగుతున్నవి. తేదీకూడ నిశ్చయమైంది 1906 ఏప్రిల్ 14. ప్రతినిధులకు భోజన, వసతి ఏర్పాట్లు పూర్తి ఐనవి. అతిథులను ఆహ్వానించడానికి పట్టణం ఆయత్తమై ఉంది.

ప్రభుత్వం భయకంపితమైంది. చివరిక్షణంలో జిల్లా మేజస్ట్రేటు ఎమర్సన్ సమావేశాలలో, ఊరేగింపులలో వందేమాతరం పాడటాన్ని నిషేధిస్తూ ఉత్తరువులు జారీచేశాడు. ఆపాట మొదటి రెండుపదాలు పలకటంకూడా నేరమైంది.

బెంగాల్ అంతటినించి ప్రతినిధులు దిగారు. తేజోవంతమై కొట్టవస్తున్నట్లు కానవచ్చిన ఉత్సాహం వారందరి ముఖారవిందాలలో వెలుగొందింది. ప్రియతమ నాయకులందరు తమమధ్య ఉండటంచేత వాతావరణం

ంగితం అయింది. బెంగాల్‌లో మకుటంలేని మహారాజు బాబూ
థ్ బెనర్జీ నాయకత్వం వహించాడు. ఆ సమావేశస్వరూపం
ాటలలో ఇలా స్పష్టమైంది.

మేము ఢాకానించి బారిసాల్‌కు పొగయోడమీద బయలుదేరాము.
ాయంకాలం చేరేప్పటికి కలకత్తా మొదలైన ప్రదేశాలనించి
ు వచ్చేశారు. మాకోసం ఎదురుచూస్తూ స్టీమర్లలోనే ఉన్నారు.
గి క్రిందికివచ్చేముందు నాతో సంప్రదించి తేల్చుకోవలసిన కొన్ని
ంశాలు తలఎత్తాయి. 'వందేమాతరం' అని నినదించటం బారిసాల్
– నిజానికి తూర్పుబెంగాల్ పట్టణాలు అన్నింటిలో నిషేధించ
ఉత్తరువు చట్టవిరుద్ధమని మా భావన. మేధావులైన న్యాయ
భిప్రాయంకూడా మా ఉద్దేశాన్నే బలపరిచింది. చట్టవ్యతిరేకమైన
శాధికారానికి మనం తలవంచాలా? ఆత్మగౌరవం ఆ లొంగు
ంగీకరించదు. అయితే స్థానిక బారిసాల్ నాయకులు ప్రతినిధులను
చేటప్పుడు ప్రధానవీధులలో వందేమాతరం నినాదాలు చేయమని
కారులతో ఒక ఒప్పందం చేసుకొన్నారు. ఈ ఒప్పందానికి
ట్టుబడి ఉండాలా? ప్రతినిధులలో తీవ్రవాదులు, యువకులు
త్రోసిరాజని వందేమాతరం నినాదం పలకటానికి అనుకూలంగా
చివరకు ఒక రాజీమార్గం కుదిరింది. అందరూ ఆమోదించారు.
నాయకుల ఒప్పందం ప్రతినిధులను స్వాగతించే సందర్భంలో
చేయకుండా ఉండటంవరకు పరిమితం. అంతకుమించి
దు. బారిసాల్ నాయకుల ఒప్పందం గౌరవించబడాలని,
మావేశం జరిగే ఇతర సందర్భాలన్నింటిలోనూ, ప్రభుత్వ
ఉత్తరువేదీ లేనట్లే భావించి నినాదం చేయబడాలనీ స్టీమరుమీద
కుదిరింది. అప్పుడు సాయంకాలానికి ప్రతినిధులు స్టీమరుదిగి
డుగుపెట్టారు. (A Nation in making P P 204 & 205)".

లప్రశ్నలకు వందేమాతరం ఉపయోగించాలా? వద్దా? అని
ం తలయెత్తినప్పుడు అమృతబజార్ పత్రిక సంపాదకుడు

మోతీలాల్ ఘోష్ "నాతల పోయినాసరే! నేను వందేమాతరం పాడతాను. అయినా నాతల అంతవిలువైనదని భావించను" అన్నాడు.

ఏప్రిలు 14న అనుకున్నప్రకారం కార్యక్రమం ప్రారంభమైంది. ఊరేగింపు మొదటి అంశం. రాజాసాహెబ్ హవేలీనుండి బయలుదేరి సమావేశస్థలం చేరేవరకు దారిపొడుగునా వందేమాతరం పాడుతూ వెళ్లాలని నిశ్చయించబడింది. వందేమాతరం బ్యాడ్జీలు ప్రతినిధుల రొమ్ములపై, భుజాలపై సగర్వంగా ప్రకాశిస్తున్నవి. వందేమాతరం నినాదం వ్రాయ బడిన అట్టలు, పతాకాలు ఆకాశాన్నంటుతున్నాయి. అనుసరించాల్సిన సూచనలివ్వబడ్డవి – ఎడమప్రక్కగా ముగ్గురు చొప్పున వరుసలో వందే మాతరం పాడుతూ ప్రశాంతంగా పోవాలి.



మధ్యాహ్నం రెండుగంటలకు ఊరేగింపు మొదలైంది. సమ్మేళ నాధ్యక్షుడు బ్యారిష్టర్ రసూల్ తన ఆంగ్లేయ భార్యతో ఒక గుర్రపుబగ్గీలో ఉండి ఊరేగింపు నడిపాడు. బాబూసురేంద్రనాథ్ బెనర్జీ, అమృతబజార్

పత్రిక సంపాదకుడు మోతీలాల్ ఘోష్, భూపేంద్రబసు, మొదటివరుసలో ఉన్నారు. వారివెనక బిపిన్‌చంద్రపాల్, అరవిందఘోష్, ఇతర యువ నాయకులు ఉన్నారు. మాతృచరణపీఠిపై ప్రాణములను అర్పించడానికి సంసిద్ధులై ఉన్న ఎందరో విద్యార్థికులు, ఉన్నత కుటుంబాలవారు ఆ ప్రతినిధులలో ఉన్నారు.

ఊరేగింపు ఇంకా పూర్ణరూపం ధరించవలసి ఉంది. ప్రతినిధులింకా రోడ్డుమీద అడుగుపెట్టవలసి ఉంది. వందేమాతరం నినాదం చెలరేగవలసి ఉంది. ప్రతినిధులు హుందాగా తలలెత్తి క్రమంగా అడుగులు వేస్తున్నారు. దేశభక్తులైన యువకులు బారులుతీరి ఉన్న ఈదృశ్యం పోలీసులకు గంగవెర్రులెత్తించింది. ఎటువంటి కవ్వింపుచర్యలు లేకుండానే-హెచ్చరిక కూడా చేయకుండా పోలీసులు వెనుకనించి పైబడ్డారు. నిరాయుధులైన దేశభక్తులను ఆరడుగుల పొడుగు లాఠీలతో బాదారు. ప్రతి లాఠీదెబ్బకు దేశభక్తులు-వందలు వేలు-వందేమాతరం నినాదాలతో సమాధానమిచ్చారు. ఆవేశపూరితులైన దేశభక్తుల నిండుకంఠాలనుండి ఉవ్వెత్తున వెలువడిన 'వందేమాతర' మహాగర్జ వాయుమండలమంతా నిండింది. వారితలలనుండి నెత్తురు ధారలుకట్టింది. వాళ్ళశరీరాలన్నీ రక్తమయం.

క్రిందపడ్డవాళ్ళను పోలీసులు తమ బరువుబూట్లతో తన్నారు. వారి గుండెలమీది వందేమాతరం బ్యాడ్జీలను లాగిపారేశారు. కానీ ఆంతరమైన దేశభక్తి తీవ్రతను ఎవరు తీసివేయగలరు? యువదేశభక్తులు ఎడతెగకుండా వందేమాతరం అని అరుస్తూనే ఉన్నారు. వారి గుండెలమీది బ్యాడ్జీల స్థానాన్ని నెత్తురుగుర్తులు ఆక్రమించినవి.

"మొదట్లో అవమానపెట్టకుండా మమ్మల్ని పోనిచ్చారు. ఏంటీ సర్క్యులర్ సొసైటీ సభ్యులైన యువప్రతినిధులు హవేలీనుండి ప్రధాన వీధిలో ప్రవేశించినప్పుడు పోలీసులు దెబ్బతీయటం మొదలుపెట్టారు. ఆరడుగుల మొద్దుకర్రలతో బాది ప్రతినిధులు ధరించిన వందేమాతరం

బ్యాడ్జీలను చించిపారేశారు. ఊరేగింపులోని కొందరికి బాగా దెబ్బలు తగిలినవి. సుప్రసిద్ధ కార్యకర్త, వక్త, తర్వాతికాలంలో దేశబహిష్కృతు డైన, బాబూమనోరంజన్‌గుహయొక్క కుమారుడు చిత్తరంజన్‌గుహ నీళ్ళ నిండా ఉన్న చెరువులోకి విసరివేయబడ్డాడు. దాంట్లోంచి అతణ్ణి ఇవతలికితీసి కాపాడకపోయినట్లయితే బహుశా జలసమాధి అయి ఉండేవాడు.

ఈ యువకులుచేసిన పాపమేమిటి? ఈ దండయాత్రకు ముందు తూర్పుబెంగాల్ ప్రభుత్వదృష్టిలో నిందార్హమైన వందేమాతరం నినాదం కూడా వాళ్ళు అరవలేదు. వాళ్లు చేసిన పెద్దతప్పిదం ఏమిటయ్యా అంటే ఎవరికీ ఏ ఇబ్బందిగాని ఆటంకంగాని కల్పించకుండా ప్రధాన వీధుల్లో ఊరేగింపుగా పోవటమే. వాళ్ళు దెబ్బలుతిన్నతర్వాత ఆవేశంతో వందే మాతరం అని నినదించారు, వాయుమండలం ఆ నినాదంతో ప్రతిధ్వనిం చింది". (A Nation in the making P. 206)

విభజనతర్వాత కొత్తరాష్ట్రానికి బామ్‌ఫీల్డ్ ఫుల్లర్ లెఫ్టినెంట్ గవర్నరుగా నియమితుడైనాడు. పి. సి. లియోన్ కార్యదర్శి. లెఫ్టినెంట్ గవర్నర్ ఉత్తరువుప్రకారం కార్యదర్శి వందేమాతరం పాడటాన్ని నిషేధిస్తూ ఉత్తరువు జారీచేశాడు. దాని తక్షణ ప్రతిక్రియ ఏమిటంటే ప్రతి పట్టణంలోనూ గ్రామంలోనూ ఈ నిషేధపుటుత్తర్వుకు వ్యతిరేకత వ్యక్తం చేయటానికి కమిటీలు ఏర్పడ్డవి. ప్రజలు వందేమాతరం బ్యాడ్జీలు పెట్టుకొనే మనలసాగారు. రామానందరాయ్, శచీంద్రకుమార బోసు, కృష్ణకుమార్ మిత్ర నాయకత్వం వహించారు. అరవిందుని సోదరుడు వారీంద్రకుమార ఘోష్, వివేకానందుని సోదరుడు భూపేంద్రనాథ్‌దత్తా, సోదరి నివేదిత దీనిని ప్రోత్సహించారు. నిషేధాజ్ఞా వ్యతిరేకసంఘ సభ్యులు బారిసాల్ సభలకు అధికసంఖ్యలో వచ్చారు, వారు పీల్చే గాలిలో వందేమాతరం వినిపిస్తోంది, వారి నాడి పట్టిచూసే లయబద్ధంగా వందేమాతరం విన్పించింది.

తల్లీ! నీకు నమస్సులు.

బ్రిటిషు సామ్రాజ్య ప్రభుత్వపు కీలుబొమ్మలైన పోలీసులు కొట్టి కొట్టి అలిసిపోయారు. వారికి విశ్రాంతి అవసరమైంది. కాని వారి పాశవిక లాఠీదెబ్బలకు గురిఅవుతున్న ప్రజలుమాత్రం విరామం లేకుండా వందే మాతరం పాడారు.

ఒక యోజనప్రకారం జరిగిన బారిసాల్ లాఠీచార్జి వంటిది అంతకు ముందు భారతదేశంలో ఎప్పుడూ జరగలేదు. హింసాత్మక, దేశభక్త్యాత్మక శక్తులమధ్య సంఘర్షణలో అది ఒక కొత్తమలుపును సృష్టించింది. వందే మాతరం కొత్త సమరనాదమైంది.

ఊరేగింపులో పాల్గొన్న వృద్ధనాయకులకు దెబ్బలు తగిలి నెత్తురు కారింది. కాని హృదయానికి తగిలిన గాయం ఇంకా బాధాకరమైనది. జూనియర్ పోలీసు అధికారులు వారియెడల చాలా అమర్యాదగా ప్రవర్తించారు. జాతీయ నాయకులు సామాన్య నేరస్థులవలె దూషించబడి, లాగబడి, నెట్టివేయబడ్డారు. వంగదేశపు మకుటంలేని మహారాజుకూడా విడిచిపెట్టబడలేదు. అతడూ చాలా కఠినావమానానికి పాత్రుడైనాడు. సురేంద్రబాబును అరెస్టుచేశారు. ఆరోజు కోర్టుకు సెలవు కావటంవల్ల ఆయనను మేజిస్ట్రేటు నివాసానికి తీసుకెళ్ళారు. అక్కడ ఆయననొక ఖైదీలా చూచారు. మేజిస్ట్రేటు ముందు పోలీసుల ప్రవర్తనను ఆయన ఆక్షేపించాడు. ప్రభుత్వ దమననీతిని ఆయన తీవ్రంగా వ్యతిరేకించాడు. కానీ మేజిస్ట్రేటు ఎమర్సన్ పోలీసులకంటె నీచుడని నిరూపించుకొన్నాడు. సురేంద్రబాబు పలికిన నగ్నసత్యాలు అతనికి మింగుడుపడలేదు. కోర్టు ధిక్కారనేరం క్రింద రూ. 200/- జరిమానా విధించాడు. ఊరేగింపులో పాల్గొన్నందుకు మరో రూ. 200/- జరిమానా. న్యాయవాదిని పెట్టుకోటానికి, సాక్షులను ఏర్పాటు చేసుకోటానికి విచారణ వాయిదావేయవలసిందిగా సురేంద్రబాబు అడిగాడు కాని ఆ అభ్యర్థన త్రోసివేయబడింది. ఇతర నాయకులు పోలీసుల అధికప్రవర్తనను గురించి విచారించమని పెట్టుకున్న ఇలాంటి అభ్యర్థనలుకూడా తిరస్కరించబడినవి.

సమావేశాలు అనుకొన్నప్రకారం జరగాలి. కనుక సురేంద్రబాబు జరిమానాలు చెల్లించి సభలలో పాల్గొనే స్వేచ్ఛను పొందాడు. ప్రతినిధు లంతా సమావేశపు పందిరిలో హాజరైనారు. అందరి శరీరాలమీద గాయాల గుర్తులు కనిపిస్తున్నవి – ఇంకా నెత్తురు కారుతూనే ఉంది. అయినా లెక్కచేయకుండా ఆవేశపూరితులై వందేమాతరం కలిసి పాడారు.

సురేంద్రబాబు మాటల్లో చెప్పాలంటే "స్నేహితులతో కలిసి నేను ప్రవేశించగానే, మేము ఒక అపూర్వమైన దృశ్యం చూచాము. సభ్య సముదాయమంతా ఒకే వ్యక్తివలె ఏకకంఠంతో ఉచ్చైస్స్వరంతో వందే మాతరం పాడుతున్నారు. చాలాసేపు కార్యక్రమం అంతా స్తంభించి పోయింది. కొంతసేపటికి మేమంతా వేదికమీద కూర్చున్నతర్వాత తిరిగి కార్యక్రమం మొదలైంది.

ఇంతలో వేదికమీదికి నుదుటిచుట్టూ కట్టుతో ఉన్న తన కుమారుడు చిత్తరంజన్‌గుహతో – ఆ యువకునిమీద పోలీసులు చేసిన అత్యాచార కథ ప్రతినిధులకు చెప్పటానికి – బాబూ మనోరంజన్ గుహ వచ్చాడు. అద్భుతశక్తితో మన భాషాసంపత్తిని సద్వినియోగపరచగల వక్తయైన ఆ తండ్రి ప్రేక్షకులను సమ్మోహితులుగా చేసి తన అననుకరణీయశైలితో ఆగాధ వివరించాడు. "చిత్తరంజన్‌ను పోలీసులు రెప్యులేషన్ లాఠీలతో కొట్టి నీళ్ళునిండిన చెరువులోకి విసిరేశారు. ఏమాత్రం ఎదిరించకుండా ప్రతి లాఠీదెబ్బకు వందేమాతరం అంటున్న ఆ బాలుని నిస్సహాయస్థితిని గుర్తించకుండా ఆ హింసాకాండ సాగింది. ఏమాత్రం ఎదురుపలకకుండా దృఢచిత్తంతో ఆ దురంతాన్ని సహించ పూనుకొన్న సమర్పణాభావమది. ఆ తండ్రీకొడుకులు, కొడుకు ఒంటినిండా గాయాలతో సాక్షీభూతంగా నిలబడి ఉండగా తండ్రి కొడుకుపై జరిగిన పాశవికకాండ వర్ణిస్తూ ప్రక్కనే నిలబడిఉన్న దృశ్యం ఎన్నటికి మరువలేనట్టిది. అది తర్వాత

చిత్రీకరించబడి 1906 కలకత్తా ఎగ్జిబిషన్‌లో మిక్కిలి ప్రజాదరపాత్ర మైనవానిలో ఒకటైంది". (A Nation in the making P. 209)

ఆనాటి సమావేశము సాయంకాలం పూర్తి ఐంది. ప్రతినిధులు వీధులలో ఇండ్లకు వెళుతుంటే వీధులన్నీ వందేమాతరం నాదంతో ప్రతి ధ్వనించినవి. మళ్ళీ మర్నాడు ఉదయం వాళ్ళు సమావేశానికి వచ్చేప్పుడూ అలానే జరిగింది.

సభ జరుగుతుండగా కెంప్ అనే పోలీసు అధికారి పందిట్లో ప్రవేశించాడు. అతడు వేదికవైపు నడిచి సభ చాలించాలని లేదా సమావేశం తరువాత ప్రతినిధులు వీధులలో వందేమాతరం నినాదాలు చేయమని వాగ్దానం ఇవ్వాలని అధ్యక్షుని ఆజ్ఞాపించాడు. సభయొక్క అభిప్రాయం తీసుకొన్నతర్వాత అటువంటి వాగ్దానమేదీ ఇవ్వటానికి అధ్యక్షుడు తిరస్కరించాడు. అప్పుడు కెంప్ 144 సెక్షను క్రింద మేజస్ట్రేటు ఇచ్చిన లిఖితాజ్ఞను చదివి సభను చెదిరిపోవలసిందిగా కోరాడు. సమస్త సభ ఆగ్రహోదగ్రమైంది. ప్రతినిధులు లొంగిపోవటానికి ఏమాత్రం సిద్ధంగా లేరు. చివరకు నాయకుల నిర్ణయానుసారం, ప్రతినిధులు వీధులలో బారులు తీరి వందేమాతరం అని నినదిస్తూ వెళ్ళిపోయారు. త్వరలోనే పందిరంతా సాయుధ పోలీసులతో నిండిపోయింది. ఆవిధంగా బారిసాల్ సమావేశం నాటకీయంగా సమాప్తమైంది.

కలకత్తానించి వచ్చిన ప్రతినిధులు ఇండ్లకు తిరిగివెళ్ళేప్పుడు ప్రతి స్టేషనులోనూ గుంపులుగుంపులుగా ప్రజలువచ్చి వాళ్ళను ప్రశంసించారు. వందేమాతరం నినాదాలు వాతావరణాన్ని నింపివేసినవి. సురేంద్రబాబుతో సోదరి నివేదిత ఇలా అంది. "ప్రభుత్వం మిమ్మల్ని కారాగారంలో పెట్ట డానికి ఒక కుట్ర పన్నింది. కాని యుక్తితో మీరు వాళ్ళ మోసాన్ని పటాపంచలు చేశారు. ఇప్పుడు వాళ్ళు తాము అల్లుకున్న సాలెగూడులో చిక్కుకున్నారు. నైతికవిజయం మీదే". నిషేధాజ్ఞా వ్యతిరేక సంఘ

సభ్యులు, వారి గౌరవనీయ నాయకుడు బాబూ కృష్ణకుమార్‌మిత్ర కూడా అదేరైలులో ప్రయాణం చేశారు. సోదరి నివేదిత వాళ్ళతో వాత్సల్యమయ వాక్కులతో ఇలా అంది. "దేశస్వాతంత్ర్యంకోసం మీరు నెత్తురు ధార పోశారు. ఈ త్యాగంవల్ల మీరూ, బెంగాల్ ప్రజలూ పునీతులైనారు''.

బ్రిటిష్ ప్రభుత్వం తనవలలో తానే చిక్కుకున్నదని సోదరి నివేదిత పలికిన గణనీయవచనం సత్యమని నిరూపితమైంది. బారిసాల్‌లో పోలీసుల పశుకృత్యాలనుగూర్చి రాజప్రతినిధి లార్డ్ మింటో అంతవాడు ఇలా అభిప్రాయపడ్డాడు. "ఆ ప్రశాంతమైన ఊరేగింపును, సమావేశాన్ని దానిదోవన దాన్ని వదలేస్తే బాగుండేది. సురేంద్రనాధ్ బెనర్జీ ఉద్దేశ పూర్వకంగా అరెస్టుకావాలని కోరి ప్రయత్నించాడు. పోలీసులూ అది నెరవేరటానికే సహాయభూతులైనారు". వందేమాతరం అని అరచినంత మాత్రాన ఆకాశం తల్లక్రిందులయ్యేదేంకాదు. అలా అరవకుండా అరి కట్టేందుకు చేసిన ప్రయత్నం మాత్రం బ్రిటిషుపాలనకు తీరని అపకారం చేసింది–అని ఆయన భావించాడు. "స్థానిక అధికారుల ఈచర్య పూర్తిగా చట్టసమ్మతం కాకపోవటంవల్ల గవర్నర్ జనరల్ అధికంగా పట్టించుకో వలసిన హేతువేర్పడింది....సురేంద్రనాథబెనర్జీ అరెస్టుగాని, ఊరేగింపుతో జోక్యం చేసుకోటంకాని చట్టబద్ధంగా జరిగాయని స్పష్టంగా చెప్పేందుకు వీలులేదు. పైగా వందేమాతరం నినాదం పలకటం చట్టవిరుద్ధమని ప్రకటించటం చట్టానికి తప్పుడు వ్యాఖ్యానం చేర్చినట్లయింది. (India under Morley and Minto – by M. N. Dass PP 38-39)

నిరాయుధులైన అమాయకప్రజలు తమ మాతృభూమిని ప్రేమించిన నేరానికి పశుహింసలకు గురియైనారు. పోలీసుల దమననీతి బారిసాల్ భూమిని దున్ని చాళ్లచేసి దేశభక్తుల విలువైన నెత్తురుతో తడిపింది. ఇది పుష్టిగా విప్లవాన్ని పండిస్తుందనడంలో ఆశ్చర్యమేముంది ? 1906 ఏప్రిల్ 14 చిరస్మరణీయమైన రోజు. ఆనాడు భవిష్యత్ విప్లవబీజం వందేమాతర సమర నినాదంతో నాటబడింది.

రామశర్మ రచించిన కవితాఖండిక 'పంజాబీ' పత్రికలో 1906 ఏప్రిల్ 25వ తేదీ ఇలా కనిపించింది.

*నిర్మలమైన మీ చూపులు తూకాలమహ్మాలు తెలుసుకొన్నాయి*
*ఆత్మాభిమానంతో మీ గమనాన్ని సాగించండి ముందుకు*
*అనవరతం కనిపించే విశుద్ధ రక్తధారలంటారా?*
*అవేనోయ్ స్వాతంత్ర్యపు పొలానికి శుద్ధిచేసిన విత్తనాలు*

బారిసాల్ సమావేశానికి నాలుగురోజులు ముందు 'ఇండియన్ ఎంపైర్' పత్రిక నాయకులకు ఒక పిలుపునిస్తూ ప్రజలు ఎప్పటివలె విన్నపాలు మహజర్లు పంపుకొంటూ కాలక్షేపంచేయాలో లేక నిజమైన జాతీయాశయాలు సాధించటానికి వీరులై విజృంభించాలో తేల్చి చెప్పవలసిన సమయం ఆసన్నమైనదని వ్రాసింది. మన ఆక్రోశం అధికారంలో ఉన్న వారి బలవంతపుజాలిని పొందగలదేమోగాని గౌరవాన్ని మాత్రం సమకూర్చ జాలదని ఆ పత్రిక హెచ్చరించింది. మామూలు తీర్మానాలద్వారా బారిసాల్‌లో ఏ అభిప్రాయం వ్యక్తంచేయబడినప్పటికి ఆతర్వాత అది స్పష్టంగానే బయటపడింది. వార్తాపత్రికలలో ప్రతిస్పందనలోకూడా పదునుగా విమర్శనాత్మకంగా వచ్చినవి. 'సంధ్య' ఈప్రశ్న వేసింది – "పశువులవలె గొర్రెలవలె దౌర్జన్యాలకు ఒళ్ళప్పగించటం మంచిదా లేక ఆత్మరక్షణకు లాటీలకు బదులు లాటీలనే ఉపయోగించటం మంచిదా ?"

ఆనందబజార్ పత్రిక (19-4-1906) ఈ హెచ్చరికను ధ్వనించింది–"అందరి మనస్సులలో ఉగ్రతను ప్రకోపింపజేస్తూ భయంకరమైన తుఫాను దేశమంతటా వ్యాపిస్తున్నది. ఒక గడ్డుపరిస్థితి సమీపిస్తున్నది. బారిసాల్‌లో ఇటీవల జరిగిన సంఘటనవంటిది మళ్ళీ మరెక్కడ జరిగినా ఆసందర్భంలో ప్రజలు బహుశా తమ ప్రాణాలను అంతగా లెక్కపెట్టరు". 'ది బెంగాలీ' తన ఏప్రిల్ 21 న చికలో ప్రజల సహనానికి ఒక హద్దు ఉన్నదనీ, తూర్పుబెంగాల్ ప్రభుత్వం ఉపయోగించిన లాఠీ వెనుదిరిగి దాని తలకే తగులవచ్చుననీ హెచ్చరించింది.

"బారిసాల్ సంఘటనలవంటి హింసాకాండను ఆపటానికి ముప్పైకోట్ల భారతీయప్రజలు తమచేతులెత్తాలి. బలాన్ని బలంతోటే ఎదుర్కో

వాలి" అని గర్జించింది బారీంద్రఘోష్‌యొక్క యుగంతర (ఏప్రిల్ 22) సంధ్య అదేవిషయాన్ని మళ్ళీ ఇలా పలికింది – "మీ కోపాతిశయం బహిర్గతంకావాలి. ఈ సభ్యత జాతీయశీలానికి అవమానం. ప్రతీకార మొక్కటే ఈ అవమానాలకు బదులుచెప్పే మార్గం. విషాన్ని విషంతో మాత్రమే తీసివేయాలి. అవమానవిషం ప్రతీకారవిషంతో కడిగివేయబడాలి".

'హితవార్త' ఇదే భావనను ధ్వనించింది – "ప్రపంచంలో మరెక్కడైనా ఇటువంటిది జరిగి ఉంటే అపరాధియైన మేజస్ట్రీటు ఎమర్సన్ తల మిగతాశరీరంనుండి వేరుచేయబడి బజారులో దొర్లి ఉండేది. తనకంటె ఉన్నత స్థానంలోఉన్న పెద్దలను ఈ లజ్జాహీనుడు అమర్యాదచేసినట్లు మరి యేదేశంలోనూ ఎవరివల్ల జరిగినా వాడి యెముకలు పిండికొట్టబడేవి.

భవిష్యత్తు అంతా అయోమయంగా ఉంది. పైకి స్పష్టంగా ఉన్న దేమిటంటే "ఆయుధాలకు వ్యతిరేకంగా ఆయుధాలే ఉపయోగించబడుతవి. నిర్దోషులగు బాలుర రక్తము తెల్లవారియొక్క, హింసాపరులయొక్క నెత్తురుతో కడిగివేయబడుతుంది. చిన్నపురుగుకూడా గట్టిగా నొక్కితే కుట్టుతుంది. ఎంతకాలం ఈదేశ ప్రజలు ఓర్పుకలిగి ఉంటారు ?"

"స్వదేశీ ఉద్యమం ఇప్పుడు మరోమలుపు తిరగవచ్చునని మేము భయపడుతున్నాము. వందేమాతరం బదులు ఎమర్సన్ ఖండిత మస్తకం జెండాకర్రపై వ్రేలాడగట్టబడితే అది ప్రజలకుగాని వారి పాలకులకుగాని మంచిదికాదు. మానవరూపాన ఉన్న ఈ అనాగరక రాక్షసులు శిక్షింపబడకపోతే, ఈ మనుషుల అహంకారం నిర్మూలించబడకపోతే రగిలించబడిన ఆ అగ్ని వేలకొద్ది మానవుల రక్తాన్ని కళ్ళచూస్తేనేగాని చల్లారదని ప్రభుత్వాన్ని మేము హెచ్చరిస్తున్నాం".

అమరవీరుల రక్తమే స్వాతంత్ర్యానికి ముఖ్యమని ప్రజలు గుర్తించారు. ఆ మూల్యాన్ని చెల్లించటానికి వాళ్ళు సిద్ధంగానే ఉన్నారు. ఇంక వాళ్ళను ఎవరు ఆపగలరు ?

అరవిందులు అప్పుడిలా వ్రాశారు.

"క్రూరులైన ప్రభువులు ప్రయత్నించారు. కాని ఎప్పుడైనా వారు మానవునిలో స్వాతంత్ర్యము నెడగల సహజప్రేమను అణచివేయటంలో విజయం పొందారా? అణచినకొద్దీ అది బలవత్తరంగా పెరిగింది. క్రూర ప్రభువుల కాలి మడమలక్రింద తొక్కబడి అది అనేకరూపాలు ధరించింది. పునః పునరపజయాలనుండి, అంతులేని బాధలనుండి ఎన్నిరూపాలు మారితే అంత ఎక్కువ బలాన్ని ఉత్సాహాన్ని సంపాదించి చివరకు శాశ్వతంగా నియంతల దమననీతిని త్రోసిరాజనడానికి సిద్ధపడింది. ఇదే చరిత్ర ప్రబోధం – ఇదే మానవతాసందేశం".

"అయితే మతగ్రంథ విషసర్పములవలె క్రూర ప్రభుత్వాలు కండ్లుండీ చూడవు, చెవులుండీ వినవు చారిత్రక విశ్వజనీన ప్రబోధములు, మానవతాశాశ్వత సందేశములు వానిపై పనిచేయవు. ప్రగతిరథం అవివేక వక్రబుద్ధులగుండా, పృథివిపై రక్తపాత వినాశనములగుండా ప్రయాసతో మెల్లగా సాగవలసి ఉంది".

బారిసాల్ సంఘటనల ఆరావం సప్తసముద్రాలూ దాటి లండన్‌లో బ్రిటిష్ పార్లమెంటులో వినబడింది. భారతప్రభుత్వ కార్యదర్శిని బారిసాల్‌లో శ్రుతిమించిన పోలీసు పాశవికతకు సంజాయిషీ అడిగారు. దాని ఫలితాలు భారతదేశంలో కనిపించటానికి ఎంతోకాలం పట్టలేదు. పోలీసులు ప్రారంభించిన అనేక దమనకాండ పద్ధతులను ఉపసంహరించవలసినదిగా రాజ ప్రతినిధికి సూచనలు వచ్చినవి. అతడు వెంటనే తూర్పుబెంగాల్ లెఫ్టినెంట్ గవర్నరును ఆజ్ఞాపించాడు. "హాజరుపట్టీలలో పేర్లు కొట్టివేయబడిన మూడువందలమంది విద్యార్థులు వెంటనే ఎటువంటి నిబంధన లేకుండా తిరిగి చేర్చుకోబడాలి. ఇటీవలి సంఘటనలలో తూర్పుబెంగాల్ ప్రజల సామాన్య సత్ప్రవర్తన ఫలితంగా ఈ అనాదరచర్య మీనుండి ఉదయించి నట్లు స్పష్టంచేయండి. ఇదీ, వందేమాతరం నినాదాలు, ఊరేగింపులకు

వ్యతిరేకంగా ఉన్న నిషేధపు ఉత్తరువులను రద్దుచేస్తూ (ఇదివరకే అట్టి ఆజ్ఞ ప్రకటించబడి ఉండకపోతే) మీరిచ్చే ఉత్తరువూ ఏకకాలంలో రావాలి".

ఈ హెచ్చరికయొక్క ఉద్దేశం స్పష్టంగానే ఉంది. ప్రజలు ఈ సౌకర్యాలను బలహీనతగా అన్వయిస్తే ప్రమాదకరం. అది హింసా కాండను ప్రోత్సహించవచ్చు.

టైమ్స్ ఆఫ్ ఇండియాలో (28–4–1906) ఒక సమాచారం ప్రకారం – "బారిసాల్ సంఘటన జాతీయ విమోచనోద్యమంమీద ఎంతో ప్రభావాన్ని ప్రసరించింది. పోలీసుల దౌర్జన్యం బెంగాల్‌నేకాక యావద్భారతాన్ని మేల్కొల్పినది. ఏప్రిల్ 21న మద్రాసులో పోలీసుల అకృత్యాలకు నిరసన తెలపటానికి 8000 మందితో పెద్దసభ జరిగింది".

"మదరాసులో బ్రహ్మాండమైన బహిరంగసభ జరిగింది. పదివేల మందికి పైగా ఎస్ప్లనేడ్‌లోని మైదానంలో గుమికూడారు. నిర్ణీత సమయానికి ముందే ప్రజలు ప్రవాహంలా 'వందేమాతరం' పాడుతూ వచ్చారు" (A Nation in the making P. 215).

నిరసనసభలు దేశమంతటా జరిగినవి. బ్రిటిష్ ప్రభుత్వపు అవరోధాలు దృఢంగా ఖండించబడ్డవి. వందేమాతరం ప్రజాసమీకరణ నినాదంగా అయింది. దాని ధ్వనులు దేశమంతటా వినిపించినవి. పృధివి పేగులలో అణచివేయబడిన చెలమ వేయిబుగ్గలుగా బయటికెగసినట్లు, కౌరవ యువరాజు తనను బంధింపవచ్చినప్పుడు శ్రీకృష్ణుడు విశ్వరూప ప్రదర్శన చేసినట్లు, షాజహాన్ తగులబెట్టించిన అరటిచెట్టు బూడిదనుండి పైకి మొలుచుకొనివచ్చినట్లు, వందేమాతరం తనశక్తిని, నిర్దోషతను నిరూపించుకొంది. తూర్పుబెంగాల్‌లో నిషేధించబడిన ఆ నినాదం యావద్దేశమూ స్వీకరించడమేకాక దేశఐక్యతకు అది సంకేతమైంది. పరాధికార వ్యతిరేక సమరరావంగా, స్వాతంత్ర్యానికి అంకితమైన ఎందరో యువవీరులకు స్ఫూర్తినాదంగా అది రూపొందింది.

## 2. మహర్షి బంకిం

వందేమాతరం !

అమ్మా ! నీకు నమస్సులు.

అది పదముల యాదృచ్ఛిక సమ్మేళనముకాదు; ఒక రాజకీయపు పెత్తుగడ కాదు; శ్రావ్యతకై కూర్చిన పద్యపాదము కాదు - మాతృ భూమితో అవిభాజ్యబంధమును సుస్థిరముచేసే గౌరవాస్పదమైన, నమ్మక మైన ఒక పవిత్ర ప్రతిజ్ఞ అది. తల్లికి నమస్సు నర్పించే, ఉజ్వల హర్షాన్ని ఉదయింపజేసే తులలేని జాతీయ మంత్రోచ్చారణమది. ఎవరు దాని సృష్టికర్త ?

ఒక ఋషిమాత్రమే జీవశక్తిగల మంత్రమును ప్రసాదింపగలడు. అరవిందుడు 'వందేమాతరం' కర్తనుగూర్చి ఇలా అంటాడు : "గత వైభవాన్ని స్మరించుకొంటూ ఆరోజులు తిరిగి రావని, సనాతనమైన యీ మహోన్నత దేశంలో ఉద్భవించి మానవ మేధస్సుకు, నాగరికతకు, ఉద్దీపనకల్గించిన మహర్షులు ఈ గడ్డపై తిరిగి జన్మించటం కల్లయని వాపోతున్నవారు లేకపోలేదు. ఇంత పతనావస్థచెందిన సమాజంలో నిరాశా జనకమైన ప్రస్తుత వాతావరణంలో, అట్టివారు జన్మించటం దుర్లభమని కూడా భావించేవారున్నారు. కాని యిది ముమ్మాటికి పొరపాటు.

మనది సనాతన భూమి; సనాతనప్రజ; సనాతన ధర్మము, దీని బలము మహత్వము, పవిత్రత, మేఘాచ్ఛాదితము కావచ్చుగాని అస్తిత్వమునే కోల్పోవు. వీరుడూ, ఋషి, ప్రవక్త మన హిందూభూమియొక్క సహజ ఫలాలు; వారు పుట్టనికాల మేదీ ఎప్పుడూ లేదు. నవ్యభారతాన్ని సృష్టిస్తున్న పునరుజ్జీవనమంత్రం 'వందేమాతరం'. మనకిచ్చిన మహర్షి పేరును అర్వాచీన యుగపు ఋషుల మధ్య చేర్చాలని చిట్టచివరకు మనం గుర్తించాం".
(Sri Aurobindo on Bankim, Tilak, Dayanand P. 7)

విశ్వకవి రవీంద్రనాథటాగూరు ఈ మహర్షి మొదటిసారి కలిసినప్పుడు రాజలక్షణాలు ఆయన ఫాలభాగంపై ప్రస్ఫుటంగా కన్పించినట్లు పేర్కొన్నారు. అందుచేతనే వంగసాహిత్యాకాశంలో ఉవ్వెత్తున వెలుగుతున్న సాహితీభానునిలా ఆయనను గుర్తించగలిగానని చెప్పారు. ఆయన జీవితధ్యేయాన్ని గురించి పలుకుతూ ఇలా వ్రాశారు. "సుస్థిర జాతీయ ప్రగతికి ఏకైకమైన పునాది ఆయన వేశారు. మన దుఃఖంలో ఓదార్పుకు, మన పతనంలో ఆశకు, మన అలసటలో శక్తికి, మన దారిద్ర్యశూన్యత మధ్య మాయని సౌందర్యపు అమరస్థానమునకు మార్గము చూపిన దాయనయే''.

బంకించంద్రుడట్టివాడు. దాస్యశృంఖలములను బద్దలుకొట్టే బలాన్నిచ్చిన వందేమాతరం గీతాన్ని ప్రసాదించిన-ఆ సారస్వత దిక్చక్రోపరి సుధాకరుడట్టివాడు.

ఎడ్వర్డ్ థాంప్సన్ బంకిచంద్రుణ్ణి వంగదేశపు స్కాట్‌గా అభివర్ణిస్తూ ఇలా అన్నాడు– "అతడు వేగంగా వంగసాహిత్యపు కీర్తి శిఖరాగ్రాన్ని అధిరోహించాడు. బహుముఖ ప్రజ్ఞలతో అలరారే ఆయనకు ఆకర్షణీయ వ్యక్తిత్వం ఉంది''.

కాని అరవిందుడా ఉపమానాన్ని అంగీకారయోగ్యంగా భావించ లేదు. బంకిం స్కాట్‌కు ఆయనతో పోలికలేదు. 'అత్యతిష్ఠత్ దశాంగుళం' అనదగ్గవాడు. అతడిలా అన్నాడు. "కొందరు బంకింను బెంగాల్ స్కాట్‌గా సూచించారు. అది అవమానావహము. దానివల్ల పరిపూర్ణతముదైన నవలా కర్తలలో ఒకజ్ఞి దోషయుతుడు, అపరిపూర్ణుడూ ఐన స్కాట్ గ్రంథకర్త యొక్క ప్రతిరూపముగా మనం భావించేట్లు చేస్తున్నారు".

బంకించంద్ర ఛటోపాధ్యాయ బెంగాల్ వచనావాఙ్మయానికి నిర్మాత మాత్రమే కాదు; ఆచార్యుడుకూడా! ఆయన 1838 జూన్ 27వ తేదీ ఇరవైనాలుగు పరగణాలలో కాంతలపాడాలో ఉద్భవించాడు.



ఆపిల్లవాడు ఈడుకుమించిన బుద్ధిగలిగి ఉండేవాడు. ఒక్కసారి మాత్రమే చెప్పిన అక్షరమాలనంతటినీ ఒక్కరోజులో నేర్చివేశాడు.

గింజనుబట్టి పంటను ఊహించవచ్చునంటారే - ఆ సామెతలాగా - అతని తండ్రి మిడ్నపూర్‌లో గవర్నమెంటు ఆఫీసరుగా ఉండేవాడు. బంకిం పేరు పట్టణంలో అందరికీ బాగా తెలిసిపోయింది. అతడు సాక్షాత్తు మేధా స్వరూపం. "నీవు బంకించంద్రుడంతటివాడివి అయ్యేట్లున్నావు" అని యే ఉపాధ్యాయుడైనా ఒక పిల్లవాడిని ప్రశంసిస్తే అది ఆనాడు అత్యున్నతమైన ప్రశంసగా భావించేవాడు. బంకించంద్రుడంతటివాడు కాగోరడమే నాటి బాలుర ఆశకు పరాకాష్ఠ.

పదేండ్లప్పుడే అతడు అరుదైన ధైర్యస్థైర్యగుణాలను ప్రదర్శించాడు. ఆరోజుల్లో బందిపోట్లు వస్తున్నారంటే ఊరంతా పారిపోయేది. కాని బంకిం దానికి అంగీకరించేవాడుకాదు. ఇంటిని, ఊరిని రక్షించి బందిపోట్లను తరిమివేయటమే సరియైనపద్ధతని అతడు వాదించేవాడు. ఈ చిరుత ప్రాయపు ఆలోచనే తరువాతికాలంలో పరపాలకులను త్రోసివేయాలనే దృఢనిశ్చయంగా అభివర్ధితమైనదంటే ఆశ్చర్యమేమీ లేదు.

బంకిం పరీక్షలను చాలా తేలికగా తీసుకునేవాడు. అందులో అగ్రేసరత అతని గుత్తహక్కు. హుగ్లీలోని మొహిసిన్ కాలేజీనించి, తర్వాత కలకత్తాలోని ప్రెసిడెన్సీ కాలేజీనించి అతడు పట్టభద్రుడైనాడు. అదే సమయంలో సంస్కృతం అధ్యయనంచేసి నాలుగుసంవత్సరాలలో మంచి అధికారం సాధించాడు. జెస్సూర్‌లో డిప్యూటీ మేజస్ట్రేటుగా నియమించబడినప్పుడు అతనికి కేవలం ఇరవైయేండ్లు. న్యాయంమీద ఉన్న భక్తివల్ల, నిర్భీకతవల్ల అతడు తెల్ల అధికారులతో తరచూ ఘర్షణ పడేవాడు; అయితే తోటివారికి న్యాయాన్ని సంపాదించటంలోగాని, శ్వేత బాధకులను ప్రతిఘటించటంలోగాని ఎన్నడూ రాజీపడేవాడు కాదు. దాని ఫలితం తరచూ బదిలీలు. 33 సంవత్సరాలు ఉద్యోగం తర్వాత అతడు పదవీ విరమణ చేశాడు. మూడుసంవత్సరాల తర్వాత 1894 ఏప్రిల్ 8వ తేదీ ఆయన పరమపదించాడు.

బంకించంద్రుడు భగవద్గీతను గాఢంగా ప్రేమించాడు. ఆయన రోగ గ్రస్థుడైన చివరిరోజులలో వైద్యుడొక ప్రత్యేకౌషధం తీసుకోమని చెప్పాడు. బంకిం ఊరక చిరునవ్వు నవ్వాడు. వైద్యునికి కోపం వచ్చి "నువ్వు ఆత్మహత్య చేసుకుంటున్నా"వని అన్నాడు. బంకిం అన్నాడు "ఎలా ?"

"మందు తీసుకోకపోతే ఆత్మహత్య చేసుకుంటున్నట్లు కాదా" అని ప్రశ్నించాడు వైద్యుడు.

"నేను తీసుకోటంలేదని ఎవరన్నారు ?"

"అయితే మందు చూపించు" వైద్యుడు నిలదీశాడు.

బంకిం మాట్లాడలేదు. తన శయ్యకు పక్కగాఉన్న ఒక వస్తువును నిర్దేశించాడు. అది భగవద్గీతాపుస్తకం. భగవద్గీతా ప్రబోధమే ఆయన జీవితాన్ని, కార్యకలాపాలను తీర్చిదిద్దినది.

బంకిం చారిత్రక నవలలు-ఆనందమఠం, దేవి చౌదురాణి, సీతారామ్ లను గురించి వ్రాస్తూ కర్ణాట మహాపండితుడు కీ. శే. ఎ. ఆర్. కృష్ణశాస్త్రి "భగవద్గీతాతత్వములో గల ధర్మకర్మ సన్యాసాదులు బంకించంద్రుని గ్రంధాలలో ఆమూలాగ్రం కానవస్తున్నవి" అని అభిప్రాయపడ్డాడు.

1857 లో బ్రిటిష్ దాస్యాన్ని త్రోసివేయటానికి ఒక సాయుధ విప్లవం జరిగిందిగాని అది నిష్ఫలంగా నిరూపితమైంది. కొన్ని స్వాభావికమైన బలహీనతలందులో ఉన్నవి. క్రమశిక్షణ, వ్యవస్థ, ఆయుధ సంచాలనము సంతృప్తికరంగా లేవు. స్వార్ధపరత, తోటివారిని మోసం చేయటం, అవకాశవాదం, చవకబారు సంతృప్తి, అజాగ్రత్త, హద్దు మీరినవి. ఈ లోపాల పాపాల దుష్పరిణామంగా యువవీరుల సాహసోపేతమైన ఆత్మార్పణము పోరాటము వ్యర్థమైనవి. అంతటితో

బ్రిటిషువారు ఈ స్వాతంత్ర్యభావన తిరిగి యెన్నడూ తలయెత్తకుండా అణచివేయాలని నిశ్చయించారు. పాశవిక హింస, నిర్దయ సంహారములూ జరిపించారు. మొత్తం ప్రజల ఆత్మగౌరవం తలఎత్తకుండా చేయడానికి కావలసిన పక్కా-వాటుచర్యలన్నీ తీసుకోబడినవి. తెల్లవాడు బుద్ధిలో, విద్యలో, పరాక్రమంలో, సాహసభావనలో సర్వాధికుడని నమ్మేలా ప్రజలకు బోధించారు. సంవత్సరాలమీద ఆత్మగౌరవ జ్యోతి చల్లారింది. స్వాతంత్ర్యమనే మాటకూడా స్మృతిపథంనుండి లుప్తమైపోయింది.

1857 విప్లవసమయంలో బెంగాల్ మిగతావాటితో పోలిస్తే ప్రశాంతంగా ఉంది. ప్రజలు తమ స్వంతమూల్యాలను తిరస్కారంగా చూస్తూ పాశ్చాత్యమైనవాటిని అనుకరిస్తున్నారు. తమను తాము కించపరచుకొనేందుకు అలవాటుపడి ప్రతివిషయంలోనూ తాము బ్రిటిష్‌వారి తరువాతివాళ్ళమనే పరిగణించుకొంటున్నారు.

అప్పుడు బంకిం కవోష్ణరక్తం ప్రవహిస్తున్న యువకుడుగా ఉండేవాడు. తనదేశము, తాను గర్వించగల సున్నితమైన మనిషిగా అతడు పెరిగాడు. తనచుట్టూ జరుగుతున్నదాన్ని చూసి సహజంగా అతడు చాలా బాధపడ్డాడు. శతాబ్దాల పరపాలన ఈ దేశాన్ని తన వైభవోపేత సంప్రదాయాలనించి దూరంచేసివేసిందని స్పష్టంగా అవగాహన చేసుకొన్నాడు. రాజకీయ, మానసికదాస్యము, సంక్షోభము మొదలైన దౌర్బల్యాలను సమూలంగా పెకలించివేయాలనుకొన్నాడు. తాము అల్పులమనుకొనే భావవ్రణాన్ని జాతి చేతననించి తొలగించాలనీ, ఈ ప్రాచీన భూమియొక్క జాతీయజీవనంలోని భూత భవిష్యత్తులమధ్య ఒక వంతెన కట్టాలనీ, ప్రాచీన వారసత్వపు పవిత్రజలాలతో మన జాతి చైతన్యానికి నీరుపెట్టి స్వాతంత్ర్యబీజాలను నాటి 'జాతీయోద్ధరణ' అనే నారు నాటడానికి పూనుకొన్నాడు

భ్రాంతుడైన అర్జునుడు యుద్ధరంగంలో విల్లంబులు జారవిడిచినప్పుడు శ్రీకృష్ణప్రభువు ఏమిచెప్పాడో అది భారతప్రజలకు గుర్తు

చేయాలనికూడా అతడనుకొన్నాడు. భక్తియోగము, కర్మయోగము మోక్షానికి జంటబాటలు. ఐతే జాతివిముక్తికి దేశభక్తి ఒకటే భక్తియోగమూ స్వాతంత్ర్య సమరమొక్కటే కర్మయోగమూ కావాలి. స్వార్థాన్ని పక్కకు నెట్టి ప్రతివాడూ ఆశయాలయెడ భక్తిని అలవరచుకొని, వాటిని సాధించటానికి తనను అంకితం చేసుకోవాలి. ఇది యెప్పటికి రూపాన్ని ధరిస్తుంది?

స్వార్థాన్ని వదులుకోటం మనిషికి కష్టం. భోగముల ఎర, సంసార చింత, కుటుంబపోషణకై ధనసంపాదనావశ్యకత, ఇంకా అటువంటి బంధాలు అతణ్ణి అణచి ఉంచుతవి. ఒక ఆదర్శానికి వశుడైనప్పుడే ఈ అల్పవిషయాలకు అతీతంగా అతడు లేవగలుగుతాడు. అప్పుడతడు తన గమ్యాన్ని సాధించటానికి అవరోధంగా ఉన్న పాశవిక జీవితానికి తనను బంధించిన శృంఖలాలను పగులకొట్టి దూరంగా విసిరేస్తాడు. ఆకారణంగా త్యాగాలు చేయటంకోసం అతడు ఆవేశం పొందుతాడు. మరి ఆకారణం ఏదై ఉండాలి? సమాన కార్యార్థం కోట్ల హృదయాలను ఒకటిగా అతికి చరిత్రలో నిలిచే మహాకార్యాలు చేయటానికి వారిని ఆవేశపరిచేదేదై ఉండగలదు ?

మన మాతృభూమి — త్రైకాలిక మాతృభూమియొక్క జ్యోతిర్మయ మూర్తి-తన శిశువులలో, వారి గుండెలలోతులలో తమ మాతృభూమియొక్క మహత్తర శ్రేయస్సుకోసం వెలుగుకోసం అధికతమ త్యాగం చేయటానికి తమను పూర్తిగా అంకితంచేసుకోగల అగాధమైన వాంఛను రేకెత్తించగలదు. మాతృభూమి విమోచనగానపు మంత్రశక్తి మూగవాణ్ణి మాట్లాడేట్లు, అశక్తుణ్ణి తనకాళ్ళమీద నిలబడేట్లు చేస్తుంది. బొక్కబోర్లపడిన దురదృష్టజాతి బాహువులెత్తి సింహంలాగా గర్జిస్తుంది. అలాంటిజాతిని ఎవడాపగలడు? ఎవడడ్డుకోగలడు ? దేశభక్తి ప్రేరిత ప్రజల గమనాన్ని సర్వప్రపంచమూ ఆపలేదు.

బంకిం స్వప్నమది. ఈ దేశభక్తిప్రవక్త పరమేశ్వరుణ్ణి, జాతిని ఒకటిచేసి, ఒక జ్యోతిర్మయ మాతృమూర్తిని కల్పించి, ప్రజా హృదయాలలో దానికి సింహాసనం వేసే పూనికతో తన కలాన్ని తీసుకొన్నాడు.

అతని కమలాకాంతార్ దప్తర్ నవలలో కొట్టవచ్చినట్లుగా ఆతల్లి చిత్రం కనిపిస్తుంది. శిశిరకుమారమిత్ర అన్నట్లుగా "ఆ పుస్తకంలోని చాలభాగాలలో ప్రయోగించిన పదాల తీక్ష్ణతనుబట్టి కమలాకాంతుడే బంకిం అని సులభంగా గ్రహించవచ్చు. భారతమాతను తనదేశీయుల కళ్ళకు కట్టేటట్లు ఉజ్జ్వలభాషలో బంకిం గావించిన ఆవేశదర్శనం కడు గంభీరమైనది. కాలకల్లోలినినుండి ఆమెను ఉద్ధరించవలసిందిగా కన్నుల అశ్రువులు జారగా అతడు వాళ్ళను పిలిచాడు. అది కేవలం ఒక వట్టి సాహిత్య కళాకారుని సృష్టిమాత్రమే కాదు; దైన్య దాస్యాంధకారంలో ఆవృతమైన మాతృభూమి రూపంలో అవతరించిన దివ్యశక్తియొక్క సత్యజ్యోతిని దర్శించిన మహాద్రష్టయొక్క సృష్టి అది. (Resurgent India Sisir Kumar Mitra P. 185)

"కమలాకాంతుడు ఒక అద్భుతసృష్టి. ఇక్కడ బంకించంద్రుడు కమలాకాంతుని నోట తన భావాలనూ, దృక్పథాలను మనముందుంచాడు. తన స్వంత పేరుతో వ్రాస్తే ఉండేదానికంటే ఎక్కువ భావప్రకటన స్వాతంత్ర్యం ఈ పద్ధతివల్ల అతనికి లభించింది. తనదేశాన్ని గురించి, ఇతరదేశాలను గురించి బంకింకు తెలిసిందంతా కమలాకాంతునికి తెలుసు. అతడొక కవి, రాజనీతివేత్త, తాత్వికుడు, సంఘ సంస్కర్త, దేశభక్తుడు; అయితే సంపూర్ణంగా అనూహ్యుడు. (Bankim Chandra - A. R. Krishna Sastry P. 370)

కమలాకాంతార్ దప్తర్ అననూనమైన ఔదార్యంతో, సౌందర్యంతో కనికరంతో కూడినవాడు. అనువాదానికందని కరుణగంభీరమైన అతని ఆత్మవేదనను అందించే ఈ మాటలు చూడండి.

"కాలప్రవాహం అకస్మాత్తుగా దిక్చక్రంపై వ్యాపించి పరుగెత్తటం నేను చూశాను; నేను ఒక బల్లకట్టుమీద తేలుతున్నాను. ఆ జలరాశి అనంతమైన అంధకారంలో అపారంగా కనిపిస్తున్నది. అందులో కాంతి

మంతములైన తారకలు ఉదయిస్తూ, అస్తమిస్తూ మళ్ళీ ఉదయిస్తూ ఉన్నవి. అక్కడ నేనొక్కణ్ణే. ఆ ఒంటరితనం భయమేసింది. మాత లేక ఒంటరినై దిక్కుమాలినస్థితిలో అమ్మా! అమ్మా! అని పిలిచాను. ఆ కాలసముద్రంమీద తల్లికోసం అన్వేషించాను. ఎక్కడుందా తల్లి? అయ్యో! నాతల్లి ఎక్కడ ఉంది? భారతమాత–సౌందర్యనిధి, పద్మ వికాసిని ఎక్కడ? ఈ భయంకర కాలకల్లోలినిలో తల్లీ! ఎక్కడ ఉన్నావు నీవు? – ఇంతలో హఠాత్తుగా ఒక దివ్యగానం వాయుమండలం నిండింది. దిక్చక్రమంతటా ఉదయవేళలాగా అరుణారుణకాంతులు వ్యాపించి నవి. తియ్యని గాలి పైకిలేచింది. సుదూరంగా–చివర–తరంగావళిపైన తేలుతూ, చిరునవ్వు నవ్వుతూ, కాంతులు విరజిమ్ముతూ ఉన్న మాతృ దేవత సువర్ణమూర్తిని చూచాను ఈమే నా మాతృదేవి? అవును ఈమే. ఈమే నాతల్లి – నా మాతృభూమి – భూరూపిణి నా మాత – అసంఖ్యాక భూషణభూషిత–ప్రస్తుతం కాలపులోతులలో మునిగిఉన్న జనని – అని గుర్తించాను. సాలంకృతమైన ఆమె దశబాహువులూ దశదిశలా చాచబడి ఉన్నవి. వాటిలో వివిధ శక్తిసంకేతములైన ఆయుధాలు ప్రకాశిస్తున్నవి. ఆమె పాదాలకింద విజితుడు, ఆహుతుడు ఐన శత్రువున్నాడు. ఆమె కాళ్ళ దగ్గర శత్రువును కిందికిలాగుతూ బలిష్ఠమైన సింహం ఉంది. ఈమూర్తిని ఇప్పుడు నేను చూడలేను. ఇవాళకానీ, రేపుకానీ అది కనబడదు. అది కాలసముద్రాన్ని దాటివచ్చిందాకా నేను చూడలేను. అయితే ఏదో ఒకనాడు ఆమె సింహాన్ని అధిరోహించి తన దశభుజాలను సాచి వివిధాయుధాలతో శత్రుసంహారం చేస్తూ భాగ్యాధిదేవతయైన లక్ష్మి, కళాశాస్త్రాధిదేవతయైన సరస్వతి, కుడిప్రక్కన, శక్తిస్వరూపుడైన కార్తికేయుడు విజయ ప్రదాతయైన గణపతి ఎడమప్రక్కన ప్రకాశిస్తుండగా దర్శిస్తాను. కాలప్రవాహంలో అటువంటి ధర్మభారతీమూర్తిని దర్శించాను''.

అంతటి ఉజ్వలభావనను భావించగల బంకిం బాష్పపూర్ణ నేత్రాలతో కమలాకాంతునిచేత ఈ విజ్ఞప్తి చేయిస్తాడు. "సోదరులారా! రండి!

ఈ అంధకార కాలప్రవాహంలో దూకుదాం రండి! మన లక్షల బాహువులతో ఈ విగ్రహాన్ని పైకి లేవనెత్తి మన తలలమీద మోసుకొని ఇంటికి తీసుకెళ్దాం. రండి! చీకటంటే భయందేనికి? ఉదయిస్తూ అస్తమిస్తున్న నక్షత్రాలను చూడండి! అవి మనకు దారిచూపిస్తవి. ముందుకు పదండి! ముందుకు పదండి! అసంఖ్యాకమైన మన బాహువులతో అల్లకల్లోలాలను తొలగద్రోసి ఈదుకుంటూ మన శిరస్సులమీద ఆ స్వర్ణవిగ్రహాన్ని వెనక్కు మోసుకువద్దాము''. (Resurgent India P. 186)

ఉపసంహారంలో ఈపాట వస్తుంది.

*జయ జయ జయ జయ జయధాత్రీ !*
*నమామి శిరసాదేవీం బంధనోస్తు విమోచితః*

నిత్యవిజయా! తల్లీ! నీకు జయము. బంధవిముక్తుణ్ణై తలవంచి నీకు నమస్కరిస్తున్నాను.



4]

అంతర్గర్భితమైన ఈ ఊహ ఆనందమఠంలో పూర్ణవికాసాన్ని చెందింది. (బంకించంద్ర – A. R. కృష్ణశాస్త్రి P. 379)

దీనిని గురించి శ్రీ శిశిరకుమార్ మిత్ర ఇలా అంటాడు.

"ఉజ్వలపద నిగదితమైన ఉజ్వల దర్శనం! నిజంగా ఏ దార్శనికుడూ భారతదేశపు ఉజ్వలతా, మహత్వము, ఔన్నత్యములను గురించి ఇంతకంటె అధిక స్పష్టదర్శనాన్ని ఎప్పుడూ పొందలేదు; పొందిన దర్శనాన్ని ఇంతకంటే గొప్పభాషలో పలుకనూలేదు. భారతదేశ పతనాన్ని గురించి ఆమె బిడ్డలలో ఇంతతీవ్రంగా వేదన చెందినవాడూ లేడు. అనంత సనాతనమాత దాస్యాంధకారంలో మునిగి ఉండటం బంకిం చూచి తన ఆత్మయొక్క మహాక్రోశంతో ప్రజలను – లేచి, సమస్త వ్యతిరేకతను అధిగమించి, తల్లిని పునఃస్థాపించటానికిగాను కదిలించాడు. శ్రద్ధతో భక్తితో తనను పూజించేవారికి శక్తిని, బలాన్ని ప్రసాదించే ఆ తల్లి బంకిం కన్నీళ్ళను చూచింది. ఆతని ఆత్మవేదనను విన్నది, భారతీయులు తమ స్వాతంత్ర్యాన్ని మహత్వాన్ని సాధించటానికి కావలసినదల్లా ఇచ్చేది. తమ హృదయాలలో, జాతిహృదయంలో, మాతృదేవిని దివ్యశక్తిగా పునస్సింహాసనాసీనను చేసేది, తమ జీవితాలలో, జాతి జీవితంలో ఆమె సంకల్పాన్ని నెరవేర్చేదీ, ఐన ఆమె ఆరాధనామంత్రాన్ని ఆతల్లి బంకింకు అనుగ్రహించింది".

దార్శనిక దృష్టిలేని జాతి నశింపకతప్పదు. భారతదేశం అందుకే పతనమైంది. భారతీయుల విముక్తికోసం జగన్మాత బంకింకు ఆదృష్టిని ప్రసాదించింది. ఆనందమఠం, దేవి చౌదురాణి ఆ దివ్యదర్శనంవల్ల పుట్టినవే. జ్ఞానప్రేమశక్తులు మూడింటిని ఏకంచేయడంద్వారా జగన్మాత కరుణను అన్వేషించే ఒక భక్తుని ఆదర్శాన్ని ఆనంద మఠంలో బంకిం ఎత్తి చూపాడు. భారతమాత రూపంలో తనను అభివ్యక్తం చేసుకొన్న దేవత యొక్క త్రిగుణాలు ఇవే. తల్లిని ఆరాధించటంవల్ల భక్తుడు ఈగుణాలు

పొందుతాడు. ఆనంద మఠాన్ని పునరుద్ధిత భారతదేశపు ఆరవవేదంగా పవిత్రీకరించిన 'వందేమాతరం'లో నవభారత ప్రవక్త బంకిం భారతమాత యొక్క మహామంత్రాన్ని గానంచేశాడు.

ఒకసారి గోఖలే"బెంగాల్ ఇవాళ ఆలోచించినదాన్ని భారతదేశం రేపు ఆలోచిస్తుంది" అన్నాడు. బంకిం విషయంలో ఇది పూర్తిసత్యం. బంకిం రాజకీయాలలో పాల్గొనక పోయినప్పటికీ భాష, చరిత్ర, మతం మూడింటిని స్ఫూర్తికోసం ఉపయోగించాడు. బెంగాల్‌లోని ఆతని చారిత్రక నవలలు ఉజ్వల గతాన్ని గుర్తుచేసి ఉజ్వల భవిష్యత్తు సాధించే ఆవేశం కలిగించటానికి పాఠకులకు స్ఫూర్తినిచ్చేవి. అంతేకాదు-బహిరంగ రాజకీయ చర్యలు అసాధ్యమైన పరిస్థితులలో దేశభక్త్యావేశాన్ని రేకెత్తించటానికి లేఖిని ఎంతశక్తిమంతమైన పరికరమో అవి ప్రదర్శించినవి" (Sources of Indian Tradision-Columbia UNiv. P. 707)

"అతనిపరమ ప్రసిద్ధనవల ఆనంద మఠంలో బంకిం 1770 ప్రాంతంలో బెంగాల్‌లో జరిగిన సన్యాసివిప్లవాన్ని వస్తువుగా తీసుకున్నాడు. అందులో ముస్లింలను ప్రతినాయకులుగా ద్రోహులుగా చిత్రించటంవల్ల బ్రిటిష్ అవిధేయతారోపణను చక్కగా తప్పుకొన్నాడు. (Sources of Indian Tradision Columbia UNiv P. 709)

"ఈకాలపు గొప్ప రచయితలలో బంకిం చంద్ర ఛటర్జీ భారతభూమి ఉదయింపజేసిన ఉత్తమ సృజనాత్మక ప్రతిభాశాలి. బంకిం సాధించిన మహత్తర కార్యమేమిటంటే జాతీయతను ఒకమత ప్రతిపత్తికి తీసుకెళ్ళడం. మాతృభూమిని దుర్గా లక్ష్మి సరస్వతులతో అతడు సంకేతితం చేశాడు. నిజానికి దేవతకు మాతృభూమి అర్ధాన్నిచెప్పి విగ్రహారాధనకు ఒక కొత్త భావనను అతడు కల్పించాడు. ప్రతిదేవాలయంలోను మేముపెట్టేది నీ విగ్రహాన్నే అని అతడు గానం చేశాడు. మతంగా జాతీయతను భావించిన బంకిం చంద్రుని విస్తృత తత్వం బెంగాలీ దేశభక్తుల పవిత్ర గ్రంథంగా

మారిన అతని ప్రసిద్ధనవల ఆనంద మఠంలో చూడవచ్చు. (Freedom Struggle in India, M.M. Ahluwalia P.P. 213)

జాతీయతను పరమోన్నతమతంగా భావించిన బంకించంద్రుని భావనను అర్థంచేసుకొని, విస్తరించి, ఆచరణలో పెట్టినవారిలో అరవింద ఘోష్ మిక్కిలి ప్రసిద్ధుడు. బంకించంద్రుని భావనను బహుమెలకువతో సులభగ్రాహ్యంగా వ్యక్తీకరించాడు అరవిందుడు.

"ఇవాళ బంకిం పేరును మనమెందుకు పూజిస్తున్నాము? అతడు మనకిచ్చిన సందేశమేమిటి? లేకపోతే అతడు చూచి, మనం చూడటానికి సహాయం చేసిన అతని దర్శనమేమిటి?

"తాను సంతరించుకోబోతున్న నూతన రూపాన్ని సంతృప్తికరంగా అభివ్యక్తం చేయగలమార్గం లేనినాడు ఏజాతీ ముందుకు సాగదు. అందుకు గాను తన ఆలోచనలకు, అనుభూతులకు శాశ్వతరూపాన్నిచ్చి, ప్రతి కొత్తస్ఫురణను వేగంగా జయప్రదంగా అందరి చైతన్యాలలోకీ చొచ్చుకొని పోగల భాష అవసరం. ఈ అవసరాన్ని సంతృప్తికరంగా తీర్చేందుకు అవసరమైన భాషను అందించడమే బంకింబాబు ఈ దేశానికి చేసిన మహోన్నత సేవ.

"దేశవిమోచనానికి ఏమికావాలో దాని సరియైన దర్శనం అతనికి కలిగింది. పైనించి వచ్చే శక్తిని క్రిందినుంచి అంతకంటే బలమైన ప్రతిక్రియాత్మకశక్తితో ఎదుర్కోవాలనీ, అంటే మనలను అణచివేస్తున్న శక్తిని తిరగబడే జాతీయశక్తితో ఎదిరించాలనీ అతడు గ్రహించాడు. సింహాన్ని కుక్కలాగా వ్యతిరేకించే పద్ధతిని మనం వదులుకునేట్లు చేశాడతడు. అతని దర్శనంలోని మాత తన పధ్నాలుగుకోట్ల చేతులలో ధరించింది ఉక్కు ఆయుధాలనేకాని పరివ్రాజకుని భిక్షాపాత్రను కాదు. ఆనందమఠంలోనూ దేవి చౌధురాణిలోనూ - తాను సృష్టించిన పాత్రల మరుగున అతడు బోధించినదీ నిర్భయబలశక్తులనే. అభివ్యక్తమయ్యే

శక్తికి వెనుక ఉండవలసిన నైతికబలముయొక్క ఆవేశపూరితమైన నిర్దుష్ట దర్శనం అతనికి కలిగింది. దేశంకోసం సమస్తాన్ని త్యాగం చెయ్యటం, స్వాతంత్ర్య కార్యమునందు పరిపూర్ణ భక్తి కలిగి ఉండటం నైతికబలానికి ప్రథమ మూలమని అతడు గ్రహించాడు. మాతృభూమి కోసం యుద్ధంచేసే అతని కార్యకర్తలు – ఆమెయెడ కర్తవ్యం తప్ప మరే ఇతర ఆలోచనలేని, మిగతాదంతా అంతకంటె తక్కువ ప్రియంగా, తక్కువ విలువైనదిగా భావించి, ఏదైనా ప్రియమైనది విలువైనదీ ఉన్నా ఆమె పనితీరిన తర్వాతనే స్వీకరించే – రాజకీయ బైరాగులు, తననుగాని, భార్యనుగాని, బిడ్డనుగాని, ఇతర వస్తువులనుగాని దేశంకంటే ఎక్కువగా ఎవడైనా ప్రేమిస్తే వాడు హీనుడు, అపరిపూర్ణ దేశభక్తుడు. అతడివల్ల ఆ మహాకార్యం జరగదు. నైతికబలానికి రెండవమూలం – ఆత్మ క్రమశిక్షణ, సంఘటన అనికూడా బంకిం తెలుసుకున్నాడు. ఈ సత్యాన్ని దేవి చౌదురాణియొక్క విస్తారశిక్షణలోనూ, ఆనందమఠంయొక్క సంఘ కఠిన నియమాలలోనూ ఆ పుస్తకాలలోని పరిపూర్ణ సంఘటనాచిత్రణల లోను అతడు వ్యక్తీకరించాడు. చివరకు నైతికబలంయొక్క మూడవ మూలం మతభావనను దేశభక్తికార్యానికి మలచటంలో ఉందని అతడు భావించాడు. దేశభక్తి మతం బంకించంద్రుని రచనల మహోన్నత భావన.

"పరిపూర్ణ బహుముఖ కర్మయోగముయొక్క భావన–ధర్మతత్వము లోను, దృశ్యము కృష్ణచరితలోను చిత్రించబడింది. మకుటప్రాయమైన ఈ భావన ఒక దేశానికి ఒకపద్ధతికి కార్యరూపము. ఆనందమఠంలో ఈ భావన గ్రంథానికంతటికీ మూలసూత్రమై అఖండ భారత జాతీయగీతమైన ఆ గొప్ప పాటలో పరిపూర్ణ భావగీతంగా వ్యక్తమైంది. దేశభక్తి మతాన్ని అందించి దాస్యవిముక్తికి పరిష్కారమార్గాన్నందించడం దేశానికి బంకిం చేసిన రెండవ మహాసేవ జాతిని పునరుత్థానపరిచి స్వాతంత్రంవైపు నడిపే భావావేశానికి అతడే ఉపదేష్ట, రాజకీయగురువు".

"మాతృదేవతా దర్శనం మనకివ్వటం బంకిం తనజాతికి చేసిన మూడవ అత్యున్నత సేవ. బుద్ధి యుక్తులనుపయోగించి మాతృభూమిని

ఊహించినంతమాత్రాన అది ఒక గొప్ప ప్రేరకశక్తి కాజాలదు. స్వాతంత్ర్యం అభిలషణీయమని గుర్తించడం మాత్రమే స్ఫూర్తిప్రదం కాజాలదు. రాజకీయదృష్టితో ప్రభుత్వ విధేయులైనా, తటస్థులైనా, జాతీయవాదులైనా ఇవాళ భారతీయులలో స్వాతంత్ర్యము అక్కర లేదనే వారుగాని, దానికోసం తాము కృషిచేయాల్సిన బాధ్యత లేదనేవారుగాని లేరనే చెప్పవచ్చు. అయితే దేశావసరాలకు, తమ అవసరాలకు మధ్య ఏది ముఖ్యమన్న ప్రశ్నవచ్చినప్పుడు మనలో చాలామంది దేశసేవకు ముందుకు రారు. స్వాతంత్రం వస్తే చూడాలనే కోరిక చాలామందికి ఉన్నప్పటికి దానిని సాధించే సంకల్పం కొద్దిమందికి మాత్రమే ఉంది. అంతకంటె ప్రియతరమైనవి మనకుండటంవల్ల స్వాతంత్ర్యసమరంలోగాని స్వాతంత్ర్యం రావటంవల్లగాని వాటికి హాని కలుగుతుందేమోనని మనం భయపడతాము. మాతృభూమి, మట్టికంటే, వ్యక్తుల గుంపుకంటె అధికమైనదని మనో నేత్రానికి తనను వ్యక్తంచేసుకునేవరకు, ఆమె ఒక మహత్తర దివ్య మాతృశక్తిగా సుందరమూర్తిగా రూపొంది మనసుపై ఆధిపత్యం వహించి, హృదయాన్ని ఆకట్టుకొనేవరకు, ఈ అల్పభయాలు, ఆశలు అదృశ్యమై దేశంకోసం సేవచేద్దామనే తీవ్రకాంక్ష, పతితజాతిని ఉద్ధరించి, అద్భుతాలను సాధించే దేశభక్తి కలగవు. కొంతమంది మాత్రమే ఆ దర్శనం పొంది ఇతరులకు వెలువరింపగలరు". (Sri Aurobindo on Bankim-Tilak-Dayanand PP 9-12

బంకింలో అరవిందునకున్న విశ్వాసము అట్టిది. అటువంటి దర్శనాన్ని పొందిన ఏ మహత్తరజాతీ – ఒక విజేతయొక్క దాస్య బంధానికి మెడవంచదని అతడంటాడు.

1894 లో బంకిం గతించాడు. అప్పుడు అరవిందుడు బొంబాయి నుండి వచ్చే ఇందుప్రకాశ్ పత్రికలో బంకింను గురించి వ్యాసపరంపర వ్రాశాడు. వాటి ముగింపులో ఈరకంగా అంటాడు.

"బంకిం ఒక స్థానంకోసంగాని, పదవికోసంగాని ఎన్నడూ పాకులాడలేదు. తన సమస్తమూ జాతికర్పిద్దామనేది తప్ప వేరే కోరికేమీ లేదుకనుకనే ఒక భాషను, ఒక సాహిత్యాన్ని, ఒక జాతిని అతడు సృష్టించగలిగాడు. అనంతరకాలంలో భారతీయ సంతతి మకుటధారణం చేసినప్పుడు జాతి నిర్మాతలలో అత్యుత్తమ ప్రశంసాస్థానానికి పదవీకాంక్షియై శ్రమించిన రాజనీతివేత్తకంటె, అతిభాషియైన సంఘసంస్కర్త కంటె ప్రకృతివలె సహజంగా నిశ్శబ్దంగా తనపనిని తాను ప్రేమించి నిరాడంబరంగా కృషిచేసి ఈదేశంలో భాషకు, సాహిత్యానికి, జాతీయతకు ఒక నూతన మలుపును ప్రసాదించిన ఆ గౌరవనీయుడైన వంగదేశీయుణ్ణే వరించగలదు".

# 3. మంత్ర దర్శనము

బంకించంద్ర నిర్మిత సాహిత్య వృక్షానికి ఆనందమఠము సుదీర్ఘ శాఖ. వందేమాతరం దానికి సుందరతమ పుష్పం. బంకిం రచనల మాధుర్య సౌందర్యములకది ఉదాహరణం. ఇప్పుడు మనం ఈ మహా వృక్షానికి సమీపించి బంకించంద్రుని సాహిత్యద్రుమానికి మూలభూతమై జీవనజలాన్ని ప్రసాదించిన ఈ మాతృభూమిని తరచిచూడడం ద్వారా మాత్రమే ఈ వృక్షాన్ని మనం చేరుకోగలం. ఆ వృక్షరాజపు బోదెను కాగిలించుకొని ఊతగా పైకి పోవాలి. కొమ్మ నుండి కొమ్మకు దుమికి ఆనందమఠం శిఖరాగ్రాన్ని చేరుకోవాలి. ఆ దివ్యకుసుమాన్ని ఒకసారి కన్నులతో ముద్దుకొని ముందుకు పోవాలి.

ఒక శిఖరం ఎత్తును తెలుసుకోడం లేదా దూరం నించి చూచి అంచనావేయటం ఒక ఎత్తు దాన్ని అధిరోహించడం మరొకఎత్తు అడుగుమీద అడుగు వేసుకుంటూ పైకిపోయినప్పుడు మాత్రమే ఆనందానుభూతిని పొందగల్గుతాం.

బంకిం సృష్టించిన నల్లమందుభాయి కమలాకాంతుచి నుండి సామాన్యకాంతయైన దేవిచౌదురాణి వరకు గల పాత్రలన్నీ మాతృభూమిని

గూర్చి ఆలోచించి దాని విముక్తికోసం తపనచెంది కృశించినవే. బంకిం యొక్క 'ధర్మతత్వము' మొదలు 'భగవద్గీతాభాష్యము' వరకు ఉన్న సాహిత్యమంతటిలో ప్రధాన వస్తువు మాతృభూమిసేవయే, అదే ఉత్తమ జీవితగమ్యంగా పేర్కొనబడింది.

'ధర్మతత్వ'లో ఉపాధ్యాయుడు విద్యార్థికి సలహాయిస్తూ చివరకు ఇలా ముగిస్తాడు "క్రమశిక్షణాత్మకక్రియ యొక్క ప్రాధాన్యాన్ని నువ్వు అర్థం చేసుకున్నావు. భగవంతుని యందు నీ విశ్వాసం పెరుగునుగాక! మాతృభూమి ప్రేమ సర్వేతరధర్మాలను మించినదని మరిచిపోవద్దు"

అతని చివరి గ్రంధం భగవద్గీతాభాష్యంలో తుదివాక్యంలో ఎంతో సంయమనంతో ఇలా అంటాడు "జాతిశ్రేయస్సు కోసం పనిచేసే దేశభక్తుడు నిష్కామ కర్మ చేస్తాడు. తన అభివృద్ధి కోసం తనకొక స్థితిని, కీర్తిని సంపాదించటం కోసం దేశసేవ చేసేవాడు స్వార్థపూరితమైన సకామ కర్మ చేస్తాడు" మృత్యుముఖాన ఉన్నపుడు బంకించంద్రుడు ఆపరమ సత్యాన్ని దర్శించాడు.

వేదాలలో, పురాణాలలో, గీతలో. ఉపనిషత్తులలో మాతృభూమి అనే ఏకైక దేవతనే అతడు దర్శించాడు. వాటిల్లో దేశభక్తి అనే ఒక్క మతాన్ని మాత్రమే అతడు కనుగొన్నాడు. అతని ఆధ్యాత్మికానుభూతి సర్వస్వానికి 'వందేమాతరం' సమానరూపం.

వందేమాతరం తొలిగా ఆనందమఠంలో పుష్పించినమాట సత్యమే. అయితే అది ఆవిధంగా అందులో ముందు వికసించాలని బంకిం అనుకోటం మరింత సత్యం. ఎందుకంటే వందేమాతరం గీతం ఆనందమఠం కంటే ముందే రచింపబడింది.

ఆ పాట ఎలా రచింపబడింది?

శతాబ్దాల తరబడి పరాధిపత్యపు ఉక్కుపాదాలకింద నలిగి భారతీయాత్మ ఆక్రోశిస్తున్నది. తన గుండెలోని కలతవల్ల దేశమాత నిట్టూరుస్తున్నది. కాననాంతరగిరి కంధరాలలో మౌనుల భావతరంగాలు అడవుల గుండా సంచారంచేస్తున్నవి. యజ్ఞాగ్నుల ముందు ప్రాచీన మహర్షులు ఉచ్చరించిన మహత్తర మంత్రబుక్కులు దివికెగసి నీలమేఘసము దాయంతో గర్జించి పృధ్వికి మరలి ప్రతిధ్వనించినవి. స్వాతంత్ర్యం సమరాలలో అసువులర్పించిన శతసహస్ర సైనికుల అంతిమవాంఛ వాయుమండలంలో ధ్వనిస్తున్నది. గాలిలోని ఆ కాలాతీత వాయు తరంగాలకు తన మనస్సును హృదయాన్ని మేళవించగలిగిన బంకిం తన సుందర మాతృభూమికొక ప్రార్థనాగీతాన్ని సమర్పించాలని కుతూహల పడ్డాడు. ఐతే దేశవిమోచనోద్యమానికి అత్యంత శక్తివంతమైన ఆధ్యాత్మిక మానదండంగా పనిచేసిన ఆ అద్భుతదృశ్యాన్ని ఎలాచూచాడో, ఆ చూచిన దృశ్యాన్ని ఒక మహత్తర గీతికగా ఎలా అమరత్వాన్ని పొందించి రూపొందించాడో పూర్తిగా తెలియటం లేదు. (Resurgent India P. 189)

అయితే ఇలా మాత్రం చెప్పవచ్చు. ఒక పవిత్రక్షణం వచ్చింది. అది సుమారుగా 1875 ప్రాంతం. శాంతిరహిత కలకత్తా జీవితం నుండి తప్పించుకోటానికి ఒకరోజు సెలవు తీసుకొని బంకిం తన స్వస్థానం 'కాంతాల్‌పాడా' పోవటానికి రైలెక్కాడు. నగరం దాటినకొద్దీ అంతా పచ్చగా ఉండి హృదయాన్ని ఆనంద పూరితం చేసింది. సంపన్నమైన నదులతో, పూలతో, పండ్లతో, అడవులతో మాతృభూమిని గూర్చిన భావన బంకిం నాడీమండలాన్ని విద్యుత్తరంగితం చేసింది. ఆక్షణంలో మట్టిగడ్డకూడా మహేంద్రజాలంచేత దివ్యత్వాన్ని పొందింది. అతడికన్నులూ, చెవులూ, జాగ్రత్‌శుద్ధరితములైనవి. అతని అంతరదృష్టి మాతృభూమి పరిపూర్ణ మహత్తర వైభవంతో సౌందర్యంతో దర్శించింది. అతని అంతర శ్రోత్రము భూవాయుగగన స్వరములు విన్నది. ప్రకృతి తన పాటను వ్యక్తీకరించి భావుకుడైన బంకింకు ప్రసాదించింది. అతడు ఆ

బహుకృతి ప్రణతి పూర్వకంగా స్వీకరించాడు. అప్పుడతడు తానుచూచిన, విన్న సమస్తాన్ని తన రచనలో సంతరించాడు.

వందేమాతరం !

సుజలాం సుఫలాం
మలయజశీతలాం
సస్యశ్యామలాం
మాతరం !

ఆ సరస్సులు, నదులు, పవిత్ర గంగా, యమునా, గోదావరి, సరస్వతీ, నర్మదా, సింధు, కావేరులు; వివిధ ఫలసంపన్నములైన వనాలు; భూతలస్వర్గం, ప్రక్కగా వెళ్తూ మెల్లగా హాయినిగొల్పు మందమారుతం; ఇంకా అంతులేని పచ్చదనం........

శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం
ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం
సుభాషిణీం సుమధుర భాషిణీం
సుఖదాం వరదాం మాతరం !

వెన్నెల వెలుగులో స్నానమాడిన భూమి, మృదుపత్రపుష్పాలతో, పూలతో హర్షోత్ఫుల్లమైన చెట్లు, లతలూ; తియ్యని చిరునవ్వు, సుమధుర కంఠస్వరం....

కోటికోటికంఠ కలకల నినాదకరాళే
కోటికోటిభుజైర్ధృత ఖర కరవాలే
కే బలే మా తుమి అబలే
బహుబల ధారిణీం
నమామి తారిణీం
రిపుదళ వారిణీం
మాతరం !

కోట్ల గొంతులనుండి వెలువడే సింహగర్జన; క్షణంలో పైకిదూకే కోట్లఖడ్గాల తళ తళలు. విజయోపేతంగా శత్రువును తన పాదాలక్రింద ఏనుగులాగా తొక్కివేసే శక్తివంతమైన విశృంఖల దృశ్యం....

*తుమివిద్యా తుమిధర్మ*
*తుమిహృది తుమిమర్మ*
*త్వంహిప్రాణాశ్శరీరే*
*బాహుతే తుమి మాశక్తి*
*హృదయే తుమి మా భక్తి*
*తోమారాయీ ప్రతిమాగాడీ*
*మందిరే మందిరే!*
*జయదుర్గి! ... శ్రీ లక్ష్మి.... శ్రీ సరస్వతి*
*త్వంహి దుర్గా దశప్రహరణధారిణీ*
*కమలా కమలదళ విహారిణీ*
*వాణీ విద్యాదాయినీ*
*నమామిత్వాం*
*నమామి కమలాం*
*అమలాం అతులాం*
*సుజలాం సుఫలాం*
*మాతరం*
*వందేమాతరం!*
*ఏకైక శ్యామల-నిత్యనూతన-బహువిధసంపద్ విభాసిత*
*శ్యామలాం సరళాం*
*సుస్మితాం భూషితాం*
*ధరణీం భరణీం*
*మాతరం-*

ప్రాచీన వేదప్రదాయిని; వ్యాసవాల్మీకి, వసిష్ఠ సాందీపని, పాణిని పతంజలి, శంకరమధ్వరామానుజచైతన్య పరంపరగలది; విజ్ఞానపీఠము లైన నలందా, తక్షశిలా, గౌర, విక్రమపుర, నవద్వీప, మహాస్థానములతో

అలరినది, యాత్రాకేంద్రములైన త్రివిష్టప కైలాస కాశీరామేశ్వరములతో భక్తిశక్తి జ్ఞానకేంద్రములతో వరలినది....

బంకింస్రష్ట. వందేమాతరం నవసృష్టి. బంకిం ఆ నవజాత శిశువును ఆనందమఠ డోలికలో ఉంచాడు. ఆ బిడ్డయొక్క మహత్తర భవిష్యత్తు నతడెరుగును. భావికాలంలో అది ఎంత చారిత్రాత్మక పాత్ర నిర్వహించ గలదో ఆ ప్రవక్తకు పూర్తిగా తెలుసు.

కొంతమంది బంకిం వందేమాతరం రచించినప్పుడు భవిష్యత్తులో దానికంత చారిత్రాత్మక ప్రాధాన్యం వస్తుందని ఊహించలేదని అన్నారు. ఎన్‌సైక్లోపేడియా బ్రిటానికా. (13 th ed. Vol 6; P. 10) లో ఆపాట ఆవిధంగా విప్లవ మహాగీతమౌతుందని అతడెన్నడూ కలగనలేదని వ్రాయబడింది. ఇది సత్యదూరం. అది తెల్లదొరల ప్రచారం మాత్రమే.

బెంగాలీ సంస్కృతపదాల మిశ్రమం కావటంవల్ల బంకిం స్నేహితులు కొంతమందికి వందేమాతరం నచ్చలేదు. కాని బంకిం దాని ఉజ్వల భవిష్యత్తును గురించి నిశ్చయంగా ఉన్నాడు. తన మిత్రులు చేసిన విమర్శ వల్ల బంకిం నిరుత్సాహపడక ఆనందమఠంలో దాన్ని ఉంచటానికి సాహసించాడు. దానివల్ల అద్భుతమైన ప్రభావం కలుగుతుందని అతడాశించాడు. అది చదవగానే జాతి యావత్తూ ఆవేశంతో యుద్ధంలోకి దూకుతుందని అతడనుకున్నాడు. అయితే అది వెంటనే జరగలేదు. లోతుగా పాతుకొని ఉన్న దాస్యదృక్పథమూ, అశక్తత, స్వార్థపరతా దానికి కారణం. బంకిం దానికి ఎంతగానో వ్యథచెందాడు.

ఆనందమఠం 1880 నించి రెండుసంవత్సరాలు వంగదర్శన్ పత్రికలో సీరియల్‌గా పడింది. 1882లో ప్రథమ ప్రచురణ పుస్తక రూపంలో వచ్చింది. అప్పుడు కొద్దిమంది మాత్రమే అందులోని విప్లవ విస్ఫులింగాన్ని పసిగట్టారు. వారిలో 'బాంధవ' సంపాదకుడు కాళీప్రసన్న

ఘోష్ ఒకడు. 6-1-1883 లో అతనికి వ్రాసిన లేఖలో బంకిం తన హృదయవ్యధను ఈరకంగా స్పష్టపరిచాడు. "ఆనందమఠం వ్రాసినందు వల్ల నాకు ప్రయోజనమేమిటి ? దాని విశిష్టతను వివరించినందువల్ల నీకు వచ్చిందేమిటి ! పరస్పరాసూయతో కేవల స్వార్థంతో నిండిన ఈ మను షులమీద ఏఆశా కలగటంలేదు. 'వందే ఉదరం' వారికి సరియైన నినాదం".

విప్లవానికి సరియైన సమయం రాలేదని గుర్తించటానికి బంకింకు ఎక్కువకాలం పట్టలేదు. అయితే కాస్త ముందో వెనకో వస్తుందని మాత్రం ఆతనికి తెలుసు. ఒకసారి తన కూతురుతో ఇలా అన్నాడు : "ఇరవై ముప్పై సంవత్సరాలతర్వాత ఈపాట వింటే చాలు బెంగాలంతా పిచ్చెక్కిపోయేరోజు వస్తుంది. దీంతో బెంగాల్ తన కాళ్ళమీద తాను నిలుచుంటుంది" (Resurgent-India P. 189) ఒక్క బెంగాలే కాదు యావద్భారతమూ ఆ పాటవల్ల ఆవేశం పొందింది. భారత ప్రజాకోటి ఏకకంఠంతో దాన్ని పాడింది.

వందేమాతరం గురించి పలుకుతూ సురేంద్రనాథ్ బెనర్జీ ఇలా అన్నాడు. "దార్శనికులు ఆశాబీజాలను చల్లుతారు. వాటిలో కొన్ని సారవంతమైన క్షేత్రంలో పడుతవి. కాలక్రమాన, వాటి ఆంతర సహజ శక్తివల్ల అవి అంకురిస్తవి. అవి ఆశ్చర్యకరంగా పెరిగి భావితరానికి వర్ణనాతీత శ్రేయస్సును తీసుకువస్తవి". ఈ మాటలు సత్యమని ఋజు వైనది.

1872 లో బంకిం ప్రారంభించిన 'వంగదర్శన్'ను గూర్చి రవీంద్ర నాథ్ ఠాగూర్ ఇలా అన్నారు - "అప్పుడు బంకించంద్రుని వంగదర్శన్ బెంగాలీ హృదయాలలో తుఫానురేపుతూ వచ్చింది. ఎప్పటికప్పుడు వచ్చే నెల సంచికకోసం వేచిఉండటం చాలా కష్టంగా ఉండేది; అంతకంటే

సహించరానిది ఏమిటంటే పెద్దవాళ్ళు చదివి ఇచ్చిందాకా వేచి ఉండవలసి రావటం" దాని ఆకర్షణ అలా ఉండేది.

ఆ పత్రిక ఆశయమేమిటి? బెంగాలీ భాషాసాహిత్యాలకు సేవ చెయ్యటమే దాని ఆశయమని స్పష్టీకరిస్తూ బంకిం ఇట్లా అన్నాడు. "ఇంకా ఇతరాశయాలు చాలా ఉన్నవి. అయితే వట్టిమాటలు దేనికి? ఉరుము లెక్కువ – వాన తక్కువ". మనస్సులో ఉన్న ఇతరాశయాలను గురించి స్పష్టంగా మాట్లాడటం అతనికి సహజమే. అదీకాక ఆ ఆశయాలు వివరించ కుండానే వికదమౌతవి. అతిప్రధాన ఆశయం జాతిని జాగృతం చేయడం. స్వాతంత్ర్య సమరానికి కావలసిన వాతావరణం నిర్మించటం. ఉరుములు లేకుండా కుండపోతగా వర్షించిన మాటమాత్రం అక్షరాలా నిజం.

బీడువారిన పాఠకహృదయాలను సారవంతమైన క్షేత్రంగా మార్చింది వంగదర్శన్. ఆనందమఠం వాటిని దున్నింది. వందేమాతరం అనేబీజం నాటబడింది. అతని జీవితసమయంలోనే 1882-1892 మధ్య ఆనందమఠం ఐదుసార్లు అచ్చువేయబడింది, దాని ఫలితం ప్రభావం – వర్ణనాతీతం. ఏటేటా అసంఖ్యాకమైన నవలలు భారతదేశంలోని ప్రతి రాష్ట్రంలో ఉద్భవిస్తున్నా అతడి ప్రభావం తగ్గలేదు సరికదా పెరిగింది. అతని రచనలన్నిటిలో ముఖ్యంగా దాని అద్భుత రాజకీయ పరిణామాలను బట్టి, 1882 లో ప్రచురించిన ఆనందమఠం ప్రధానమైనది. అందులోని కథ 1772 లో పూర్ణియా, తిర్హుట్, దినాపూర్ ప్రాంతాల జరిగిన సన్యాసి విప్లవానికి సంబంధించినది. ఆ ఆఖ్యానంలో శిఖరాయమానఘట్టం బ్రిటిష్ ముసల్మాన్ సంయుక్త బలాలమీద విప్లవకారుల మహత్తర విజయం (The encyclopaedia Britannica Vol. 6, P. 9)

బంకిం ఆనందమఠం రచనను 1880 మధ్యలో మొదలుపెట్టాడు. 15-7-1880 తేదీ నవీనచంద్రసేన్ అనే బెంగాలీ రచయితకు రాసిన ఒక ఉత్తరంలో తానప్పుడే ప్రారంభించిన ఆ నవలను గురించి ప్రస్తా

వించాడు. మహారాష్ట్రదేశపు సుప్రసిద్ధ విప్లవకారుడు వాసుదేవ బలవంత ఫడ్కే బంకిం సమకాలికుడు. సమాచారచంద్రిక, ఇంకా ఇతర బెంగాలీ పత్రికలు వాసుదేవబలవంతఫడ్కే స్వీయ చరిత్రను ప్రకటించాయి. 8-2-1880 తేదీ అది పుస్తకరూపంలో వెలువడింది. బంకిం తన నవలకు ఈ పుస్తకంనుండి స్ఫూర్తిని పొంది ఉండవచ్చు. చిత్తరంజన్ బందోపాధ్యాయ, డా॥ విమన విహారిమజుందార్, మరికొందరు రచయితలు, ఆనందమఠంలోని సంఘటనలకు, ఫడ్కే పోరాటానికి దగ్గరిపోలిక లున్నవని విశ్వసిస్తున్నారు. అతని సాహస జీవితం ఆనందమఠం రచనకు స్ఫూర్తి యిచ్చి ఉండటం సహజమే.

1857 నాటి సాయుధ స్వాతంత్ర్య సంగ్రామం అంతకుముందే జరిగింది. అప్పుడు బంకిం పంధొమ్మిదేండ్లవాడు. పట్టభద్రుడు కాబోతున్న చురుకైన కుర్రవాడు. అట్లని పుస్తకాలపురుగు కాదు. జాతీయ, మత విషయాలలో మంచి అభిరుచి కలిగి ఉండేవాడు. అందుకు గర్వపడేవాడు కూడా. కాబట్టి ఆనాటి సంఘటనలవల్ల అతడు బాగా ప్రభావితుడై ఉండటం సహజం. అంతకుముందు జరిగిన వివిధ స్వాతంత్రోద్యమాలు అతడిని ప్రభావితుణ్ణి చేసి ఉంటవనటంలో ఎటువంటి సందేహమూ లేదు.

ఆనందమఠం కృతిసమర్పణలో బంకిం భగవద్గీత 12వ అధ్యాయం నించి నాలుగుశ్లోకాలు ఉదహరించాడు. "ఇవి భక్తియోగాన్ని జ్ఞప్తికి తెస్తవి. అన్నిపనులు పరమేశ్వరార్పణబుద్ధితో చేయాలి. ఆయనయందు దృఢవిశ్వాసం ఉంచాలి. దానికి తనశక్తి చాలకపోతే శ్రద్ధాయుతమైన అభ్యాసంతోఆయనను సాధించటానికి సిద్ధపడాలి. "ఇది ఆశ్లోకాల తాత్పర్యం. కనుక ఆనందమఠం కరువును గురించో, విప్లవాన్ని గురించో, మారణాలను గురించో వ్రాసిన కథకాదు. అది ఒక గొప్ప ఆశయాన్ని భావింపజేసేది.

భక్తియొక్క అత్యున్నతరూప మీ ఆదర్శమే. ఆనందమఠం గ్రంథంలో మొట్టమొదటనే అది చిత్రించబడింది.

ఒక దట్టమైన అడవిలో అర్ధరాత్రి నిశ్శబ్ద మహాంధకారంలో ఒక మనుష్య కంఠస్వరం వినిపిస్తుంది.

"నా కోరిక తీర్చబడదా ?"

"దానికి నువ్వెంత మూల్యం చెల్లించటానికి సిద్ధంగా ఉన్నావు ?" సమాధానంగా ప్రతిప్రశ్న వచ్చింది.

"నా ప్రాణమూ, నాదన్న సమస్తమూ"

"నీ ప్రాణం అంత అవసరం కాదు; అయినా అది ఎవరైనా త్యాగం చెయ్యగలరు"

"మరి నేనింకేమి అర్పించగలను? మూల్యమేమిటో చెప్పు"

"భక్తి"

ప్రాణాన్ని అల్పంగా పరిగణిస్తూ, మృత్యుభయాన్ని బహిష్కరిస్తూ భక్తి మానవ మనస్సుయొక్క సరిహద్దులను హఠాత్తుగా ఉప్పెనలాగా ఆక్రమించి కాంతిమంతం చేస్తుంది. ఆ భక్తికి కేంద్రం మాత – మాతృభూమి సంకేతం.

పదవభాగంలో ఆమె వర్ణన వస్తుంది. బంకిం చతురంగా, ఉచితంగా చిత్రణ చేస్తాడు.

ఆనందకర చంద్రికలో రెండుమూర్తులు నెమ్మదిగా నడుస్తవి. మహేంద్రుడు మాట్లాడేస్థితిలో లేడు. గాఢవ్యధతో, కొంచెం తలబిరుసుగా, కొంత కుతూహలంతోనూ ఉన్నాడు.

భవానందుడు మరొకరకంగా ఉన్నాడు. వశపరచుకోరాని ధీరుడైన సన్యాసిగా అతడిక ఎంతమాత్రం లేడు. అతడిక కఠినుడైన సైన్యాధికారి కాడు. ఒకక్షణంక్రింద మహేంద్రుణ్ణి వినతుణ్ణిచేసిన కర్కశుడూ కాడు.

వెన్నెలలో స్నానమాడిన ఆ చెట్ల సౌందర్యంమధ్య అతడి మనస్సు చంద్రుణ్ణిచూచి ఉప్పొంగే సముద్రంలాగా నాట్యం చేస్తుంది. భవానందుడు ఉత్సాహిగా మారి మైత్రీసంభాషణకు కుతూహలపడతాడు. మాట్లాడాలని అతని కనిపిస్తున్నది, చాలాసార్లు ప్రయత్నిస్తాడు. కాని మహేంద్రుడి నించి తగిన సమాధానం రాదు. అప్పుడు భవానందుడు తనలో తాను ఇలా పాడుకుంటాడు.

*వందేమాతరం !*
*సుజలాం సుఫలాం*
*మలయజశీతలాం*
*సస్యశ్యామలాం*
*మాతరం !*

హృదయాత్మ పూర్ణంగా అతడు మహాభక్తితోపాడుతాడు. కర్ణ పేయమైన అతడి పురుష కంఠస్వరం ధ్వనించి ప్రతిధ్వనించి దిక్ప్రాన్నంతటినీ శబ్దతరంగాలతోనింపి వర్ణనాతీతమైన వాతావరణాన్ని సృష్టిస్తుంది. అయితే అక్కడున్నది నడుస్తున్న ఆ యిద్దరు మాత్రమే

మహేంద్రుడు ఆ పాటవిని ఆశ్చర్యపడతాడు. అది అతనికి అర్థం కాలేదు. నదులచే, ఫల వంతములైన వృక్షాలచే పర్వతముల చల్లని గాలులచే పోషించబడే ఆతల్లి ఎవరని ప్రశ్నిస్తాడు.

భవానందుడు ఈ ప్రశ్నను అంతపట్టించుకున్నట్లు కనిపించడు. అతడు పాటలో మునిగిపోయి ఉన్నాడు. అతనికి సమాధానం చెప్పటానికి ఆగకుండానే పాటను ఇలా కొనసాగిస్తాడు.

*శుభ్రజ్యోత్స్నా పులకితయామినీం*
*ఫుల్లకుసుమిత ద్రుమదళశోభినీం*
*సుహాసినీం సుమధుర భాషిణీం*
*సుఖదాం వరదాం మాతరం !*

మహేంద్రుడు మొదట అది దుర్గాదేవి ఆవాహనము కావచ్చునను కుంటాడు. మళ్ళీ అది కాదనిపిస్తుంది. అది ఒక దేశవర్ణనమేకాని దుర్గా దేవతా వర్ణనకాదు. ఆ అంశం వచ్చేప్పటికి భవానందుడు మాట్లాడాలను కుంటాడు. ఆ పాట అర్థమూ, అతడి జీవిత మార్గమూ వేరుకాదు. అతడు దాన్నిలా వివరిస్తాడు 'మేము ఏ పరమాతనూ అంగీకరించము. జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ. మాతృభూమే మాతల్లి. ఆమెకాక మాకు వేరే తల్లి, తండ్రి, సోదరులు, భార్య, పిల్లలు, ఇల్లులేక వ్యక్తిగత జీవితం ఏదీలేదు. మాకున్నదల్లా సుజలా, సుఫలా మలయజశీతలా - ఒక్కటే.

అప్పుడు మహేంద్రుడికి ఆ పాట ప్రాధాన్యం అర్థమవుతుంది. భవానందుణ్ణి ఆ పాట కొనసాగించమని అడుగుతాడు. అతడు పాడు తుంటే ఇతనికి కంటివెంట అశ్రువులు జాలువారుతవి. కొద్దిసేపటి కిందనే అతడు ప్రభుత్వధనాన్ని తీసుకెళ్ళే ఒక బండిని ఆపి హరి హరి అని అరుస్తూ కత్తి జళిపించి రక్షకులను ఎదుర్కొన్నాడు. నిర్దాక్షిణ్యంగా ఎదుర్కొమని తన అనుయాయులతో చెప్పటం, కొద్దిపాటి యుద్ధం, జరిగింది. రెండువందలమంది ఉన్న ఒక పటాలానికి నాయకుడై రక్షకులను చంపటానికి, ప్రభుత్వ ధనాన్ని లూటీ చేయటానికి సహాయపడిన అతడి కంటి వెంట బాష్పములు! ఒక దొంగ కన్నీరు కార్చగలడా ? మహేంద్రుడు ఆశ్చర్యపడి ఇలా అడిగాడు.

"ఎవరు నువ్వు"

"మేము బిడ్డలం"

"ఎట్లా బిడ్డలు ? ఎవరి బిడ్డలు ? "

"మహామాత బిడ్డలం"

"పిల్లలు దొంగతనాలు, దోపిడీలు చేసి తల్లికి పూజించడమా ?అది ఎలాంటి భక్తి ? "

"అది దొంగ తనము లేక దోపిడి ఎట్లా అవుతుంది ? అది ఎవరి ధనం ?"

"అది ప్రభుత్వ ధనం కాదా ?"
'పాలించనిది ప్రభుత్వ మెలా అవుతుంది ?'
'ఏదో ఒక రోజు పోలీసులు నిన్ను కొలుస్తారు'
'దాని కేమిటి. ఎవరమైనా ఒకసారే చస్తాము. రెండుసార్లుకాదు'
'ఒకడి ప్రాణాన్ని అట్లావిసిరేసినందువల్ల ఉపయోగమేమిటి ?'

"మహేంద్రసిన్హా! పామునుచూడు. దానికి కాళ్ళులేవు. పొట్ట మీద పాకుతుంది. అంతకంటె ప్రాథమిక జీవిలేదు. అదికూడా ఎవరన్నా కాలితో తొక్కితే బుసకొడుతుంది. అయితే నీ ఓర్పుమాత్రంపోలేదు. అసహనం ఎట్లాంటిదో దేవుడికి తెలియాలి."

భవానందుడు మహేంద్రుడికట్లా దేశ దురదృష్టాన్ని వర్ణిస్తాడు. ప్రజలను బాధించే విదేశీయులను వెళ్ళగొట్టాలని ప్రబోధిస్తాడు. మహేంద్రుడు అడుగుతాడు.

"అయితే ఎట్లా ? ఎవరు చేస్తారది ?"
"నేను చేస్తాను"
"నీవు ఒంటరిగా చేస్తావా ? ఒక్కడూ దాన్ని చేయగలడా ?"
కోటికోటి కంఠ కలకల నినాదకరాళే
కోటికోటి భుజైర్ధృత ఖరకరవాలే !
"అటువంటి తల్లి నిస్సహాయురాలని ఎవరన్నారు ?"
"కానీ నువ్వొక్కడివే కనిపిస్తున్నావు"
"ఇప్పుడే నువ్వు రెండువందలమందిని చూడలేదా ?"
"ఇంకా అక్కడ ఎంతమంది ఉన్నారు ?"
"వేలకొద్దీ ఉన్నారు. ఇంకా ఎక్కువమంది వస్తారు"

అట్లా మాట్లాడుతూ వాళ్ళు నడుస్తారు. భవానందుడు మళ్ళీ పాడుతాడు. మహేంద్రుడుకూడా కలుస్తాడు. అతడు పాడుతుంటే ఇతని కళ్ళ వెంటకూడా నీళ్ళు వస్తవి. అతడుకూడా మాతృభూమి సేవకు తనను తాను అంకితంచేసుకోటానికి, ఆ శిశువులలో ఒకనిగా తనపేరు జాబితాలో చేర్పించుకోటానికి నిశ్చయించుకుంటాడు.

వాళ్ళు మఠానికి చేరేప్పటికి ఉదయమైంది. మహేంద్రుడు బ్రహ్మచారితో సహా పూజాస్థలానికి వెళతాడు. అది ఒక పెద్దగది ఎత్తయిన గోడలు. దాదాపు చీకటి. మహేంద్రుడు మొదట్లో ఏమీ చూడలేకపోయినాడు. కొద్దిసేపటికి ఒక చతుర్భుజ విగ్రహాన్ని గుర్తుపట్టగలుగుతాడు. నాలుగు చేతుల్లో శంఖం, చక్రం, గదా, పద్మము ఉన్నవి. వక్షస్థలంమీద కౌస్తుభం అలంకృతమై ఉంది. పగిలి నెత్తురు కారుతున్న తలలతో మధుకైటభులు కాళ్ళదగ్గర పడిఉన్నారు. ఎడమపక్క లక్ష్మీదేవి విరబోసుకొన్న జుట్టుతో ఉంది. ఆమె ఒక మాల ధరించి ఉంది. ముఖం చాలా భయంకరంగా ఉంది. కుడివైపు పుస్తకమూ, వీణా ధరించి సరస్వతి ఉంది. సన్నిహితులు (చెలికత్తెలు) ఆమెచుట్టూ ఉన్నారు. లక్ష్మి సరస్వతులకు పైన ఒక ఉన్నత సింహపీఠిపై రత్నాలంకార భూషితయైన ఒక దివ్యమూర్తి కూర్చొని ఉంది. గంధర్వులు, కిన్నరులు, యక్షులు, దేవతలు ఆమె ఆజ్ఞలకోసం నిలిచి ఉన్నారు.

భయ మంద్రస్వరంతో బ్రహ్మచారి మహేంద్రుణ్ణి అడిగాడు.

"అంతా చూశావుగదా ?"

"ఆ !"

"ఆపై మూర్తిని ?"

"ఆ ! అయితే ఎవరది ?"

"మహామాత"

"ఆమె ఎవరు"

"మనమెవరి బిడ్డలమో ఆ తల్లి"
"కానీ ఎవరామె ?"

"అది సమయం వచ్చినప్పుడు నీకు తెలుస్తుంది. ప్రస్తుతం వందే మాతరం అని ముందుకుపద" – ఇంకా చూస్తావు.

ఇద్దరూ నమస్కరించి ముందుకు వెళతారు. అక్కడ మహేంద్రుడు విలువైన ఆభరణాలతో అలంకరించబడి ఎంతో అందంగా ఉన్న ఒక విగ్రహాన్ని చూస్తాడు. మహేంద్రుడు అడుగుతాడు "ఇది ఏమిటి"

"మాత ఇంతకుముందరి రూపం"
"దీని అర్థమేమిటి ?"

"ఆటవిక జంతువులను కాళ్ళకింద తొక్కివేసి వాటి నివాసంలో ఆమె పద్మపీఠంపై వెలసింది. ఆమె అపార సౌందర్యరాశియై అరుదైన ఆభరణాలతో అలంకరించబడి ఉంది. ఆమె సంపదలకు అధిదేవత. ఆమెకు నమస్కరించు. ఆ భూమాతకు మహేంద్రుడు పరమభక్తితో నమస్కరిస్తాడు. అప్పుడు వాళ్లు కటికచీకటిగా ఉన్న ఒక భూగృహంలోకి వెళ్తారు. అక్కడ ఒక భయంకర కాళీవిగ్రహం ఉంటుంది. మహేంద్రుడు వణికిపోతాడు.

'చూడు ! తల్లి ఎలా ఐందో ! '
'కాళీ ! '

'కాళి – అంధకారావృత. సర్వమూ హరించబడిన దిగంబర. సమస్త దేశమూ ఒక శ్మశానంలా మారిపోయింది. అందుకే ఆమె కపాలమాల ధరించింది. ఆమె ప్రభువే ఆమెపాదాలచెంత ఉన్నాడు !

'ఆ ! మాతా ! '
బ్రహ్మచారి కంటి వెంట అశ్రుపులు రాలినవి.

"ఆమె ఖేటము, ఖర్పరమూ చేతులలో ఎందుకు ధరించింది ?" మహేంద్రుడు అడిగాడు.

"ఆమె శిశువులం మనమే ఆమెకు వాటిని ఆయుధాలుగా ఇచ్చాము? ఇద్దరూ వందేమాతరం అంటూ ఆమెకు నమస్కరించి సొరంగం గుండా నడిచి బయటికివస్తారు. అక్కడ దేవాలయంలో ఉదయ సూర్యునికాంతు లలో వెలుగులు విరజిమ్ముతూ, మందహాస ప్రభలతో దశభుజయైన ఒక స్వర్ణ విగ్రహం ఉంటుంది. బ్రహ్మచారి ఆ విగ్రహానికి నమస్కరించి మహేంద్రుడితో అంటాడు

"ఆ మాత తాను ఉండాలనుకొనే ఇష్టరూపమిది. ఆమె పదిచేతులూ పది దిక్కులకు విస్తృతమై వుంటవి, వివిధ శక్తులకు సంకేతంగా పది చేతులలో ఆయుధాలు ధరించిందామె. ఆమె పాదాల చెంత మహారణ్య సింహాలు శత్రువులను ఎదిరిస్తవి !'

ఆ వర్ణన చేస్తూ బ్రహ్మచారి ఆవేశపరవశుడై కన్నీరుకార్చి ఇక మాట్లాడలేకపోతాడు. ఏడుపువస్తుంది. మళ్ళీ నిగ్రహించుకొని ఇలా సాగి స్తాడు" అన్ని దిక్కులలో ఆమె వివిధాయుధాలు ధరించిన చేతులు చాచింది. ఆమె శత్రువిజేత్రి. సింహవాహన. కుడిప్రక్క లక్ష్మి, ఎడమప్రక్క సరస్వతి – అదుగో ! అక్కడ కార్తికేయుడు, నిశ్చయ విజయదాత గణేశుడదుగో ! వాళ్ళకు నమస్కరిద్దాము పద !"

ఇద్దరూ ఎంతో భక్తితో సాష్టాంగనమస్కారం చేస్తారు. మహేం ద్రుడు లేచి గద్గదకంఠంతో ఇలా అడుగుతాడు.

"మనం మాతను ఎప్పటికిట్లా చూస్తాము ?"

"ఆమె బిడ్డలమైన మనమంతా ఆమెను పిలిచినప్పుడు. ఆమె అప్పుడు అనుగ్రహాన్ని చూపిస్తుంది"

మహేంద్రుడు ప్రతిజ్ఞాస్వీకారానికి ముందుకు వస్తాడు. కాని సత్యానంద బ్రహ్మచారి వెంటనే అతణ్ణి సంఘంలోకి తీసుకోటానికి ఇష్టపడడు. మనసా వాచా కర్మణా అతడు మాతృప్రేమసిద్ధిని పొందితే తప్ప తీసుకోకూడదని శిష్యులతో అంటాడు.

ఆ సంఘంలో ప్రవేశించే అర్హతను సంపాదించే పద్ధతి ఉపదేశ సమయంలో స్పష్టపడుతుంది. వందేమాతరంవల్ల ఆవేశాన్ని పొందిన మహేంద్రుడికి భయమేమీలేదు. ఉపదేశాన్ని పొందటానికి సిద్ధపడిన వాళ్ళను సత్యానందుడు ప్రశ్నిస్తాడు.

"మాతృభూమికి స్వాతంత్ర్యం వచ్చేంతవరకు ఇళ్ళు వదలుకోటానికి మీరు సిద్ధంగా ఉన్నారా ?"

"ఆ ! ఉన్నాము"

"తల్లిదండ్రులను వదిలివేయటానికి సిద్ధమేనా ?"

"ఆ !"

"సోదరీ సోదరులను ?" –

'ఆ !'

'భార్యా బిడ్డలను ?'

'నిశ్చయంగా'

'రక్తబంధువులను, ఆప్తులను ?'

'నిస్సందేహంగా'

'సంపదలూ, భోగాలూ ?'

'అన్నింటినీ వదిలివేస్తాము'

"ఇంద్రియాలను మీరు జయించగలరా ?'

'జయించగలం'

'మీ విశ్వాసాల రక్షణకు ఆయుధాలు ధరించి పోరాడగలరా ?'

'ఆ!'

'యుద్ధ రంగం నించి ఎప్పుడైనా వెనక్కు తిరుగుతావా ?'

'తిరగం'

"మీరు కులాన్ని వదలగలరా ? మాత బిడ్డలమనే దొకటే కుల మిక్కడ. ఈ పవిత్రోద్యమంలో బ్రాహ్మణుడనీ, శూద్రుడనీలేదు. ఏమం టారు ?"

'మేము ఎటువంటి విభేదము పాటించము. అంతా ఒకే తల్లిబిడ్డలము'

"ఇప్పుడు మీరు ప్రతిజ్ఞా స్వీకారానికి అర్హులు".

ఇటువంటి వాళ్ళు మాత్రమే మాతృసేవకు అర్హులు. వారు ప్రతిజ్ఞా స్వీకారంచేసి కలిసి వందేమాతరం పాడతారు. అందులో వివశులై పోతారు.

వందేమాతరం ఆశారహితుల కాశను బలహీనులకు బలాన్ని తీసుకువస్తుంది. ఒకసారి ఒక బలహీన క్షణంలో జీవానందగోస్వామి భార్య దగ్గరికి వెళతాడు, అతని భార్య 'శాంతి' ఒక ఉక్కువిల్లువంచి క్షణంలో నారిబిగించి సత్యానంద బ్రహ్మచారి పాదాల దగ్గరికి విసిరేసింది. ఆమె శౌర్యం అంతటిది. ఆమె భర్తతో ఇలా అంది-

"ప్రభూ! నీవు నాఉపదేష్టవు. నేను నీకుఎలా ధర్మాల్ని బోధించేది? నీవు వీరుడివి. నీకు నేను వీరత్వాన్ని బోధించేదా? ఇద్దరం వందేమాతరం పాడదాము." ఇద్దరూ కలిసి పాడుతారు. ఇద్దరికి కళ్ళనీళ్ళు తిరుగుతవి. ఆ అశ్రువులు తమకు కల్గిన కష్టాలకు తల్లిపడుతున్న బాధనుచూచి వందేమాతరం వారి శారీరక వాంఛలను క్షాళితంచేసి పునీతులను చేస్తుంది. అది వాళ్ళను విపత్తులు లెక్కించని సాహస ప్రయత్నులుగా దేశసేవకు సర్వార్పణం చేసినవారుగా దృఢపరుస్తుంది. అందుకే యుద్ధంలో విజయం తర్వాతకూడా జీవానందుడు శాంతితో ఇలాఅంటాడు 'నా ఆదర్శం మాతృ సేవ. ఎవరేమన్నా ఫరవాలేదు. నేను మాతృసేవ కొనసాగిస్తాను.' ఇదే

ఇంకో సేనాపతియైన భవానందునికికూడా స్ఫూర్తికేంద్రం. యుద్ధరంగంలో మహా వీరత్వాన్ని ప్రదర్శించిన తర్వాత మరణశయ్యమీదఉండి ధీరానందునితో 'ప్రియ మిత్రుడా ! నేను చనిపోయేముందు ఒకసారి వందేమాతరం వినిపించు' అంటాడు.

అప్పుడు ధీరానందుని ఆజ్ఞప్రకారం ఆ సాహస యోధులంతా వందేమాతరం పాడతారు. అది వారిభుజశక్తిని ద్విగుణీకృతం చేస్తుంది. ఆ భయంకర క్షణంలో మిగిలిన తెల్లవారుకూడా నాశనం చేయబడతారు. శత్రువెవడూ మిగలడు. అప్పుడు భవానందుడు వందేమాతరం పాడుతూ అంతిమ శ్వాస వదులుతాడు.

ఆనందమఠ మహాకథలో పాల్గొని దానిమహత్తర వాతావరణంలో పెరిగే విశిష్టపాత్రలు అత్యున్నత దేశభక్తిని మాత్రమేకాక భయంకర భుజశక్తినికూడా ప్రదర్శిస్తవి అవి అవమానితమైతే జ్వాలలుగామారే విస్ఫులింగాలు. మాతృభూమిపై తమ ప్రేమ క్రియారూపాలు.

*కోటి కోటి కంఠ కలకల నినాదకరాళే*
*కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే*

భూమిని కంపింపజేసే ఆసంఘటనలు జరిగినప్పుడు దర్శించి స్పందించి వెలార్చినవే పంక్తులు... వ్యక్తులు ఉపకరణాలుమాత్రమే,

సత్యానంద బ్రహ్మచారి పట్టుబడిన వార్తరాగానే మాత శిశువులుగా తమను పిలుచుకొన్న ఆస్వాతంత్ర్యయోధులు ఇద్దరై, పదులై, వందలై, వేలై వస్తారు. సాయుధులై, రక్తారుణ నేత్రులై, శపథోష్ఠాధరులైనవారి ముఖాలలో భయంకరమైన పట్టుదల కనిపిస్తున్నది. భవానందుడు కత్తియెత్తి వాళ్ళతో ఇట్లా అంటాడు. 'మాతృభూమిని విముక్తం చెయ్యటానికి ప్రతిజ్ఞ చేశాముమనం. ఆ నిర్దిష్టదినంవచ్చింది. మానధనుడు, మహోపదేష్ట వేద పురాణాది విజ్ఞానవేత్త, నిరాడంబర స్వచ్ఛజీవనుడు, ప్రజా, దేశశ్రేయ స్కామి, సనాతనధర్మ పునరుద్ధరణాంకితుడు, ఎవరినైతేమనం అవతార

పురుషునిగా పరిగణించి. ఆయన అడుగుజాడలలో ముక్తిని అన్వేషిస్తు న్నామో అతడు ఇప్పుడు కారాగారంలోఉన్నాడు. మన కత్తులు పదునుగా లేవా? మన హృదయాలు ధైర్యసాహసాలతో పెల్లుబకటంలేదా?

సోదరులారా! ఎవడైతే మధు, కైటభ, హిరణ్యాక్ష, హిరణ్యకశిపు, శిశుపాల, దంతవక్త్ర, కంస, రావణాది రాక్షసులను నాశనంచేశాడో, ఎవని చక్ర క్రోధానికి మృత్యుంజయుడైన శంభుడుకూడా వణికిపోతాడో, ఎవడు అజేయుడో, ఎవడు యుద్ధాలలో మనకు విజయాన్ని ప్రసాదిస్తాడో, ఆ సర్వేశ్వరునిభక్తులంమనం, ఆయనబలమే మనబాహుబలం. ఆయన సంకల్ప మాత్రంవల్ల మనం గెలువగలం'

దిగ్గిగంతాలు బ్రద్దలయ్యేట్లు ఆ మహాధ్వని వేలగొంతులనుండి ప్రతిధ్వనిస్తుంది. వేలకత్తులు ఖంగున మ్రోగుతవి. డాళ్ళు పైకిలేస్తవి. శత సహస్ర సింహనాదాలు విజృంభిస్తవి. స్వాతంత్ర్యం సాధించటానికి కదులు తుంది దశభుజమాత, దుర్గావతారం.

ఆ పోరాటాల తీక్షత, ఆ స్వాతంత్ర్య ప్రాణార్పకుల వీరుల త్యాగాలు, ఇవన్నీ అజేయమైన ఆ మాత సంకల్పానికి వ్యక్తరూపాలు మాత్రమే. తన్మహాస్ఫూర్తిచేతనే ఋషి, ప్రవక్తఐన బంకిం ఆనందమఠం వ్రాసి విమోచన మంత్రగీతమైన వందేమాతరం మనకందించాడు.

# 4. స్ఫూర్తిప్రదాయిని

అది ద్వాపరయుగంనాటికథ. నందగోపుడికి ఒక శిశువు పుట్టాడు. గోకులంలో ఉన్న కాంతలంతా ఆ బిడ్డను చూడటానికివచ్చారు. ఆ బాలుని స్నిగ్ధ సౌందర్యమూర్తి చూచినవాళ్ళ కండ్లలో మనస్సుల్లో, హృదయాలలో నిండి పండుగచేసింది. బాలగోపాలుడు ప్రతిచోటా ఉండేవాడు; పెరిగి పెద్దవాడైనాడు.

బంకించంద్రుని ఆనందమఠం కాలకల్లోలాలమీద తేలియాడే పడవలాంటిది. అందులో ఒక దేవశిశువు ఉన్నాడు. ఆబిడ్డను చూచినవాళ్ళంతా ప్రేమలోపడి తమహృదాయాలను ఉయ్యాలలుగా చేసుకొన్నారు. ఇంకా ప్రొద్దుపొడవలేదుకనుక ఆబిడ్డకు జోలపాడి నిద్రపుచ్చారు. అ దేవశిశువు సంకల్పానుసారం ఉషస్సు ఉదయించింది. స్వాతంత్ర్యభానూదయం మానవుల హృదయాలలోనిండింది. స్వాతంత్ర్య దేవతార్చనకోసం పూలు వికసించినవి. ఈ సర్వవ్యాపి శిశువే 'వందేమాతరం' అది పాంచభౌతికమైన సంకెళ్ళకు కట్టువడని, కన్నులకు కన్పించని ఆవేశపూరితమైన దైవీశక్తి.

'దైవంమానుషరూపేణ' అన్నారు ఋషులు. అలానే ఏశక్తియైనా వ్యక్తులద్వారానే అభివ్యక్తమవుతుంది. వారే ఆశక్తియొక్క సత్యప్రకృతికి సాక్షులవుతారు. ఇది వందేమాతరం విషయంలోకూడా సత్యమైంది. ఆ

గీతం ధరించిన రూపాలు అనుభూతమైన సందర్భాలూ, అది ప్రతిభావితం చేసిన మనుషులు సాధించిన కార్యాలు ఒకసారి పరిశీలిద్దాం.

'వంగదర్శన్' లో 1880–82 లో ఆనందమఠం ప్రచురించబడింది. అప్పుడు నరేంద్రనాథ్‌దత్తా 18 లేక 19 సంవత్సరాల కుర్రవాడు. విశ్వవిద్యాలయంలో తెలివిగల పిల్లల్లో అతడొకడు. అతడి అభిరుచి పాఠ్య పుస్తకాలుదాటిపోయింది. అతడు విజ్ఞానపిపాసతో చేతికందినదల్లా చదివాడు. కనుక సహజంగా వంగదర్శన్, బంకింనవలలూ అతడి దృష్టిని తప్పించుకోలేక పోయినవి. తరువాతికాలంలో మాతృమూర్తినిగూర్చిన వివేకానందుని భావనకు వందేమాతరం ఉద్దీపన నొసగింది. భావన అతడి మార్గం వేరైనప్పటికీ జాతిపునరుత్థానానికి సన్యాసులనతడు సంచాలనం చేయటం ఆనందమఠాన్ని బలంగా గుర్తుకు తెస్తుంది.

1884 లో అధారచంద్రసేన్ నివాసంలో రామకృష్ణపరమహంస, బంకించంద్రుడు కలిశారు. బెంగాలీలో బంకిం అంటే 'వంగిన' అని అర్థం. చతుర ధోరణిలో రామకృష్ణుడు నిన్నేది వంచిందని బంకింను అడిగాడు. బ్రిటిష్‌వారి బూట్లతన్నులచేత తను వంచబడ్డానని బంకిం చమత్కారంగా ప్రత్యుత్తరమిచ్చాడు. అప్పుడు వాళ్ళుచాలాసేపు మాట్లాడుకున్నారు. ఆ తర్వాత రామకృష్ణుడు బంకింనవలలు చదివించుకున్నాడు. బంకిం రామకృష్ణుణ్ణి తనయింటికి ఆహ్వానించాడు కాని పరమహంసవెళ్ళటం పడలేదు. ఒకసారి ఆయన నరేంద్రుణ్ణి మరిద్దరు శిష్యులతో బంకింఇంటికి పంపాడు. ఆవిధంగా బంకింకు సన్నిహితుడయ్యేఅవకాశాలు లభించిన నరేంద్రుడు అతడివల్ల తప్పక ప్రభావితుడయిఉంటాడు. ఆనందమఠం అతడు తప్పక చదివివుంటాడు,

తర్వాత కాలంలో నరేంద్రుడు స్వామి వివేకానందుడైనాడు. స్వాతంత్ర్య సముపార్జనకు వ్యవస్థాబద్ధమైన విప్లవం జరగాలని, దానికి జన జాగృతి అవసరమనీ ఆయన అర్థంచేసుకున్నాడు. మొదట అతడు రాజకుమారులలో కొంతమందిని సంఘటితపరచడానికి ప్రయత్నించాడు.

ఆయన ఇంగ్లాండు వెళ్ళినప్పుడు మెషిన్‌గన్ కనుక్కున్న సర్. హెచ్. మాక్సిమ్‌ను కలిసి అవసరమైనప్పుడు సహాయపడవలసినదిగా ఒత్తిడి చేశాడు. ఈ విషయం ఆయనసోదరుడు భూపేంద్రనాధుడే బయటపెట్టాడు.

మాక్సిమ్‌కు మతమన్నా తత్వమన్నా మంచి అభిరుచి ఉండేది, భారతదేశంపట్ల ఎంతో సానుభూతీ ఉండేది. అంతేకాక క్రైస్తవ మిషనరీల మతాంతరీకరణ ప్రయత్నాలకు అతడు వ్యతిరేకికూడా.

మాతృభూమికోసం సమస్తమూ త్యాగం చెయ్యటానికి సిద్ధపడగల పరాక్రమవంతులు దీక్షాశాలురుఅయిన యువకులదళాన్ని దేశంమొత్తంమీద నిర్మించటం స్వామీజి ఉద్దేశం. ఆయన యువకులకిచ్చిన పిలుపు దేశమంతటా ప్రతిధ్వనించింది. ఆయన ప్రజలముందు శక్తికధిదేవతయైన కాళీమూర్తిలో మాతృభూమిని చిత్రించాడు, 'ఆపదలతో తలపడింది. మృత్యువును కౌగలించుకోటానికి సిద్ధపడిన నరసింహులను మాత్రమే జగన్మాత ఆశీర్వదిస్తుంది' అని ఆయన అన్నాడు. స్వాతంత్ర్యం సాహసవంతుల హక్కు అని చాటిచెపుతూ దేశప్రజల పిరికితనాన్ని ఆయన తీవ్రంగా ఖండించాడు. సామ దాన భేదములనే రాజనీతిఆయుధాలను సమయోచితంగా ఉపయోగించి శత్రువులను జయించి మానవకళ్యాణానికి తోడ్పడాలనేది ఆయనఅభిమతం. 'సర్వమానవాళికి సుఖశాంతులు ప్రసాదించే అవ్యక్త మూర్తి ఆ జగజ్జనని అని చాటి చెప్పండి' అని ఆయన అన్నాడు.

1897 లో స్వామీజీ ఇలా అన్నారు. 'ఇతర దేవతల ఆరాధన ప్రస్తుతానికి విడిచిపుచ్చి మాతృదేవి దివ్యమంగళరూపాన్ని మనస్సునందుంచుకొని అదే తారక మంత్రంగా రానున్న ఏబది సంవత్సరాలలో భారతీయులు దీక్షతో అనుష్ఠించాలి.' జాగృత దేవత ఈమెఒక్కరే. ఈమెను పూజించినప్పుడే మనం ఇతర దేవతలను పూజించగలుగుతాము, మనచుట్టూ కనిపించే ఈ విరాట్‌స్వరూపిణిని పూజింపలేక మ్రొక్కిన వరమియ్యని వేలుపుల వెంట బడటం దేనికి?' అని ఆయన ప్రశ్నించారు.

'ఇట్లు చూడండి! ఆదిదేవుడిక్కడ తపస్సులోఉన్నాడు. అదే రక్త పిపాసోగ్రమైన కాళి తన పరివారగణంతో అర్చనలు స్వీకరిస్తున్నది.... కాని పరమ శివుడు తిరిగి ప్రళయతాండవంచేస్తూ శత్రుసంహార కారకమైన ఢమరుకనాదం వినిపిస్తాడు, అర్చనలు స్వీకరిస్తున్న మాత తిరిగి ఆత్మబలి దానాలను ఆవాహన చేస్తుంది.'

స్వామీజీ భారతదేశ శ్రేయస్సే ఎప్పుడూ తనమనస్సులోపెట్టుకునే వాడు, ఈ దేశదాస్యవిమోచనానికి తనను అంకితం చేసుకోవలసిందిగా సోదరి నివేదితకు ఉద్బోధించారు. స్వామీజీ సహచరులైన బ్రహ్మబాంధవ ఉపాధ్యాయ, అశ్వినీకుమార్ దత్తా 1906 లో ఆమెతో చేసిన సంభాషణలు ఈ విషయాన్ని బలపరుస్తున్నవి. 'నువ్వొకసారి ఆల్మోరా వచ్చావు, అప్పటిమన సంభాషణ బహుశా నీకు గుర్తుండిఉంటుంది', అని సోదరి నివేదిత శ్రీదత్తాతో అంది.

'నాకు బాగా గుర్తుంది. బెంగాలీయువకుల అస్థికలనుండి భారత స్వాతంత్ర్యం సాధించుటకు ఒక శక్త్యాయుధాన్ని సృష్టించమని స్వామీజీ కోరారు.'

'ఆపని జరుగుతున్నది. ఆయన చాలాసార్లు మనతో చెప్పిన ఆ రెండుసూత్రాలు కర్మయోగమూ, అఖండ భారతమూ, మన నిత్య మంత్రములైనవి. మన ప్రతికార్యానికి అవే ప్రేరణనిస్తున్నవి.

'అఖండభారత్! అదికూడా మనమంత్రం' అని బ్రహ్మ బాంధవ ఉపాధ్యాయుడన్నాడు.

స్వదేశ స్వధర్మ రక్షణకు త్యాగావసరాన్ని స్వామీజీ పదేపదే నొక్కి చెప్పారు. 'సన్యాసులు స్వధర్మాన్ని రక్షించాలి. వారు భగవంతుని సైనికులు. 'హర హర మహాదేవ' భీషణ నినాదాలతో భూనభోంతరాళం నిండిపోవాలి'.

'అదుగో! సుదీర్ఘ నిశకు అంతిమ ఘడియ వచ్చింది. ఉదయం కాబోతున్నది, ఈ మన భారతభూమి యుగయుగాలనిద్రనుండి మేల్కొంటున్నది. ఎవరామెనాపగలరు? ఇంక ఆమె ఎంతమాత్రం నిద్రపోదు. ఈ భూమిమీద ఏశక్తి ఆమెను ఆపలేదు, ఎందుకంటె అదుగో! ఆ మహాకాళి తనకు తానే లేచి నిల్చున్నది.' మాతృభూమిని దేవతగా పరిగణించే ఆనందమఠనేపథ్యంలో ఈ పదాలకు మరింత ఎక్కువ అర్థంఉంది. 'హర హర మహాదేవ' 'వందేమాతరం' అన్నా ఒకదానికే సంకేతం. వాటి ఆశయం ఒకటే,

'వందలకొద్దీ బెంగాల్ యువ విప్లవకారులు వివేకానందుని సందేశం చేత ఆవేశ పూరితులై వందేమాతరాన్ని ఉచ్చరిస్తూ బాధను, మృత్యువును చిరునవ్వుతో కౌగలించుకొన్నారన్నది ఇవాళ అందరికీ తెలిసినసత్యం. (Indias Struggle for freedem P. 22)

వివేకానందుని సందేశం యువకులను ఉత్తేజపరచి ఉన్నత దేశభక్తులుగా మార్చింది. ఆ పిలుపు విని కాషాయాంబరాలు కట్టి సన్యాసులు కావటానికి వచ్చిన వారిలో చాలామంది బ్రిటిష్ రహస్యశాఖయొక్క బ్లాకు లిస్టులో ఉన్న స్వాతంత్ర్యయోధులే. 'వివేకానందుడు శరీరం వదిలిపెట్టేప్పటికి శారీరక శిక్షణకు, ఖడ్గ, ఛురిక, లాటీ మొదలైనవి ప్రయోగించటానికి సాంఘిక సేవకు, పెద్దయెత్తున ప్రజాహిత కార్యక్రమాలకు అధిక ప్రాధాన్యం ఇచ్చే సంస్థల విలువను దేశం గుర్తించగలస్థితికి వచ్చింది. తీవ్రజాతీయవాది కావటంమాత్రమేకాక ఆధ్యాత్మికజీవితం, ఆశయము, ధార్మికభావనగల పి. మిత్రా, సతీష్ ముఖర్జీల నేతృత్వంక్రింద ఏర్పడిన అనుశీలన సమితి వంటి సంస్థలు 1902 నాటికి పైకివచ్చినవి. (The Role of Honour, K. C. Ghosh P. P. 31, 32)

ఆనాటి పరిస్థితిని చిత్రిస్తూ రోమా రోలండు (The Prophets of new India P. 497) ఇలా అంటాడు. చాలాకాలంగా అణగారిపోయిఉన్న జాతీయోద్యమానికి వివేకానందుని బోధనలు బూడిదలో నిప్పురగుల్పొలేప్పట్లు

పనిచేశాయి. ఆయన చనిపోయిన తర్వాత మూడుసంవత్సరాలకు ఉద్యమం తీవ్రంగా విజృంభించింది. ఆయనతర్వాత ఈ స్వాతంత్ర్యోద్యమాన్ని వెలుగులోనికి తీసుకువెళ్ళిన మరొక మహోన్నత వ్యక్తి, ఆయన యువ స్నేహితుడు అరవింద ఘోష్. అతడు వివేకానందుని బుద్ధిసంపదకు నిజమైన వారసుడు.'

అలానే అరవిందుడు బంకింకుకూడా వారసుడు. అప్పటికి వందేమాతరం వట్టి పాట అనేస్థితి దాటిపోయి ఒకతత్వంగా ఒకజీవితవిధానంగా రూపొందింది, దాని ప్రభావంకిందికి వచ్చిన వాళ్ళు తమ ప్రాణాలు దానితో నింపుకున్నారు; తమరచనలలో, ఉపన్యాసాలలో దానినే వ్యక్తీకరించారు. అరవిందుడు వారిలో అగ్రగణ్యుడు. 1905 లో అతని భవానీమందిరమనే పుస్తకం ప్రచురించబడింది. అందులోని సారాంశమిది,



'స్వాతంత్ర్య సమరానికి మనము నడుముకట్టేముందు భౌతిక, మానసిక, నైతిక, ఆధ్యాత్మికశక్తులకధిదేవతను ఆవాహనంచేయాలి.

శక్తివల్ల మాత్రమే స్వాతంత్ర్యం సాధించగలం. ఆ పోరాటంకూడా ఒక సక్రమమైన విశాలమైనపునాది కలిగి ఉండాలి. నగరాల మలిన వాతావరణానికి దూరంగా భవానీ కాళీదేవాలయాలు నిర్మించబడాలి. వాటిననుసరించి తల్లికోసం త్యాగం చేయటానికి సిద్ధపడే ప్రజాదళాలను నిర్మించాలి. అటువంటి దళాలలో ఎటువంటి బలహీనతకు తావుండదు. అందులో అందరూ సన్యాసులుకావలసినపనేమీ లేదు. ఎక్కువమంది బ్రహ్మచారులుగామాత్రం ఉండాలి. దేశం స్వతంత్రమైన తర్వాత వాళ్ళు పెళ్ళి చేసుకోవచ్చు. భారత దేశాన్ని ఇంతకు ముందెన్నడూ లేనంత ఉన్నతికి తీసుకెళ్ళటానికి ప్రయత్నించటం ప్రతి భారతీయుని కర్తవ్యం'.

శక్తి దేవత ఇక్కడ స్వాతంత్ర్యపు ఖరీదుగా జీవితంలోని ప్రతి దానిని త్యాగం చేయాలని పట్టుపట్టుతుంది. బంకిం వందేమాతరంలో అంతర్గతంగా ఉన్నసూత్రమే అరవిందుని భావన వెనకాలఉన్న ఉత్తేజం, 'భవానీమందిరం' ఇచ్చిన కార్యక్రమం విప్లవసంస్థలమీద తగినంత ప్రభావాన్ని చూపింది. (అదే విషయంమీద వ్యాసాలు, పుస్తకాలు రావటం మొదలుపెట్టినవి. వాటిల్లో ముక్తికోన్‌పథే (which way freedom) ఇలా అంది.

'ఇంగ్లీషువాళ్ళను ఊదెయ్యటం కష్టమేంకాదు. మనం కావాలనుకుంటే తుపాకులూ తూటాలూ సంపాదించవచ్చు. మనం రహస్యంగా ఆయుధాలు తయారుచేయవచ్చు. దేశీయ సైనికులనుండి సహాయం పొందవచ్చు. అన్నానికమ్ముడుపోయినవాళ్ళు మనుషులే. వాళ్ళకూ విచక్షణాజ్ఞానంఉంది. విప్లవకారులు గనుక దేశ దుస్థితిని వాళ్ళకు బోధిస్తే తగిన సమయంలో వాళ్ళు ఆయుధాలు తప్పక అందిస్తారు.')

'వర్తమానరణనీతి' అనేపుస్తకం (Modern Techniques of war) యువకులనిలా పిలిచింది.' భయాన్ని వదలటానికి, అవసరమైతే మృత్యువును కౌగలించుకోవటానికి, గొరిల్లా యుద్ధపద్ధతిలో శిక్షణ పొందటా

నికి రండి!' వందేమాతరంలోని శక్తి ఆ ఆవేశాన్ని స్థిరంగా నిలబెట్టింది. వందేమాతరం!

తల్లికి ఒక బిడ్డచేసిన నమస్కారమిది. తల్లికి బిడ్డకు మధ్యఉన్న పవిత్రానుబంధాన్ని గుర్తింపజేస్తుందది. ఆ బాంధవ్యాన్ని శాశ్వతంగా రక్షించాలనే ప్రయత్నానికి మూర్తీభావం ఈ నినాదం. అంతేకాదు ఆబంధాన్ని ఛేదింపజూసేవారిమీద యుద్ధప్రకటనమది. మాతృభూమి అంటే తల్లిగా ఆరాధించటం జాతీయభావలక్షణం. ప్రజలంతా ఆమెబిడ్డలు. వారిమధ్యఉండే అనుబంధం జాతీయతయొక్క సారం. వందేమాతరం జాతీయతయొక్క వ్యక్తరూపం.

'బంకించంద్ర ఛటర్జీ తన ప్రసిద్ధనవల ఆనందమఠంలో స్వాతంత్ర్య ప్రియులైన సన్న్యాసుల దేశభక్తిగీతంగా వందేమాతరం రచించి ఒక జాతీయగీతాన్ని ఒక జాతీయోద్యమాన్ని అందించాడు'. (Political trends in India; prof. Balraj Madhok P. 10)

'అతని ప్రసిద్ధనవల ఆనందమఠంలోని భాగమైన అమరగీతం వందేమాతరం స్వదేశీఉద్యమపు రోజుల్లో జాతీయతకు చిహ్నమైంది. అది భారతదేశమంతా వ్యాపించి జాతీయగీతంగా అందరి పెదవులమీదా నాట్యంచేసింది. (Mahayogi R. R. Diwakar P. 4)

'ముప్పైరెండు సంవత్సరాలక్రిందట బంకిం ఈ మహాగీతాన్ని వ్రాశాడు. కాని అప్పుడు కొద్దిమందే విన్నారు. కాని ఒకానొక దివ్యక్షణంలో జాగ్రత వంగప్రజల మనోనేత్రాలకు సత్యస్ఫూర్తి గోచరించింది. ఏదో ఒక విధిప్రేరిత క్షణంలో ఎవరో ఒకడు వందేమాతరం పాడాడు. అది మహామంత్రమై ఒక్కరోజులో ప్రజలంతా దేశభక్తిమతానికిమారారు. మాత తనను తాను వ్యక్తీకరించుకొంది. ఒకసారి ప్రజలకు ఆ దర్శనంకలిగితే చాలు దేవాలయం సిద్ధమై విగ్రహ ప్రతిష్ఠాపన జరిగి బలిదానంచేసేవరకు విశ్రాంతిగాని, శాంతిగాని, నిద్రగాని ఉండజాలవు' అని అరవిందుడు

అన్నాడు. వందేమాతరం మనజాతిని ఆవరించిన పెనునిద్రను పోగొట్టింది. సుదీర్ఘరాత్రి ఆఖరుశ్వాస తీస్తున్నది. మహాకాళి మళ్ళీ పూర్ణ విజృంభణంతో లేచి నిల్చున్నది.

సోదరి నివేదిత తన పాఠశాలలో వందేమాతరం ప్రార్థనగీతంగా ప్రవేశపెట్టటంద్వారా యువతరాన్ని ఉత్తేజితం చేద్దామని భావించి 'ప్రతిరోజూ పాఠశాలకార్యక్రమం అలంకృతమైన శ్రీరామకృష్ణుని చిత్రంముందు సామూహికంగా సంస్కృత ప్రార్థనలు చేయటంతోనూ, వందేమాతరం పాడటంతోనూ ప్రారంభమయ్యేది' (Sister nivedita - Parivrajika Atmarpana P. 159)

ఆరోజుల్లో వందేమాతరంచేత ప్రభావితమైన పత్రికలలో 'సంధ్య' మొదటిది. ఆ పత్రిక సంపాదకుడు బ్రహ్మబాంధవ ఉపాధ్యాయుడు వందేమాతరంతో ప్రేరితుడై చివరివరకు సన్యాసిజీవితాన్ని నడిపిన జాతీయ వీరయోధుడు. అతడు 1861 లో కలకత్తాకు దగ్గర ఒక పల్లెటూరిలో పుట్టాడు. అతడు బంకిం నవలలవల్లా, సురేంద్రనాథ బెనర్జీ ఉపన్యాసాలవల్ల ఉత్తేజితుడై జాతీయ కార్యక్రమాన్ని స్వీకరించడానికి నిశ్చయించుకున్నాడు. 1905లో అతడు 'సంధ్య' ప్రారంభించాడు. తనరచనలవల్ల ప్రభుత్వపు ఆగ్రహానికి గురికాగలనని తెలిసికూడా అతడేమాత్రం జంకలేదు. పరమ పూజ్య మాతృభూమి దాస్యవిమోచనమే అతని జీవితశ్వాస.

'సమర కార్యంలో వచ్చేమృత్యువు మృత్యువుకాదు అమరత్వమే'.

అతడు చనిపోయినదాకా బ్రిటిష్ పాలకులు అతణ్ణి వేధిస్తూనే ఉన్నారు. పునః పునః ఆతడి పత్రిక ప్రజాసంక్షోభం కలిగిస్తున్నదనే ఆరోపణలపై కేసులు పెడుతూనేవున్నారు. కానీ అతడేమాత్రం భయపడేవాడు కాదు. 13-8-1907 సంచికలోని అతడి రచన విద్రోహకరమైనదిగా ప్రకటించబడి అగష్టు 30వ తేదీన పత్రికకార్యాలయం సోదాచేయబడింది. సెప్టెంబరు 3వ తేదీ సంపాదకుడు అరెష్టుచేయబడి జామీనుమీద విడుదల

చేయబడ్డాడు. అయితే అతని రచనల తీవ్రత ఎంతమాత్రం తగ్గలేదు. కల్లోలాన్ని కలిగించిన నేరంమీద కేసుపెట్టబడిన ఆవ్యాసపు శీర్షిక 'నేను ఇప్పుడు దేశభక్తితో తాగిఉన్నాను' ఆనందమఠంలోని సన్యాసుల వలెనే అతడు జన్మభూమిని ప్రతిష్ఠించాడు.

'ఉప్పు, పంచదారల వరకు మాత్రమే మన స్వదేశీ ఉద్యమం పరిమితంకాదని మేముఎన్నో సార్లుచెప్పాము. మాఆశలు హిమాలయాలకంటె ఉన్నతమైనవి. మాబాధ ఎంత తీవ్రమైనదంటే మాలో ఒక అగ్నిపర్వతం ఉంది. మేము కోరేది భారతదేశ దాస్యవిమోచనం. భారతదేశం స్వతంత్రం కావటమూ, విదేశీయులనుమాయిండ్లనించి వెళ్ళగొట్టటం, ఋషిసంప్రదాయం విజ్ఞాన, నాగరికతాక్రమం పరిరక్షించబడటం మాధ్యేయం.'

'మొదట మాతృదాస్య బంధాన్ని వదిలించు. తరువాత ఆత్మముక్తిని అన్వేషించవచ్చు. మాహృదయాలలో ఆ వాంఛావహ్ని రగుల్కొన్నది, మాకు స్వర్గమిచ్చినా అక్కరలేదు. ముక్తికూడా అవసరంలేదు. ఓ తల్లీ నీ బంధనాలు తెగినదాకా మేమిక్కడే మళ్ళీమళ్ళీ పుట్టుచుందుముగాక! ముందు తల్లి స్వతంత్ర కావాలి. అప్పుడు ప్రాపంచికబంధాలనుండి మనకు విముక్తివస్తుంది. ఇదేమీ పిల్లాటకాదు. ఓ ఫిరంగీ! ఇదిగోనామెడ చాచి వుంచాను. దీన్ని బలిగాతీసుకో! నేను మళ్ళీ ఈ బెంగాల్‌లోనేపుట్టి ఇంకా గందరగోళంచేయటం చూస్తావు. మమ్మల్ని జడిపిస్తావా నువ్వు? మాశక్తి మానవాతీతమైనది. అది దివ్యం... మేముఅమరులం. ఇదే నిన్నుయుద్ధానికి పిలుస్తున్నాము. దేశమంతా ఎంత శక్తిమంతమైన పోటీ మొదలౌతుందో చూడు, మాతృపుత్రులంతా సిద్ధమౌతున్నారు, ఆమె ఆయుధాగారాలలో ఆగ్నేయ, వారుణ, వాయవ్యాస్త్రములన్నీ మెరుగుపెట్టబడుతున్నవి. తల్లి నాలుగుచేతులు చరచినచప్పుడు వినండి! మేము మీఫిరంగులకు తుపాకులకు భయపడుతున్నామనుకుంటున్నారా! సోదరులారా! భుజం భుజం కలపండి! విమోచనదినం సమీపించింది. ఆ స్వరం విన్నాముమేము, మరణించేముందు భారతదేశ బంధన విముక్తి తప్పకచూస్తాం'.

అతని దేశభక్తిలోని తీవ్రావేశం అట్టిది. బ్రిటిష్‌వారు తన్నెప్పుడూ బంధించారని అతని నమ్మకం, చివరిరోజుల్లో అతడు ఆసుపత్రిలో ఉన్నాడు. అప్పుడుకూడా ప్రభుత్వం అతణ్ణి బంధించి విచారణచేయటానికి సిద్ధపడింది. తల్లి యొక్క గర్వించదగిన ఆపుత్రుడు ఇదితెలుసుకొని చనిపోయేముందురోజు ఇలా అన్నాడు 'నేను ఫిరంగీ కారాగారానికి బందీగా పనిచేయటానికి వెళ్ళను. నేను ఎన్నడూ ఎవరిమాటకు బద్ధుణ్ణికాలేదు. నేను ఎవ్వరికీ అణిగిలేను, ఎవరి ఆజ్ఞాపాలకుడినికాను. ఈ జీవితచరమదశలో చట్టంకోసం వాళ్ళు నన్ను జైలుకు పంపితే నేను ఊరక చాకిరి చెయ్యటమా ? అసంభవం ! నేను జైలుకు వెళ్ళను. నాకుపిలుపు వచ్చింది. (Amar dak ese gechhe). అన్యాయాధిపతి ఆజ్ఞ నాకు ఈపాటికే అందింది'.

ఆ మహాఋషి మాటలు సత్యమైనవి. పైనించి పిలుపువచ్చింది. అతనికదితెలుసు. స్పృహలేకుండాఉండరాదనేదే అతని చివరికోరిక. అతడి జీవిత పరమధ్యేయమైన మాతృభూమి స్వాతంత్ర్యాన్ని తన చివరిక్షణాలలో ఊహించాలని భావించాలని అతడు కోరాడు. పెదవులపై వందేమాతరంతో బహుశా వీడ్కోలు పలికిఉంటాడు. నిజంగానే తన శరీరాన్ని చినిగిన చెప్పులాగా బ్రిటిష్ వాళ్ళమీద – వాళ్ళు తనమీద చేయివేయకముందే – విసిరేశాడు.

ఆనందమఠంలోని సన్యాసులలాగా ప్రతిఇంటినించీ ఒక మనిషి సంఘకార్యంకోసం తనను అంకితం చేసుకోవాలనీ, ప్రతితండ్రీ మాతృభూమి సేవకోసం ఒకకుమారుని అర్పించాలనీ అతడు గట్టిగా చెబుతుండేవాడు. దేశభక్తుడైన ఆయోగికి లభించిన స్వచ్ఛందమరణం యువకులకు క్రొత్త ఉత్తేజాన్ని కల్గించింది. అయనచెప్పినట్లు అది ఒక పెనుతుఫానునురేపింది.

వందేమాతరంను గురించిన విశాలతర దర్శనాన్ని అదేపేరుగల ఒక పత్రికనుండి పొందవచ్చు. మొదటిమాట అది వందేమాతరం భావనచే ఉత్తేజితమైంది. రెండవది దానిచే ఉత్తేజితుడైన అరవిందుని చేతుల్లో అది ఉంది.

'అరవిందుడు బంకించంద్రుని వందేమాతరం గీతానికి కొత్త భాష్యాన్ని ప్రవచించాడు, ఇప్పుడది ఒక బెంగాలీ నవలలోని ఒక నామ మాత్రావశిష్టపు స్థితినించి ఎదిగి ఒక్కఊపులో ప్రతి భారతీయ స్త్రీ పురుష శిశు అధరంపై నాట్యమాడింది. (Sister Nivedita - Moni Bagchee P. 125)

1905 నాటి బారిసాల్ దురంతాల తర్వాత జాతీయశక్తులు బ్రిటిష్ ప్రభుత్వంతో కఠినంగా తలపడటం అవసరమని భావించినవి, దేశభక్తి భావనను వ్యక్తపరుస్తూ స్వాతంత్ర్యంకోసం ప్రజలను ప్రతిజ్ఞాధారులను చేయగల ఒక సాధనం అవసరమైంది. ఈ ఉద్దేశాన్ని దృష్టిలోపెట్టుకొని బిపిన్‌చంద్రపాల్ 500/- చిన్న పెట్టుబడితో వందేమాతరం అనే అంగ్ల దినపత్రికను స్థాపించాడు. వందేమాతరం భావనలోని సత్యాని కను గుణంగా మాతృభూమిఅంటే మనం పూజించే దేవతలందరి కూడికే అని అతడు విశ్వసించాడు. ఒకప్పుడు స్వప్నమాత్రంగాఉన్న వందేమాతరం ఒకనిజమైన నిర్దిష్టమైన ఉత్తేజకర చిహ్నంగా పరిణతిచెందినదని బిపిన్ చంద్రుడు ఉద్ఘోషించాడు.

వందేమాతరం మొదటిసంచిక 1906లో ఆగష్టు 6వ తేదీన విడుదలయింది. డిసెంబరునించి అరవిందఘోష్ దాని పూర్తి యాజమాన్యాన్ని స్వీకరించాడు, శ్యామసుందర చక్రవర్తి, హేమేంద్రప్రసాద్, విజయచంద్ర ఛటర్జీ, ఇంకా మరికొందరు ఉత్సాహవంతులైన యువకులు అతనికి సహాయం చేయటానికి సిద్ధంగాఉన్నారు. భారతీయ జాతీయోద్యమ చరిత్రలో ఒక క్రొత్త అధ్యాయం ప్రారంభమైంది. ఏవోకొన్ని సౌకర్యాలకోసం బ్రిటిష్ ప్రభుత్వానికి అర్జీలు పెట్టుకునే పద్ధతిని తిరస్కరిస్తూ వందేమాతరం ఇలా పలికింది 'భారతదేశం ఎప్పటికైనా రాజకీయస్వాతంత్ర్యాన్ని పొందితే అది తన స్వప్రయత్నాలద్వారా మాత్రమే జరుగుతుంది' (22-8-1906)

అర్జీలు, అభ్యర్థనలు, నిరసన ప్రదర్శనలు బ్రిటిష్‌వారిముందు నిరర్థకమనిచెబుతూ ఆ పత్రిక ఇలావ్రాసింది. 'ప్రతి జాతికి తన జీవన

విధానాన్ని ఎన్నుకోటానికి హక్కుంది. భారతదేశం పునరభ్యుదయాన్ని పొందాలంటే ప్రజలు ప్రభుత్వాన్ని స్వీకరించటమే మొదటజరగాల్సినపని. జాతి నైతికాభివృద్ధికి లేక పారిశ్రామిక సాంఘికాభ్యుదయానికి ప్రయత్నించే ముందు మొట్టమొదట జాతియొక్క సర్వశక్తులూ ఈ ఆదర్శం నిజంచేయటానికే కేంద్రీకరించబడాలి.'

ఆ పత్రిక ఇలా ప్రకటించింది 'స్వాతంత్ర్య సంగ్రామం ఒకసారి మొదలుపెడితే ఇక ఏమైనాసరే చివరిదాకా కొనసాగించాలి. ప్రజలు పొందిన హింసలు స్వాతంత్ర్యసమారాధనలో వారికి ఉపదేశములవంటివి దమనకాండ విశ్వాసాన్ని అణగద్రొక్కలేదుసరికదా దాన్ని దృఢపరుస్తుంది. సత్యనిష్ఠులు నిష్కపటులుఐన మనుష్యుల నెత్తురులో ఒకసారి నాటుకున్నదంటే స్వాతంత్ర్య బీజాన్ని ప్రపంచంలోని ఏశక్తి నశింపచేయలేదు. వారుతమ విశ్వాసాన్ని జాతిలో పాదుకొలిపి, ఏ రాజీ సాధ్యంకాకుండాచేసి, భారత భూమి స్వతంత్రమయ్యేలా చేస్తారు'. (1-12-1907)

అరవిందుడు పలికినట్లుగా 'ప్రజల మనస్సులను ప్రభావితంచేసి మార్చి విప్లవానికి తయారుచేయటంలో 'వందేమాతరం' పత్రికా చరిత్రలోనే దాదాపు అసమానం,' 19 శతాబ్దపు ప్రాతబడిన నిస్సారపు రాజకీయాలలో కొత్త చైతన్యాన్ని నింపిన గౌరవం దానిదే. రెండు సంవత్సరాలలో (ఆగష్టు 1906 నించి 1908 వరకు) అది ఎంతో ప్రభావాన్ని ప్రసరింపజేసి, స్థిరత్వాన్ని పొందింది. రాజకీయ పోరాటమంటే తెగించి బలంతో అమీ తుమీ తేల్చుకోటమేననీ, క్రూర ప్రభుత్వంనించి శక్తిద్వారా దృఢ నిశ్చయంద్వారా అధికారాన్ని హస్తగతంచేసుకోవాలనీ కుండబద్దలుకొట్టినట్లు విస్పష్టంగా ప్రతిపాదించింది. 'స్వాతంత్ర్యవరం చౌకబజారులో కొనటానికి దొరకదు. అదిరాజనీతితో, రక్తతర్పణంచేసి తీవ్ర సంగ్రామంచేత సాధించవలసింది. స్వరాజ్యాన్నిగూర్చి వట్టిమాటలవల్ల అదిరాదు, స్వరాజ్య జీవితాన్ని మనలోని ప్రతిమనిషి ఆచరణలో పెడితే అప్పుడు స్వరాజ్యం దానంతట అది వస్తుంది.' కష్టంనుంచి సుఖానికి, చీకటినుంచి వెలుగుకు

బలహీనతనించి బలానికి, సిగ్గునుండి అతిశయానికి అడ్డుత్రోవలులేవు. సమర్పణా భావమొక్కటే జాతి పురోగతికి శరణాగతి" అని ఆపత్రిక ఎలుగెత్తిచాటింది.

దేశభక్తుల జీవితాలు అనందమఠంలోని సన్యాసుల పద్ధతిలో తీర్చి దిద్దబడాలి. 'సంశయ మనస్కులైన కార్యకర్తలచేత పరమేశ్వరుడు సేవింపబడలేడు. భవిష్యత్తులో జాతీయవాదుల కార్యం చాలాకఠినంగా ఉంటుంది. వీరుడు – ప్రాణార్పకుడు–వజ్రసంకల్పము, వజ్రహృదయము కల మనిషి, అలసటయెరుగని విశ్రాంతికోరని తీవ్రయోధుడు, పుట్టుకతోనే నాయకుడైన కార్యశూరుడు. దేశం బానిసయైయుండగా నిద్రింపలేని విశ్ర మించలేనివాడు మాతృదేవీపీఠముచెంత శరీరమునుంచి గుండెనుచీల్చి కారే నెత్తురుతో అర్చించగల కాళీ అర్చకుడు, అగ్నితుల్యహృదయం, తన చిరుమాట ఆత్మార్పణాన్ని కార్యోత్సాహాన్ని ప్రేరేపించగల జ్వాలాజిహ్వ. వీటికి అవసరమైన సమయం వస్తున్నది. త్వరలోనే పిలుపు వస్తుంది. ఎందుకంటే యుద్ధం దగ్గరలోఉంది. రణభేరి మ్రోగుతున్నది."

తిమిరచ్ఛటలను చీల్చుకొని బయటపడేందుకు స్వతంత్ర వీరులు సన్నద్ధమౌతున్నారు. జాతీయతావృత్తిని ఎవరూ తేలికగా తీసుకోరాదు. తల్లి కోరేది తన కత్తికి మంచి గట్టి ఉక్కు, తనకోటకు గట్టి నల్లరాయి, తనవింటికి విరుగని కొయ్య, తన రథపుటిరుసుకు గట్టి వస్తువు – ఎందు కంటే యుద్ధం సమీపిస్తున్నది. రణభేరి మ్రోగటానికి సంకేతంకోసం చూస్తున్నది. (23-4-1908) ఇక్కడ మనం

*కోటి కోటి భుజైర్ధృత ఖరకరవాలే*
*త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ*

వందేమాతరంలోని మరికొన్ని పాదాలు ధ్వనించటం చూడవచ్చు.

'ప్రజల ముందున్న ప్రశ్న – మహనీయులైన ఋషులు పుట్టిన భారతదేశం, ఒక రాముడు, ఒక కృష్ణుడు, బుద్ధుడు శివాజీ, గురుగోవింద్ లను ప్రభవించిన భూమి శాశ్వతంగా ఒక విజేత గర్వితపాదాలచెంత పడి

ఉండటమే విధి నిర్ణయమా ? ఒక విదేశీయుని ఇష్టానికి స్వేచ్ఛకు మనజాతి భవిష్యత్తును వదిలివేయటమేనా లేక ఈ విషయాన్ని తీవ్రంగా తీసుకోని మన హక్కులకోసం పోరాడి ఈ ప్రపంచంలో దైవకార్యం చేయటానికి పూనుకోవాలా ?" "దౌర్జన్యప్రయోగాలవల్ల విశ్వాసాలు విచలితం కావు. ఉద్బుద్ధ భారతజాతి నిరంకుశ రాజదండానికి లొంగిపోయేంత శక్తి హీనమైనదికాదు" అని అరవిందుడు పలికాడు.

ఎటువంటి దుర్భరపరిస్థితి వచ్చినా బంకిం ఇచ్చిన మంత్రాన్ని ఉచ్చరించి మాతృదర్శనాన్ని పొందిన జనులు దాన్ని విజయవంతంగా అధిగమించేవారు " ఈ కొత్త పరిస్థితివల్ల నిర్జీవమైన ప్రాచీన సంప్రదాయం చేత కలుషితులు కానివాళ్లు, మహత్తరాదర్శాలు మూర్తిభవించిన వాళ్లు క్రమశిక్షణయే శక్తి రహస్యమనీ, త్యాగమే నిజమైన గమ్యమనీ, నిజమైన సూత్రం మనం శక్తిమంతులమని ప్రదర్శించటమేనని అర్థంచేసుకున్నవాళ్లు ఉదయించారు. వందేమాతరం సిద్ధాంతముయొక్క వ్యక్తరూపంగా జాతీయత-సన్యాసి గుహలో, ఫకీరు దుస్తులలో, ఒక ఆంగ్లపదం కూడ పలుకలేని, కానీ తల్లికోసం ఏ సాహసమైనా త్యాగమైనా చేయగల బాలుర యువకుల హృదయాలలో, ఈ మంత్రాన్ని స్వీకరించి సంపదల మీద గౌరవాలమీద కాంక్షలు త్యజించిన విద్యావేత్తలలో పెరిగింది. అట్టి పౌరుషవంతమైన జాతీయత అజేయము. జాతీయత ఒక అవతారము - దాన్నెవరూ చంపలేరు.

దైవకార్యార్థమై పరమేశ్వరయోజితమైన శక్తి అది అది తను పుట్టినచోటుకు తిరిగి వెళ్ళేముందు దైవనిర్దిష్టమైన పని నెరవేర్చాలి".

మాతృభూమిని దేవతగా, దేశభక్తిని మతంగా వర్ధిల్లజేసిన వందేమాతరం సిద్ధాంతాన్ని అరవిందుడు ఈమాటల్లో వివరించాడు. "నేను దైవాజ్ఞచేత పనిచేస్తున్నాను. ఆకాశాన్ని ఎంత వల్లనిమబ్బులు కమ్మినా, ఎన్నికష్టాలు, ప్రమాదాలు వచ్చిపడినా, నాకు కష్టంకాని, అసాధ్యంకానీ లేదు. నేను జాతిలో భాగాన్ని. జాతి నిద్రలేస్తున్నది. నేను వాసుదేవుణ్ణి.

నారాయణుణ్ణి...." "నీవెక్కడకుపోయినా నీజాతికిది చెప్పు. సనాతన ధర్మ పరిరక్షణకు వారంతా జాగృతులౌవుతున్నారు".

1908 మే 2వ తేదీ ఆలీపూర్ బాంబుకేసుకు సంబంధించి అరవిందఘోష్‌ను అరెస్టు చేశారు. అప్పటికే వందేమాతరంద్వారా ఆయన తన సందేశాన్ని ఇచ్చాడు (29-4-1908)

"ఒక అపారమైన అగణ్యమైన విప్లవం వస్తున్నది. ఆ సాధకులు తమ ఆశలలో ఆత్మబలిదానంలో అసంఖ్యాకంగా, అగణ్యంగా ఉండాలి. ప్రాచీన మహాయజ్ఞాలను అత్యల్పములుగా పరిగణింపజేసే మహత్తర యజ్ఞం చెయ్యాలి. ఆ యజ్ఞంలో ఆహుతి అయ్యేది మనం, మన ఆస్తి, మన ఆశలు, మన కోరికలు, మన వ్యక్తిగతమైనది సమస్తమూ. ఆ యజ్ఞేశ్వరుడు సంతృప్తిపడేవరకు మహానుభావులుసైతం ఆహుతికాక తప్పదు".

ఎంత ప్రవక్తలాగా పలికాడు! ఆ ఆహుతి ఐనవాళ్ళలో మహాపురుషుడు అరవిందుడే. అప్పటినించి ఆరునెలల్లో వందేమాతరం ప్రభుత్వపు ప్రెస్ చట్టానికి గురియైంది. దాని గొంతు నొక్కివేయబడినా దాని ఆత్మ మాత్రం అరికట్టబడలేకపోయింది. ఎందుకంటే అప్పటికే ప్రజలు బంకిం ఇచ్చిన మాతృదర్శనాన్ని పొందారు. ఆ దివ్యదర్శనాన్ని పొందిన ఒక మహత్తర జాతి, ఒక విజేత కాడికిందికి మళ్ళీ మెడవంచి వశంకావటం జరగదని చెప్పేరోజు నిజంగా సమీపిస్తున్నది.

నిషేధించబడటానికి రెండురోజుల ముందు వందేమాతరం పత్రిక తన సందేశాన్ని ఇలా ఇచ్చింది. "వందేమాతరం స్వాతంత్ర్యగీతాన్ని ఆలపించి అధికారశక్తులను అవమానించింది. వందేమాతరం ఒక దివ్య ప్రసరణము; భారతదేశాన్ని కదిలించిన ఒక విద్యుత్ ప్రకంపనము; మనలనందరినీ తన ఉపకరణాలుగా ఎన్నుకోటానికి ఎంతో ముందే సాంఘిక, ఆర్థిక, రాజకీయజీవితంలో మహావిప్లవాన్ని రేకెత్తించటంద్వారా

తన స్వయంవ్యక్తతకు భారతాన్ని సిద్ధపరచింది. మన అచ్చుయంత్రాల ద్వారా వ్యక్తం కాకముందే అది వాయుమండలంలో ఉండి తన పనిని ప్రారంభించి, శక్తులను కదిలించింది. వందేమాతరం హృత్యలను పురి కొల్పిందో నిర్మలోదారభావములను నింపిందో మన ప్రజలకు తెలుసు. ఆ పచ్చని విశాల ప్రదేశము భవిష్యత్తులో వారికి కనపడవచ్చు, కనపడక పోవచ్చు. కాని నిజమైన స్ఫూర్తికేంద్రాన్ని వారికి ద్యోతకమయ్యేట్లు చేయగల్గింది. అనమానమైన దివ్యసంపదలతో కూడిన తమ మాతృభూమి ఆ స్ఫూర్తికేంద్రం. వాళ్ళు ప్రతి చిన్న గడ్డిపరకనించి ఉత్సాహాన్ని పొందుతారు. ఎవరి ఆక్రమణకు అందని ఆ భారతీయ చండభాస్కరుని వల్ల వారి జీవితరక్తం వేడెక్కించుకుంటారు, మనకేమైనా పరవాలేదు''.

వందేమాతరం పలికిన భవిష్యవాణి తప్పిపోలేదు. ప్రతి గడ్డిపరక, ప్రతి భూరేణువు భారతీయులకు ఉత్తేజాన్ని స్ఫూర్తిని అందించటం కొనసాగించినవి.

# 5. దీక్షాధారణ

ఆకులు పట్టకముందు మొక్క వేళ్ళూనునట్లుగానే. వందేమాతరం ఒక మహావృక్షంగాపెరిగే ముందు ప్రజా హృదయక్షేత్రాలలో బాగావేళ్ళు పారింది, సమస్త జాతి జీవితంలోకి దారి చేసుకొంది.

కాంగ్రెస్ (ప్రారంభ దివసాలు) చాలా కుతూహలంగా ఉంటవి. దాని వేదికమీద బ్రిటిష్ సామ్రాజ్యగానం, చక్రవర్తి స్తుతిగీతాలూ వినబడేవి. నెమ్మదిగా జాతీయగీతాలు వినిపించటం మొదలుపెట్టినవి. కాంగ్రెస్ ద్వితీయ మహాసభలు 1886 లో కలకత్తాలో జరిగాయి. అప్పుడు బాబు హేమచంద్ర రాఖిబంధన్ అనేపాటవ్రాశాడు. అతడు అధివేశనంలో పాట పాడినప్పుడు వందేమాతరంలోని చివరి పాదాలు దానికి కలిపాడు. తరువాత రవీంద్రనాథటాగూరు కవితా హృదయం, వందేమాతరంలో అంతర్గతంగా ఉన్న దివ్యశక్తిని తెలుసుకొన్నది. 1896 లో జరిగిన కాంగ్రెస్ సభలో ఆపాటను అతడు మలహర రాగంలో కవాలీతాళంతోపాడాడు. దానిలో అది భావనలలో వేళ్ళూన సాగింది.

విత్తు బద్దలైగాని అంకురం మొలకెత్తదు. వందేమాతరం బీజం బ్రహ్మాండమైన ప్రేలుడుతో తలయెత్తింది. దేశభక్తులనెత్తురుతోనాని అది విపరీతంగా విజృంభించింది. (ఆ భయంకరమైన ప్రేలుడు ఎంత తీవ్రమైన

దంటే ప్రజలమీద బలవంతంగా రుద్దిన బెంగాల్ విభజన అనే పాషాణ ఫలకం తుత్తునియలై ఎగిరిపోయింది.) స్వదేశీ ఉద్యమమే ఆ ప్రేలుడు. ప్రజాభీష్టాన్ని సమాధిచేస్తూ ఆంగ్లపాలకులు వారి హృదయాలపై ఉంచిన బెంగాల్ విభజన అనే పాషాణాన్ని సైతం ఆ అంకురం తునాతునియలు చేసి విజృంభించింది. అదే స్వదేశీ ఉద్యమ విస్ఫోటం.

'విభజనకు వ్యతిరేకంగా వక్రగమనంతో నడచిన ఆందోళనకు స్వదేశీ ఉద్యమమని పేరు పెట్టాడు. అది అన్ని దృక్కోణాలనుండి నవీన భారతదేశ ఋషిపుంగవుడగు బంకిం చంద్రచటర్జీచే రచింపబడ్డ ప్రముఖ గ్రంథమగు 'ఆనంద మఠము' నుండి శక్తిని సంతరించుకొన్నది. నవీన భారతదేశాన్ని సృష్టిస్తున్న పునరుజ్జీవన మంత్రమైన 'వందేమాతరాన్ని అతడు భారతదేశానికి ప్రసాదించాడు'. (The Roll of Honour, పుట 128)

" 'స్వదేశీ' అంటే దేశ ప్రేమను ప్రత్యక్షంగా ప్రదర్శించడం, అదొక ఆర్థిక, రాజకీయ, ఆధ్యాత్మిక ఆయుధం. వందేమాతరానికి క్రియా రూపమే 'స్వదేశీ' ". The Legacy of Lokamanya, థియోడర్ యల్ సాయ్ పుట 96 )

బెంగాల్ విభజన పథకానికి నాల్గు దశాబ్దాల తెర వెనుక భాగవతం వుంది, 1868 లో స్టేఫర్డు సార్‌కాట్, 1896 లో ఛార్లెసు ఇలియట్ ఈ విషయాన్ని లేవనెత్తారుగాని జరిగిందేమీలేదు. భారత ప్రభుత్వ కార్యదర్శి హెచ్. హెచ్. రిస్లే నుండి బెంగాల్ ప్రభుత్వ కార్యదర్శికి విభజనను సిఫారసుచేస్తూ ఒక లేఖ 12-12-1903 నాటి భారత ప్రభుత్వగజెట్‌లో ప్రచురింపబడ్డది. ఆ లేఖ ప్రచురణ రోషపూరితమైన విరుద్ధాభిప్రాయాల్ని సృష్టించింది 14-12-1903. నాటి అమృత బజార్ పత్రిక 'దేశవ్యాప్తంగా అధ్వాన్నస్థితిని కల్పించటానికి ముందుపథకం ప్రకారం చేయబడ్డ వ్యర్థమైన చర్య'గా వర్ణించింది. ఐక్యకంఠంతో అన్ని వార్తాపత్రికలు ఆ పథకాన్ని ఖండించాయి.

ఆ పథకానికి మహమ్మదీయుల మద్దతు పూర్తిగా ఉన్నట్లు ప్రభుత్వం ప్రకటించిందిగాని అది అసత్యం. సెంట్రల్ ముస్లిమ్ సంస్థ కార్యదర్శి నవాబు సయ్యద్ అమీర్ హుస్సేన్ విభజన అవాంఛనీయము, అనావశ్యకమైనదని స్పష్టపరుస్తూ 17-2-1904 న ప్రభుత్వానికి వ్రాశాడు. లక్షలాది ప్రజల సాంఘిక, వ్యాపార భద్రతను ధ్వంసం చేయడానికి ఉద్దేశింపబడ్డ చర్యగా గణింపబడ్డట్లు 17-1-1905 నాటి 'పైసా అఖబర్' హెచ్చరించింది.

వీటినన్నింటిని లక్ష్యపెట్టక, అదే సంవత్సరం ఫిబ్రవరిలో కర్జను ప్రభువు తన తుది అభిప్రాయాల్ని బ్రిటను ప్రభుత్వానికి (Home Government) పంపి, జూన్‌లో వారి ఆమోదాన్ని పొందాడు. బ్రిటీషు పరిపాలన ప్రారంభదశనుండి ప్రజలపై ప్రదర్శించిన విపరీత దౌర్జన్యంగా దానిని జూలై 1905 లో 'ట్రిబ్యూన్' స్పష్టపరిచింది. ఆగస్టులో బ్రిటిష్ పార్లమెంటులో విభజనబిల్లు చర్చకురాగా హెన్రీకాటన్, హెర్బర్ట్ రాబర్ట్సు, ఓడానెల్, ఇతరులు బ్రిటిషువారి మంచిని దృష్టిలో ఉంచుకొనే వ్యతిరేకించారు. అయినప్పటికి ప్రభుత్వ విధానం ఏమాత్రం మార్పు చెందలేదు.

సెప్టెంబరు ఒకటవతేదీన విభజనను గూర్చిన ప్రకటనను ప్రభుత్వం వెలువరించింది. సెప్టెంబరు 29 నాటికి అవసరమైన శాసనం సిద్ధమైంది. అక్టోబరు 16 నుండి విభజన అమలులోకి వచ్చింది. అసాధ్యమైనది, అనూహ్యమైనది తక్షణం జరిగిందని ప్రజలు భావించారు. 'మనం అవమానింపబడ్డాం, అగౌరవింపబడ్డాం, మోసగింపబడ్డాం' అని, సురేంద్రనాథ్ బెనర్జీ అన్నారు. ప్రజల అసంతృప్తి అనే తుపాకిమందుపై అగ్గిపుల్ల గీచి విసరినట్లు అది పనిచేసింది.

దీనికంటే ముందే పత్రికలు ఐక్యతతో పోరాడవలసిందిగా హెచ్చరికలు చేయసాగాయి. "ఇంగ్లండుపై రాజభక్తితో ఉండడం భారతదేశానికి

ద్రోహము. ఈ క్లిష్టపరిస్థితిలో ప్రజలకు మా సలహా ఇది. దేశానికి ద్రోహంచేస్తూ ఉండడంకంటె దృఢంగా, గుండె నిబ్బరంతో ఉండండి. భగవద్గీత బోధించినట్లు మనం మరణించి వీరస్వర్గాన్నైనా పొందాలి; విజయం సాధించి భూమినైనా ఏలాలి'' అని సెప్టెంబరు 11వ తేదీన 'విహారి' వ్రాసింది.

కాని కర్జను భావన వేరుగా ఉంది. బెంగాలీలు మిగిలిన దేశప్రజలచే ద్వేషింపబడుతున్నారనే కట్టుకథను కర్జను, అతని పక్షంవారు వ్యాపింప చేశారు. ప్రభుత్వానికెట్టి బెడదలేదని, బెంగాల్ కాక మిగిలినదేశంపై ఎట్టి ప్రభావాన్ని చూపదని వారు ఆదమరచేటట్లు చేసారు, ఓ డానెల్ హెచ్చరిక కూడ నిర్లక్ష్యంచేయబడింది. శిక్కులు హిందువులు, గూర్ఖాలు హిందువులు, ప్రాచీన వీరజాతికి చెందిన రాజపుత్రులూ హిందువులేఅనుమాట మరువవద్దు' అని అతడు పలికాడు.

'బెంగాలీలకు మతంలేకపోతే దేశభక్తేలేదు, వారి బలంపై వారి నాధారపడనియ్యండి. శక్తిసంపన్నురాలైన కాళీమాతను వారిని జ్ఞాపకముంచుకోనియ్యండి. మహారాష్ట్ర వీరుడైన శివాజీ ఘనకృత్యాలను వారిని తలుచుకోనియ్యండి' అని నాయకులు ప్రజలకు విజ్ఞప్తిచేశారు. (ది రోల్ ఆఫ్ ఆనర్ పుట. 79)

బెంగాల్ శాసనసభ సభ్యుడైన చౌదరి కర్జను ప్రభువుయొక్క దుష్టభావన నీవిధంగా బహిర్గతంచేశాడు. "బెంగాలు విభజన హిందువులను మహమ్మదీయులను చీలగొట్టటానికని వేయబడిన పథకం. జాతివైర మాధారంగా భారతదేశాన్ని తమచేతుల్లో ఉంచుకోవచ్చని కర్జనుప్రభువుకు తెలుసు. పాతపగ అంతర్లీనంగాఉన్నా రాజకీయఐక్యత అభివృద్ధి ఔతుంది కాబట్టి హిందువులకు మహమ్మదీయులకు సన్నిహితత్వం ఉండడం ప్రమాద మౌతుందని అతడు భయపడ్డాడు. కర్జను అధికారిక దృష్టి అంతయూ జాతి ద్వేషానలం ప్రోదిచేయడానికి మళ్ళించాడు, అఖండ హిందూరాజ్యంనుండి

మహమ్మదీయరాష్ట్రాన్ని సృష్టించడం; కలకత్తాలో హిందూకేంద్రానికి పోటీగా ఢాకాలో మహమ్మదీయులకేంద్రాన్ని నెలకొల్పడం బెంగాల్ విభజనకు ప్రధాన హేతువు. కర్జను సంప్రదాయంలో ఈభావన అంతర్నిహితంగాఉంది. మహమ్మదీయమతం బలహీనంగా ఉండేచోట అల్పసంఖ్యాకుల హక్కులు పరిరక్షించబడాలి; అది పటిష్ఠంగా ఉండేచోట అధికసంఖ్యాకులపాలన ఆధిపత్యం వహించాలి." (ఇండియా, ఎ వరల్డ్ ఇన్ ట్రాన్సిషన్ పుట 67.)

బెంగాలును విభజించడానికి గల ప్రయోజనాల్లో తూర్పు బెంగాల్, అస్సాములలో మహమ్మదీయరాజ్యం స్థాపించడం ఒకటి అని కర్జను ప్రభువు తనంత తానే ప్రకటించాడు, 'ఇది మహమ్మదీయుల నాకర్షించే ఎర. కొంత మంది ముస్లిమ్‌నాయకులు ఆ ఎరకు లోనయ్యారు. కాని మొత్తంమీద ముస్లిమ్‌ప్రజ హిందువులతో సహకరించింది'. (ముస్లిమ్ పాలిటెక్స్, యస్, ముఖర్జీ పుట iv )

జులై 1905కు తనపథకానికి బ్రిటిషు మంత్రివర్గపు మద్దతు ఉన్నట్లు కర్జను ప్రభువుకు స్పష్టపడింది. జులై 20 నాటికి అతడు అధికారికంగా విభజనను గూర్చిన నిర్ణయాన్ని ప్రకటించాడు. బెంగాల్‌లో అంతటా అది భయోత్పాతానికి కారణమైంది ఇంతవరకు అంతర్లీనంగాఉన్న మాతృదేశంపైగల ప్రేమ పైకిపెల్లుబికి స్వదేశి ఉద్యమంగా రూపుదాల్చింది. కొద్దిమంది నాయకులచే ముందుగా ఆలోచనాత్మకంగా నిర్ణయింపబడ్డ ఉద్యమం మాత్రమే కాదిది, ప్రప్రథమంగా తూర్పు బెంగాలుకు సుదూరంగా ఉన్న కిశోర్‌గంజ్, మగురకు చెందిన అమాయిక గ్రామీణులు స్వదేశి వస్త్రమునే ధరించాలని, విదేశవస్త్రాన్ని బహిష్కరించాలని ప్రతిజ్ఞపూనారు. అరవిందుడు చెప్పినట్లు ఇది మొట్టమొదట ఎవరిబుద్ధికి తోచినది, ప్రప్రథమంగా దీనిని ఉచ్చరించినదెవరు అన్నవిషయాలు చరిత్రకందేవికావు. ఇది ఏఒక్కరి పథకం కానేకాదు. అది జాతిహృదయంలోనే ఉంది; దాన్ని భగవంతుడే బహిర్గతంచేశాడు.' అది కార్చిచ్చులాగా వ్యాపించింది.

అధికారిక ప్రకటన జరిగిన కొద్దిగంటల్లో కలకత్తానివాసులు అన్ని వర్గాల జనసందోహం కళాశాల బహిరంగప్రదేశంలో ప్రోగయింది. ఒకే కంఠంతో వారు స్వదేశి ప్రతిజ్ఞను తీసుకొన్నారు. వారు ప్రతిజ్ఞ తీసుకొన్న పద్ధతికూడా వినూత్నమైంది. వారు పెనుమంటవేసి అందులో బ్రిటిష్ వస్తువులన్నీ పడవేశారు. ఆ దృశ్యాన్ని చూట్టానికి వచ్చినవారుకూడా బ్రిటనులో తయారైన వారికుర్తా, శాలువలను మంటలకు అర్పించారు. వారి హృదయాంతరాళాలలోనున్న తీవ్ర భావాలను క్లుప్తంగా ప్రకటించటానికి ఒక నినాదం అవసరం. వారంతా ప్రశాంతంగా విదేశ వస్తువుల దగ్ధ మొనర్చుచు చూడగా ఆకాశానికెగబ్రాకిన అగ్నిజ్వాల లనే నాలుకలనుండి వెలువడినట్లు 'వందేమాతరమ్' అనే ధ్వని వినిపించింది. వేలాది ప్రజలు ఆధ్వనిని భూనభోంతరాలు నిండేటట్లు తిరిగితిరిగి ప్రతిధ్వనింపజేశారు. బంకించంద్రుడు క్రాంతదృష్టితో చూచిన రోజు వచ్చింది.

మహారాజా జ్యోతిర్మోహన్ టాగూరు విభజనను ఖండించటానికి సభ నేర్పాటు చేశాడు. సభానంతరము ప్రజలచే నామోదింపబడిన తీర్మానాన్ని రాజప్రతినిధి (వైస్రాయి)కి తెలియజేశాడు. 1905 ఆగష్టు 7వ తేదీ సంతాపసూచక నిరసనదినంగా పాటించడానికి తీర్మానించారు.

ఆగష్టు 7 వతేదీ చరిత్రాత్మకదినం. కలకత్తా పురమందిరంలో జరిగిన ఆనాటి బ్రహ్మాండమైన బహిరంగ మహాసభ సాటిలేనిది. వేలాది ప్రవాహాలు వంకరటింకరగా ప్రవహిస్తూవచ్చి సముద్రంలో సంగమించినట్లు గుంపులు గుంపులుగా ప్రజలు బయలుదేరి సాగివచ్చి మధ్యాహ్నానికి పురమందిరంచేరారు. కళాశాల విద్యార్థులు కళాశాల ప్రాంగణంలో ప్రాతఃకాలంనుండి 'వందేమాతరమ్' అని చెవులు దిబ్బెళ్ళుపడునట్లు నినాదాలు చేస్తున్నారు. 'వందేమాతరమ' ను నినాదాన్నిచేస్తూ వారొక ఊరేగింపుగా పురమందిరంవైపు సాగివచ్చారు. కలకత్తా పట్టణమంతా వందేమాతరం నినాదంతో ప్రతిధ్వనించింది. ఆక్షణంమొదలుకొని స్వాతంత్ర్య సమరానికి

నినాదమైంది. రవీంద్రనాథ్ చెప్పినట్లు 'స్వదేశీ ఆత్మ వందేమాతరం గానంలో దానంతటది ఆవిష్కరింపబడ్డది'.

అంత పెద్ద సభ ఒకచిన్న వేదికమీదనుండి జరపడం అసాధ్యమయింది. నాలుగు వేదికలను నాలుగుచోట్ల ఏర్పాటుచేశారు. ఒకే సమయంలో పలువురు వక్తలు సభలనుద్దేశించి ప్రసంగించారు. సామాన్య ప్రజానీకానికి ఆరాధ్య మూర్తులు, ఆనాటి సుప్రసిద్ధ వక్తలైన సురేంద్రనాథ్ బెనర్జీ, భూపేంద్రనాథ్ బాసు, అంబికా చరణ్‌ముజుందార్, కాశింబజారు మహారాజు ఆ సాయంత్రం ప్రసంగించారు. వక్తలు ప్రభుత్వాన్ని విమర్శించడంతో తృప్తిపడలేదు. ఆ సమస్యకు పరిష్కారంగా కొన్నింటిని సూచించారు. విదేశవస్తువుల బహిష్కరించండి, స్వదేశవస్తువుల వాడండి, విభజనను పరిహరించేవరకు పోరాటాన్ని సాగించండి. అంతకు పూర్వమెన్నడు వినబడనంతగా లక్షలాది ప్రజలు వందేమాతరమని నినాదాలు చేయడంతో సభ సమాప్తమైంది.

ఆ ఉద్యమం గ్రామగ్రామానికి, పట్టణ పట్టణానికి వ్యాపించింది. ప్రజలకు మార్గదర్శకులై నాయకులు ఒక ప్రదేశాన్నుండి మరొక ప్రదేశానికి వెళ్ళారు. ఆ సభలలో ఒకచోట సురేంద్రనాథ్ బెనర్జీ అఖండ వంగభవన నిర్మాణాన్ని గూర్చినసూచన వ్యక్తపరిచాడు. విభజనకు వ్యతిరేకంగా ప్రజలనిరసనకు చిహ్నంగా, బెంగాలు ఐక్యతకు గుర్తుగా దాన్ని కలకత్తాలో నిర్మించాలని అతడు పిలుపునిచ్చాడు. ప్రఖర దేశభక్తిని ప్రదర్శించడానికి యువకులకు విజ్ఞప్తిచేస్తూ 'మీ అంతరాంతరభావాలు వందేమాతరం యొక్క రాగ, భావములతో సంపూర్ణ సమరభావాన్ని సంతరించుకోవా'లని హితవు చెప్పారు.

నవరాత్రులు సమీపిస్తూన్నరోజులవి. బెంగాలు దేశంలో దాని ప్రాధాన్యమెక్కువ. దుర్గారాధనఉత్సవ మది. మొదటిరోజు మహాలయ అమావాస్య. ఆరోజున దక్షిణ కలకత్తాలో కాళీఘాట్‌లో 50 వేలమంది

సమావేశమైరి. వారు పవిత్ర గంగానదిలో పరిశుద్ధస్నానాలు చేసారు. వందేమాతరం పెదవులపై తాండవిస్తుండగా వారు కాళి ఆలయములో ప్రవేశించారు. గుంపులుగా వెళ్ళి కాళీమాత పావనసాన్నిధ్యంలో ప్రశాంతంగా, మనఃపూర్వకంగా ఈ ప్రతిజ్ఞను చేశారు :

" 'మాతా! నేను విదేశవస్తువుల కొనను; విదేశ దుకాణాలలో నేను కొనను; నేను విదేశీయులను పనిలో ఉంచుకోను' అని నేను ప్రమాణము చేయుచున్నాను".

యువజనులు అనుపమోత్తేజముతో ప్రమాణాన్ని అమలు చేయటానికి ముందుకువచ్చారు. "కళాశాలలకు, పాఠశాలలకు విదేశీదుస్తులలో వెళ్ళటం ప్రమాదకరమైంది. విదేశపు కాగితముపై ముద్రించిన ప్రశ్నపత్రములకు సమాధానములు వ్రాయుటకు విద్యార్థులు తిరస్కరించారు. ఏ ఒక్క విద్యార్థి ప్రశ్నపత్రము నంగీకరించలేదని నాకు తెలుసు ప్రశ్నపత్రములు స్వదేశపు కాగితములపై ముద్రించిన తరువాతనే పరీక్షలు ప్రశాంతంగా నడచాయి" అని బాబు సురేంద్రనాథ్ బెనర్జి సాక్ష్యమిచ్చారు.

"స్వదేశితత్వం గృహములలో ప్రవేశించి స్త్రీలదృష్టినికూడ ఆకట్టుకొంది. నిజానికి వారు పురుషులకంటే ఒక అడుగు ముందే ఉన్నారు. నా మనుమరాలికి అయిదోయేడు నిండలేదు. కొందరు బంధువులు పాదరక్షలు బహూకరించారు. అవి విదేశీయమైన కారణంగా తిప్పి పంపేసింది".

"ఒక ప్రసిద్ధ వైద్యుడు ఒక సంఘటనను చెప్పాడు. ఒక చిన్న బిడ్డకు జబ్బుగా ఉంది. ఆమెకు ఆరు సంవత్సరాలుకూడ లేవు. ఆమెకు స్మృతివచ్చినప్పుడల్లా విదేశపుమందు తీసుకోనని గొణుగుతూ ఉండేది. (ఎ నేషన్ ఇన్ ది మేకింగు, పుట. 182-183) వందేమాతరం యొక్క అద్భుతశక్తికి ఇది సాక్ష్యం.

విభజనకు పెట్టిన గడువు 1905 అక్టోబరు 16 రానేవచ్చింది. ఆరోజు బెంగాలులోనేగాక దేశమంతటా విచారదినంగా పరిగణించాలని నిర్ణయించారు. ఐక్యతకు చిహ్నంగా 'రక్షాబంధన్' ఉత్సవాన్ని చేయడానికి పిలుపు ఇచ్చారు.



అది రాజ్యాంగపు నిరంకుశత్వమని తిరిగి గుర్తుచేయడానికి ప్రతిచర్యగా చేయబడ్డది; దాన్ని నిరోధించడానికే ప్రతిజ్ఞ. అద్భుత రక్షాబంధన్ కార్యక్రమం (సౌభ్రాతృబంధనసూత్రము)లో ముస్లిములు, క్రైస్తవులతో సహా అన్ని మతాలవారు పాల్గొనిరి. గొప్ప, నీచ అను భేదంలేకుండా, స్పృశ్యులస్పృశ్యులను తారతమ్యం లేకుండా బెంగాలీభాష మాట్లాడే ప్రతివాడు సౌభ్రాతృ బంధన, ఐక్యతసూత్రాన్ని ఒకడు మరియొకనిచేతికి కట్టాడు. బెంగాలునుండి దూరరాష్ట్రాలలో, దూరదేశాల్లో ఉన్నవారు తమ ప్రేమసూత్రాలను దేశభక్తిసూచకంగా తపాలా (పోష్టు) ద్వారా పంపారు. (ఆరమ్డ్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడమ్, బాలశాస్త్రి హరిదాస్. పుట 165)

'విభజనకు నిర్ణయించినతేది సమీపిస్తూఉండే టప్పటికి పెనుతుఫాను అందరి హృదయాల్లో చెలరేగడం ప్రారంభించింది. బెంగాలంతా ఉద్రేకంగా నిరసిస్తూఉంది. కలకత్తా వీధులన్నీ ప్రదర్శకులతో నిండిపోయాయి. బెంగాలు దేశమంతటా భయావహ విషాద దినంగా పరిగణింపవలసిందని సూచనివ్వబడ్డాయి. ఎవ్వరూ వండినభోజనం తినకూడదు; అన్ని దుకాణాలు మూసివేయబడాలి. రాఖీ పండుగ శాశ్వత

సౌభ్రాతృ చిహ్నంగా జరుపబడాలి'. (ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఇండియా పుట 289)

'1905 అక్టోబరు 16న విభజన జరిగింది, బెంగాలు అంతటా నిరసన సభలు జరుపబడ్డాయి. బెంగాలులోని విద్యావంతులు, ఉన్నతవర్గం వారు ప్రముఖపాత్ర వహించారు' (ఇండియా, ఎ వరల్డ్ ఇన్ ట్రాన్సిషన్ పుట. 65) బెంగాలు వీధుల్లో వందేమాతరము నినాదాలు ప్రాతఃకాలంనుండి ప్రతిధ్వనించాయి. మఱియొకచేచేకి రాఖీలు కట్టడానికి ఆగుతూ, గుంపులు గుంపులుగా ప్రజలు నదీతీరానికి వెళ్ళారు. సంకీర్తన సంఘాలు పాటలు పాడుతూ ఉప్పెనవలె సమున్నత దేశభక్తితో ఉప్పొంగుతున్న మానవ సమాజాన్ని ఉత్తేజపరచారు. (ఇన్ నేషనలిస్టు మూమెంటు అండ్ థాట్ పుట 86)

బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు, ఒకప్పుడు ప్రభుత్వంలో ఉన్నతోద్యోగం నిర్వహించి, రాజీనామా యిచ్చి స్వాతంత్ర్యపోరాటంలో దుమికిన సర్ హెన్రీ కోటన్ "ఈ ఉద్యమం విద్యాధికుల తరగతికి మాత్రమే పరిమితంకాలేదు; ప్రజలలో అన్నివర్గాలవారు స్వీకరించారు. వ్యాపారులు, రైతులందరొకటిగా అందులో పాల్గొన్నారు. జాతి హృదయంలో ఈ ఉద్యమం చొచ్చుకుపోయింది" అని వక్కాణించారు.

ప్రసిద్ధ చారిత్రకులు డా. ఏ సి. మజుందార్ ఈవిధంగా అన్నారు: ఆరోజున కలకత్తాలో ప్రదర్శింపబడిన దృశ్యము వర్ణనాతీతమైంది. పట్టణమంతా వందేమాతరంతో ప్రతిధ్వనించింది. మధ్యాహ్నసమయంలో 50,000 మంది సురేంద్రనాథ్ బెనర్జీ, ఇతర నాయకులతో వట్టికాళ్ళతో క్రమబద్ధంగా ముందుకడుగులువేస్తూ రెండుమైళ్ళ దూరం నడచివెళ్ళి బహిరంగ సభకు హాజరయ్యారు. స్వదేశీ ఉద్యమాభివృద్ధికి సభలోనే రు 70,000 లు ప్రోగుచేశారు". (త్రి ఫేజెస్ ఆఫ్ ఇండియాస్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడమ్, పుట 27-28).

రాఖీల బంధిస్తూ ప్రజలు ఒక పాటను పాడుతూ ఉండేవారు; దాని ప్రారంభపంక్తులవి.

*ఒక్కటే మనమంతా ఒక్కటే*
*మనసోదరులంతా ఒక్కటే*
*లేదు లేదు ఈ భువిలో*
*దూరంచేసే ఏశకీ*
*విజయ దుందుభులు మ్రోగాలి*
*విజయ పతాకం ఎగరాలి*
*వందేమాతరం, వందేమాతరం. వందేమాతరం*

తీవ్ర వ్యాధి పీడితులై ఉన్నప్పటికీ అనుభవశాలియైన నాయకుడు. ఆనందమోహన్ బోస్ సమావేశానికి వచ్చారు. వ్యాధితో పడకమీదవుండే ఉపన్యాసపు వ్రాతప్రతిని సిద్ధంచేసి తెచ్చారు, ఆయన సభకు వచ్చేటప్పటికి సభ అంతా నిరంతరాయంగా వందేమాతరం ధ్వనితో పిక్కటిల్లిపోయింది తనకు సమీపవర్తులైనవారి సాయంతో అఖండ వంగభవనానికి పునాది రాయి వేశారు. ఆయన లక్షరూపాయలు దానికి విరాళంగా ఇచ్చారు. ఆయన ఉపన్యాసం చదువలేకపోయారు; సురేంద్రనాథే దాన్ని చదివారు. ఆ సభ దిక్కులు పిక్కటిల్లే వందేమాతరం నినాదాలతో ముగిసింది.

1903 డిసెంబరు - 1905 అక్టోబరులమధ్య 3000 బహిరంగ సభలకంటె ఎక్కువే జరిగాయి. ఈ సభల్లో బ్రిటీషు విభజన విధానాన్ని తీవ్రంగా విమర్శించబడ్డది, తీర్మానాలు చేయబడ్డాయి. 1905 అక్టోబరు 16 తరువాతకూడా అసంఖ్యాకంగా సభలు జరిగాయి. వేయి మొదలు 50 వేల వరకు ప్రజలు హాజరయ్యారు. వారిమనస్సులో సాహసాత్మకమైన నిశ్చయ భావం, ముఖాల్లో వెలిగిపోతూఉన్న ఆత్మ ప్రత్యయం, మాటల్లో జ్వాల లున్నాయి. సభలకు హాజరయినారు. ఈ సందేశాన్ని సుదూర గ్రామాల్లో వ్యాపింపచేయటానికి బాధ్యతను స్వీకరించారు,

1905వ సంవత్సరాంతానికి స్వదేశీ ఉద్యమానికి తొలికోడి కూతగా వందేమాతరం నినాదం భారతదేశమంతటా ప్రాముఖ్యం వహించింది. ఆనాటి ప్రభుత్వ గూఢచారి నివేదికల ప్రకారం సంయుక్త పరగణాలలో 23 జిల్లాలు, పంజాబులో 20 జిల్లాలు, మద్రాసులో 13 జిల్లాలు, మధ్యపరగణాలలో 15 పట్టణాలు, బొంబాయి రాష్ట్రంలో 24 పట్టణాలు స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్నాయి. (త్రీ ఫేజెస్ ఆఫ్ ఇండియాస్ స్ట్రగుల్ ఫర్ ఫ్రీడమ్, పుట 29.)

అక్టోబరు 16న ప్రదర్శనలు; ఫెడరేషన్ భవనంలో ఉపన్యాసాలు; రాఖీబంధనాలు – తప్ప మేము మరేమీ చేసేవాళ్ళం కాదు." (థంబ్‌నైల్ స్కెచ్చస్, రైట్ ఆనరబుల్ వి. యస్. యస్. శాస్త్రి పుట 147)

"భారతీయులందరు వారిమతము, రాష్ట్రము, తెగ, కులము, భాష, వృత్తి విస్మరించి దేశప్రేమ దృష్టితో ఐక్యం కావాలని జాతీయవాదులు ప్రబోధించారు. ఈ సంకల్పము, జాతీయవాదుల ఉచ్చైస్స్వరము వందేమాతరముయొక్క సామూహిక నినాదముద్వారా చక్కగా వ్యక్తపరచబడింది. (భారత) మాతకు వందనము. జాతీయవాదులు నొక్కిచెప్పిన తీవ్రమగు, భక్తియుత దేశప్రేమ ఇది. కుమారులందరకు ప్రేమపాత్రురాలగు భారతమాతకు క్లిష్టపరిస్థితులలో కుమారుల త్యాగం అవసరమైంది; ఉన్నతోన్నత గౌరవానికి పాత్రురాలు; ఆరాధ్యదైవమైన ఆమెకై కుమారులు హృదయపూర్వకంగా పోరాడుతారు, అవసరమైతే మరణిస్తారు. బెంగాలునుండి సమస్త ఉపఖండంలోను ఈ నినాదం వెల్లువలా వ్యాపించింది – వందేమాతరమ్! ఆమె కుమారులు నమస్కరించగా, భారతదేశం గగనపథానికి లేచింది". (ది లెగసీ ఆఫ్ లోకమాన్య, థియోడోర్ యల్ షాయ్, పుట 93).

'500 సభల ద్వారా రెండు సంవత్సరాలలో సాధింపజాలనిది; విదేశవస్తువుల బహిష్కరణద్వారా మూడు నెలలలో మేము సాధించాము' అని సురేంద్రనాథ్ బెనర్జీ అన్నారు.

స్వదేశీ ఉద్యమం వేగాన్ని పుంజుకోవటంతో. ప్రభుత్వానికి వ్యాకులతకూడ ఎక్కువయింది, మొదట ప్రభుత్వముయొక్క దమనకాండకు గురిఐంది విద్యార్థిలోకం, విద్యాసంస్థలును విభజనకుపూర్వం అక్టోబరు 10న డిప్యూటీకమీషనరులు, జిల్లా మెజిస్ట్రేటులు బెంగాలు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిచే పంపబడిన ప్రభుత్వ సర్క్యులర్‌ను అందుకొన్నారు. బెంగాలు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శిచే పంపబడింది. స్వదేశీకి సంబంధించిన కార్య కలాపాలైన బహిష్కరణ, ఆందోళన, విద్యాసంస్థల్లో నినాదాలు లేవ దీయడం తప్పిదాలుగా భావింపబడతవి. అట్టి సంస్థలు సహాయం విద్యార్థి వేతనాలు కోల్పోవటం తథ్యము — అనేది దానిలోని సారాంశం. ఇంతకు ఇట్టి సదుపాయాలను పొందుతున్నవాటి కవి ఆపుచేయడం జరుగుతుంది. అట్టి సంస్థలు రద్దుపరచబడుతవని విశ్వవిద్యాలయం హెచ్చరిక చేయాలి. విద్యాసంస్థలు అధికారులకు విప్లవ విద్యార్థుల పేర్లను పంపాలి.

దీనితో తృప్తిపడక, పాఠశాల ఉపాధ్యాయులు అధికారులతోకలసి శాంతిని నెలకొల్పుటకు కృషిచేయవలెను. విద్యార్థుల గౌరవాన్ని పొందిన ఉపాధ్యాయులను, దమననీతికి ఆహుతి అయిన విద్యార్థులను గుర్తించ గలిగినవారిని, ఈ పనికై ఎన్నిక చేయాలి.

తూర్పుబెంగాల్, అస్సాములకు ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి విభజనానంతరము వెనక్కుతగ్గినట్లు కనబడలేదు. దానికి అనుగుణమైన సర్క్యులర్ 8-11-1905న విడుదల చేయబడింది. దానిలో ఒక అదనపు విషయముండి; విద్యార్థులనుండి రాజభక్తి పూర్వకసేవను ప్రభుత్వం పొందజాలకున్నదిగాన, ప్రభుత్వ వ్యతిరేకశక్తుల ప్రభావంలో విద్యార్థులున్నారు కాబట్టి, అట్టి విద్యార్థులు విద్యాసంస్థలనుండి వెళ్ళ గొట్టబడాలి.

ప్రభుత్వం అక్టోబరు 25న విడుదలచేసిన సర్క్యులర్ ప్రకారం విద్యాసంస్థల ప్రధానాధికారులు పోలీసులు రిపోర్టుచేసిన విద్యార్థుల నెందుకు వెళ్ళగొట్టకూడదని డార్జిలింగు విద్యాశాఖ సర్వాధికారి అడిగాడు.

బెంగాలుకు సంబంధించినంతవఱకు ఇంతవరకు జరిగింది. కాని స్వదేశీ ఉద్యమం దేశాన్ని అంతా ఆక్రమించుతూ వుంది. 6-5-1907 న కేంద్ర ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలకు ఆజ్ఞలు జారీచేసింది. రాజకీయ మనస్తత్వముగల ఉపాధ్యాయులు, విద్యార్థుల బారినుండి ఉన్నత విద్యను రక్షించాలనే పన్నుగడతో చేసిన ప్రయత్నమిది. న్యాయవిచారణకు కొని రాబడిన నేరములకు అనుగుణమగు శిక్షలు నిర్ణయింపబడ్డాయి.

విద్యార్థులపై చేసిన దాడిని పేర్కొంటూ 'విహారి' (15-4-1906) ఈ విధంగా వ్రాసింది; బెంగాలీలు తీవ్రదేశభక్తి ప్రపూరితులని (వారు స్వదేశీ ఉద్యమాన్ని పటిష్ఠంగా జరుపటాన్నిబట్టి స్పష్టమౌతుంది. యథార్థమైన దేశభక్తిలేనట్టైన ఇంగ్లీషువారు కోపాన్ని వహించరు. స్వదేశీఉద్యమ ఫలితంగా యువకుల యందలిఅంతర్లీనశక్తి పెల్లుబికింది.

వందేమాతరమ్ నినాదాన్ని వ్యాపించకుండా ఆపడం యెట్లనేది ప్రస్తుత ప్రశ్న. ఈ నినాదమే స్వదేశీ ఉద్యమానికి ప్రధాన ఉత్తేజన కారణము. ప్రజల మనస్సుల హృదయముల దేశభక్తిజ్వాలలతో మండిస్తూ అది దేశాన్ని పెనుతుపానులో ముంచేసింది. ఆ రెండుమాటలు ప్రభుత్వానికి భయావహమైనవి. ప్రాచీన భారతేతిహాసముల చక్కగా అధ్యయనంచేసిన ఆంగ్లాధికారి ఆ నినాదమంటే కక్షతీర్చుకోవటానికి కాళీమాత మంత్రోచ్చాటన యైనట్లు వ్యాఖ్యానించాడని స్పష్టమౌతుంది. ప్రభుత్వం ఉద్యమాన్ని అణచటానికి అనాగరిక, ఆటవిక పద్ధతులకు పూనుకొంది. అది ప్రభుత్వ భయోత్పాతానికి నిదర్శనం మాత్రమే; దేశభక్తుల ఉత్సాహాన్ని క్షీణింపచేయడంలో విఫలమైంది.

విద్యార్థులు పోరాటానికికూడ అగ్రస్థానంలో నిలిచారు. 1905 నవంబరులో 200 మంది విద్యార్థులు రంగపూర్ బహిరంగసభకు హాజరై వందేమాతరాన్ని ఏకకంఠంతో గానంచేశారు. వారికి ప్రతిఒక్కరికి రు 5/-లు చొప్పున జరిమానా విధింపబడ్డది. పాఠశాల ఆవరణలో వందేమాతరం

నినాదాన్ని చేసిన మరి ముగ్గురు విద్యార్థులకు ప్రతిఒక్కరికి రు 3/-లు చొప్పున జరిమానా విధింపబడ్డది. నినాదాలు చేసిన వారి కాళ్లు విరుగగొట్ట వలసిందిగా పోలీసులకు సూచనలివ్వబడ్డాయి. విద్యాసంస్థలనుండి వెళ్ళగొట్ట బడిన విద్యార్థులకు జిల్లాలోని మరి యే సంస్థలోను ప్రవేశం ఇవ్వబడదు. స్వదేశి ఉద్యమంలో పాల్గొన్నవారిని, నినాదాలు లేవదీసినవారిని గుర్తించ టానికి పోలీసులకు హాజరుపట్టీలు సమర్పింపవలసిందిగా పాఠశాలలను జిల్లామెజిస్ట్రేటు ఆజ్ఞాపించాడు. వందేమాతరమ్ గానంచేయబడుతుందనే సభలకు, ఊరేగింపులకు ఉత్తరువులివ్వడం 11-11-1903 నాటి ప్రభు త్వాజ్ఞచే ఆపుచేయబడ్డాయి. బరిసాల్, మైమెనిసింగు, రంగపూర్ నవఖాళీ జిల్లాలలో అమలులోనికి వచ్చిన ప్రభుత్వాజ్ఞలలో ఇది ఒకటి.

అనేక పాఠశాలలో మూకఉమ్మడిగా విద్యార్థులకు జరిమానాలు విధిం చడం, పాఠశాలలనుండి వెళ్ళగొట్టడంకాని, కొట్టడంకాని జరిగింది. ఇదే సమయంలో ఢక్కా డివిజనులో కిశోర్‌గంజ్ ఉన్నత పాఠశాలలో వందే మాతరం వినిపించిది. 18-1-1906న విద్యాశాఖాధికారి ప్రధానోపాధ్యాయు నితో ఇట్లు చెప్పారు:-

"ఒకటి, రెండు తరగతుల విద్యార్థులు ప్రతిఒక్కరు 500సార్లు స్పష్టమైనవ్రాతతో, వందేమాతరం నినాదంచేయడం కాలహరణము, అనా గరకము, అవివేకమని వ్రాయవలసిందిగా కోరబడ్డారు. దీనితోపాటు విద్యార్థే స్వయంగా వ్రాశాడని ఇతరులసూచనలేదని ప్రధానోపాధ్యాయుడు వ్రాతమూలకంగా వాఙ్మూలం ఇవ్వాలి." దీని తరువాతకూడ పాఠశాలపై నేరారోపణలందిన వెంటనే పాఠశాలకిచ్చే సహాయనిధి రద్దుచేయబడుతుంది. మొదటి ప్రభుత్వాజ్ఞ ఫలితంగా 'వందేమాతరమ్' అనేధ్యానం బాలుర మన స్సులలో గాఢముద్రవేసింది. ఇదీ దీని వ్యంగ్యరూపం.

**28-11-1906 న కలకత్తాలో ఒకసంఘటన జరిగింది. కొద్దిమంది యువజనులు షాంపుకూర్‌లో సమావేశమైరి. వారు తమహృదయాలు తృప్తి**

పడేవిధంగా వందేమాతరం గానంచేసి వెళ్ళిపోయిరి. పోలీసులకీవార్త చేరింది. పోలీసు ఇన్స్పెక్టరు తగినంత బలగంతో అక్కడకు పరుగెత్తాడు. పోలీసుల కక్కడెవరు కనిపించక పోయేటప్పటికి సమీపగృహాల్లో చొరబడి ఇళ్ళలోనివాళ్ళనుగాని పెద్దవాళ్ళనుగాని యెవర్ని వదలిపెట్టలేదు. స్త్రీలమీదకూడ దాడిచేశారు.

తదితర ప్రదేశాల్లోకంటే బరిసాల్‌లో వందేమాతరమ్ ఎక్కువగా వినిపించింది అక్కడ అధికారుల కోపోద్రిక్తత హద్దులేకుండా పోయింది. కాని నినాదం అణచివేయలేకపోయారు. అది అందరి పెదవులపై నాట్యమాడింది; అన్నిగోడలపై విశ్వరూపాన్ని ధరించింది. అది సర్వవ్యాపి ఐంది. భంగపాటునొందిన జిల్లా మేజస్ట్రేటు కొంతమంది ప్రసిద్ధవ్యక్తుల్ని పిలిచి వారి నీవిధంగా బెదిరించాడు: "గూర్ఖా సైనికులకు మీ పేర్లు రిపోర్టు చేశాను. కనీసం పక్షందినాలు పట్టణాన్ని వదలిపెట్టండి. ఏదైనా పట్టణంలో అస్తవ్యస్త విషయం జరిగిందంటే మీరు దానిలో ఉన్నా లేకపోయినా గూర్ఖా సైనికులు మీయందు మొరటుగా ప్రవర్తిస్తారు. జాగ్రత్త! మీ కిష్టంగానివిధంగా వాళ్ళు ప్రవర్తిస్తారు. ఏదైనా జరిగితే నేను బాధ్యుణ్ణికాదు".

110 మంది సాయుధ గూర్ఖాసైనికులు ఆరోజుల్లో బారిసాల్ పట్టణంలో ఉండిపోయారు. చిన్నపిల్లల వెంటాడడం, వందేమాతరం కాగితాలను గోడకంటించినవి చింపడం వారి దినచర్య. రంగపూర్‌లో 15-11-1905 నుండి జనాదరణ పొందిన స్వదేశీ ఉద్యమ నాయకులను, ప్రసిద్ధ వ్యక్తులను పోలీసు కానిస్టేబుల్సుగా పనిచేయవలసిందని ప్రభుత్వం ఒత్తిడి చేసింది. వారిలో కొందరు ప్రతిదినము డ్రిల్లు చేయడానికి పోలీసు పెరేడ్ గ్రౌండ్‌కు వెళ్ళవలసి ఉండేది. మిగిలినవారు విదేశవస్త్రాలను బహిష్కరించటాన్ని గూర్చి కాపలాకాచి నివేదించడం, వందేమాతరమ్ నినాదం ఆపుచేయడం చేయాలి. ఈ ప్రభుత్వాజ్ఞను శిరసావహించక తిరస్కరించినవారు శిక్షకు పాత్రులైనారు.

"నూతన రాష్ట్రానికి లెఫ్టినెంటు గవర్నరైన ఫుల్లరు అధికారోత్సాహాన్ని చూపాడు. బారిసాల్‌లో ఉన్న ప్రముఖ రాజకీయ నాయకులను అవమానించి, పైస్తఖాన్ రోజులకు తాను వెళ్ళవలసివస్తుందని వారిని హెచ్చరించాడు. హిందువులను 500 సంవత్సరాలు వెనక్కునెట్టి, మూడు నాలుగు తరాలవరకు పూర్తిగా ప్రభుత్వపు కొలువుకు పనికిరాకుండా చేస్తామని బెదిరించాడు". (ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఇండియా పుట. 29)

8-11-1905 నాటి ప్రభుత్వాజ్ఞ ప్రకారం వందేమాతరాన్ని అతడు నిషేధించాడు. అంతటా సైనికులను వందేమాతరం నినాదాన్ని అణచివేయవలసిందని నియమించాడు. కాని ఆ ప్రయత్నం ఎక్కడ ఫలించిన జాడ కన్పడలేదు. సైనికుల వ్యయాన్ని స్థానిక వర్తకులు భరించవలసి ఉంది. సైనికులు కొన్నవానికి ప్రభుత్వం చెల్లించదని వారికి తెలివిడి చేశారు.

ఈ సందర్భంలో అసంఖ్యాకంగా వార్తాపత్రికల సంపాదకులను కట్టడిలో ఉంచారు. కొంతమంది నాయకులను దేశంనుండిబహిష్కరించారు. ప్రజలు నోరుమెదపకుండా ఉండటానికి సభలను క్రమబద్ధంచేస్తూ ఒక చట్టాన్ని అమలులోనికి తెచ్చారు.

తన పొదిలోని అస్త్రాలన్నింటిలో ప్రధానమైన 'విభజించిపాలించట' మనే అస్త్రాన్నికూడ ప్రభుత్వం వినియోగించింది. విభజన కోరే ముస్లిము సభలకు ప్రోత్సాహమివ్వబడింది. (తూర్పు బెంగాల్ నుండి పోలీసుల నివేదిక ప్రకారం 83 విభజన వ్యతిరేక సభలు జరిగినవి. వాటికి హాజరైన ప్రజలు 2,50,000 మంది. 37 విభజనానుకూల ముస్లిముల సభలు జరిగినవి. వాటికి హాజరైన వారు 75,000 మంది) ముస్లిములు హిందువుల బాధించినా శిక్షలేకుండునట్లు చేయబడింది. ఒక పర్యాయము ఈ అభిప్రాయాన్ని ఉత్తేజితులైన ప్రతినిధులు గుఱ్ఱాలమీద స్వారిచేస్తూ డప్పును మోగిస్తూ ప్రచారం చేశారు.' (ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఇండియా పుట, 29 )

ముస్లిములు చాలాభాగం బ్రిటీషువారితో ఉన్నప్పటికినీ, విభజనను వ్యతిరేకిస్తూ స్వదేశీ ఉద్యమంలో పాల్గొన్న సంఘటనలూ ఉన్నాయి. 1906లో ధులియాలో ముస్లిములు సమావేశమై విభజనను త్రోసిపుచ్చారు. "ప్రముఖులగు ముస్లిములు, స్థానికవర్తకులు సభకు హాజరయ్యారు. సుప్రసిద్ధ ముస్లిమునాయకుడు, ముల్లాషేక్‌చంద్ అధ్యక్షత వహించాడు. అప్పటినుండి ధులియాలో 20 సభలుజరిగాయి, కాని వందేమాతరమ్, అల్లా-హో అక్బరు నినాదాలమధ్య సభాంతమైన ముస్లిముల మొదటిసభ అదియే. (ఇండియన్ ముస్లిమ్సు, రామగోపాల్, పు. 95)

1906లో జరిగిన కలకత్తా కాంగ్రెసులో అటీకుల్లా తన సోదరుడైన సలిముల్లా స్వార్థక్రీడను బయటపెట్టి, "తూర్పుబెంగాల్ ముస్లిములు విభజన కనుకూలంగా ఉన్నారనేది అబద్ధము, యథార్థమేమిటంటే కొంతమంది ముస్లిమునాయకులు తమ సంకుచిత ప్రయోజనాల దృష్టితో విభజనను సమర్థిస్తున్నా" రని చెప్పాడు.

ఆరోజులలో హిందువులు, ముస్లిములు కలసి వందేమాతరమ్ నినాదాలు చేశారు. 20-5-1906న వందేమాతరమ్ గానంచేస్తూ బరిసాల్‌లో హిందువులు, ముస్లిములు ప్రత్యేకమగు ఊరేగింపును లేవదీశారు. దరిదాపు 10,000మంది ప్రజలు బాబు దీనబంధు సేన్‌గారి యింటినుండి మధ్యాహ్నము బయలుదేరారు. వారు వందేమాతరమ్, అల్లా-హో అక్బరు నినాదాలుచేస్తూ జాతీయగీతాలు పాడుకుంటూ వీథులలో తిరిగారు. హిందువులు, మహమ్మదీయులిద్దరు ప్రముఖంగా వందేమాతరమ్ జెండాలను పట్టుకొనివచ్చారు. అశ్వనికుమార్‌దత్తు, మొహమ్మద్ షరీఫ్. మిశహర్ హుస్సేన్, మరికొందరు ఊరేగింపును నడిపారు.

బ్రిటీషు లేబరుపార్టీ నాయకుడు, కీర్‌హార్డీ వంటివాడు ముస్లిములు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనుటలేదని ప్రభుత్వం వ్యాపింపజేస్తున్న కట్టుకథను చెదరగొట్టాడు. హిందువులు, మహ్మదీయులు సంయుక్తంగా

ప్రభుత్వానికి శాపమైన వందేమాతరమ్ నినాదాలు ప్రతిధ్వనించేటట్లు చేయడం తాను స్వయంగా విన్నానని అతడు వక్కాణించాడు.

"వందేమాతరమ్" తరంగాలు విజయవంతంగా ఆటంకాలను, కుట్రలను, కుతంత్రాలను, దౌర్జన్యాలను, ప్రభుత్వముయొక్క యుద్ధరూప సన్నాహాలను అధిగమించి ముంచెత్తగా, అణచివేత యంత్రాంగంకూడ మఱింత పటిష్ఠమైంది. ఎంత అప్రాధాన్యముగల సభలు, ఊరేగింపులకైనా అనుమతి వందేమాతరమ్ నినాదాలు చేయమని, గానం చేయమని ఖరారు పత్రం వ్రాయించుకొనే ఇవ్వబడుతూ ఉండేది. కాని అటువంటి ఖరారు పత్రాలు తఱచు ఉల్లంఘింపబడుతూ ఉండేవి. వందేమాతరమ్ నినాదం తిరిగి తిరిగి ప్రతిధ్వనించే వఱకు తప్పక చేస్తూ ఉండేవారు. అందువల్ల ఖరారు పత్రం వ్రాసియిచ్చిన వాటికికూడ అనుమతి నిరాకరింపబడేది.

సరస్వతీపూజ జాల్పైగురిలో ప్రతిసంవత్సరం జరిగే వైభవోపేతమైన పండుగ. 1906 లో కూడ ఆచారప్రకారంగా అత్యుత్సాహంగా ఆచరింపబడ్డది. జనవరి 31న నిమజ్జనోత్సవపు టూరేగింపు బయలుదేరతీయవలసి ఉంది. బాలురు వందేమాతరమ్ నినాదాలు చేస్తారని గ్రహించి ప్రభుత్వం అనుమతి నిరాకరించింది. నినాదాలు చేయడంవల్ల ప్రమాదమేమీ లేదు. అది ఒక దూషణరూపమైంది గాని, అపకీర్తిని కలిగించేది గాని కాదు. కాని ప్రభుత్వానికున్న భయోత్పాతమట్టిది!

బంగభాషి (28-4-1906) నినాదముయొక్క అర్థాన్నిట్లు వివరించింది ; 'వందేమాతరమ్' అని ఉచ్చరించడం దేశభక్తి భావమునకు చిహ్నమేకాని, రాజద్రోహకరమైనదికాదు. స్వదేశ ప్రేమయే దానియందుందికాని, ప్రభుత్వద్వేషమందులో లేదు. దానియందు ప్రకాశమే ఉన్నది కాని చీకటిలేదు; అమృతమున్నదికాని విషములేదు. అది ముళ్ళులేని గులాబీపువ్వు. దానియందు జీవమున్నదికాని మృత్యువు లేదు. అది మాతృదేశారాధనాగీతమేగాని, యుద్ధనినాదము కాదు.'.

అది అమర నినాదము; దానినణగ ద్రొక్కుటకు చేయుప్రయత్నము విప్లవపథమును నెమ్మదిగా ఏర్పరుస్తుంది. ఇంతకు పూర్వమే 'పంజాబి' (22-5-1905) స్పష్టపరచింది. మానవుని సహనానికికూడా ఒకపరిమితి ఉంది. సత్యశోధన, సంకటములతో బెంగాల్‌నందు, ఇతర ప్రాంతములందు ప్రజలు తమసహనాన్ని కోల్పోయేపరిస్థితి ఏర్పడింది. పగదీర్చుకొనుట నాకుసంబంధించినదని భగవానునిమాట. కాని దేశములమానుషముగా అణగ ద్రొక్కబడినపుడు కొన్నిసమయములలో ప్రత్యపకారము మాదికూడ అని చెప్పవలసి వస్తుంది. చరిత్ర పునరావృత్తమౌతుందని మనందరకు తెలుసు."

స్వదేశి విభజన వ్యతిరేకరూపాన్ని, విదేశ వస్తు బహిష్కరణ రూపాన్ని గైకొంది. విదేశ వస్త్రము, వస్తువులకు మాత్రమే అది పరిమితముకాలేదు. అది మిగిలిన రంగములకు కూడ వ్యాపించడం ప్రారంభించింది, స్వదేశి నాయకులు బ్రిటీషు కోర్టులను, పాఠశాలలను, కళాశాలలను బహిష్కరించారు. కాని బహిష్కరణ మాత్రమే సరిపోదు. శూన్యమును స్వదేశవస్తువులతో నింపటం అవసరం. స్థానిక ఉత్పత్తిదారులు ముందుకు వచ్చారు, విద్యను మన దేశమున కనుగుణమగు పద్ధతిలో రూపొందించడం, బోధించడం అవసరం. 16-1-1905 న జాతీయ విద్యాసంస్థ జాతీయ దృష్టితో సాంకేతిక. శాస్త్రీయ, పారిశ్రామిక విద్యను దేశమునకు, దేశ చరిత్రకు, సాహిత్యానికి, తత్త్వవిషయాలకు తగిన ప్రాముఖ్యమిస్తూ అభివృద్ధిచేయడానికి స్థాపించబడింది, అంతియేగాక దేశభక్తిని విద్యార్థుల హృదయాలలో ప్రోదిచేయుటకు ఏర్పడ్డ సంస్థ అది. ఒక ఉపసంఘం ఏర్పాటుగావింపబడి అన్ని వివరములతో 2-12-1905 న నివేదికను సమర్పించింది, 11-3-1906 న నివేదిక అంగీకరింపబడి, 14-8-1906 న బెంగాలు జాతీయ కళాశాల ప్రారంభింపబడింది. ఉపాధ్యాయుల విద్యార్థుల దేశభక్తి కార్యకలాపములను భంగపరచే ప్రయత్నములకు సవాలుగా ఈ సంస్థ నిలచింది. వందేమాతరం నినాదం చేసినందుకు ఇతరకళాశాలల

నుండి తొలగింపబడిన విద్యార్థులకు జాతీయ కళాశాల ఆధారకేంద్రముగా రూపొందింది.

వందేమాతరం యుగము జాతీయ విద్యాకల్పనకు సాధనమే కాక, జాతీయపతాక పరిణామానికి ఉత్తేజాన్ని కూర్చింది కూడ. సోదరి నివేదిత మొట్టమొదట దీన్ని గూర్చి భావించింది. మిస్. మెక్‌లియోకు వ్రాసిన ఒక జాబులో ఆమె వారు రూపొందించిన జాతీయపతాక స్వరూపాన్నిగూర్చి ప్రస్తావించింది. ఆమె ఈ క్రింది వివరాల నిచ్చింది; ఎఱ్ఱని రంగుగల నేపథ్యభిత్తికపై పసుపుపచ్చని రంగుతో వజ్రాయుధ చిహ్నము. దాని చుట్టు వందేమాతరం నినాదము, "యతోధర్మ స్తతో జయః" అనే దీక్ష వాక్యం దేవనాగరలిపిలో ఉంటుంది. 1906 లో కలకత్తా కాంగ్రెసు సమయంలో ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. అందులో సోదరినివేదిత తన పాఠశాలపిల్లలచే కుట్టుపని చేయించిన జాతీయ పతాకం ప్రదర్శింపబడింది. ఈ జెండాలో ఒక చిన్న భేదముంది. ఎరుపు నేపథ్య భిత్తికపై పసుపురంగు వజ్రాయుధ చిహ్నము, వందేమాతరం నినాదం పెద్దఅక్షరాలతో దాని అడ్డంగా ఉంది. కాంగ్రెసు సెషనుకు హాజరయిన నాయకులకు అది బాగా హృదయాలకు హత్తుకొంది. ప్రఖ్యాత శాస్త్రజ్ఞుడు జగదీశ్ చంద్రబోస్, ఇంకమటికొందరు దానినే జాతీయపతాకంగా ఉపయోగించడానికి ప్రారంభించారు. 1909 లో వార్తాపత్రికలు జాతీయపతాకాన్ని గూర్చిన అభిప్రాయం చర్చించబడం ప్రారంభించగా, మోడరన్ రివ్యూ పత్రిక పతాక చిత్రాన్ని చిత్రించి, దానినిగూర్చి వర్ణించింది.

యూరప్‌లో మదామ్‌కామా, ఇతరులు 1906, 1907 లలో ప్యారిస్, బెర్లిన్, ఇతర కేంద్రాలలో రూపొందించిన జాతీయ పతాకాలు కూడ వందేమాతరం నినాదంతో దేవనాగరిలిపిలో ప్రముఖంగా చిత్రింపబడ్డాయి.

# 6. త్వం హి దుర్గా

ప్రజల హస్తాల్లో ఉంచబడిన వందేమాతరం స్వదేశ వస్తుస్వీకరణ, విదేశవస్తువుల బహిష్కరణ అనే రెండంచుల పదునుగల ఆయుధం. అంతేకాక 'త్వం హి దుర్గా దశప్రహరణధారిణీ' అనే పంక్తిలో ఉన్న ఆదర్శాన్ని అర్థంచేసుకోవడం చాల ముఖ్యమైన విషయం. ప్రజాసమూహపు ప్రదర్శనలకంటె ఎక్కువగా ప్రాతిపదిక పరిమాణాలగూర్చి చర్చించడంచేత ఆ భూమికను పత్రికలు ముందే సంసిద్ధంచేస్తూ వచ్చాయి. 26-7-1905 నాటి ప్రతిజ్ఞలో శివాజీ రూపును పొడకట్టిస్తూ చిత్రింపబడ్డ పద్యం ప్రచురింపబడ్డది. దాని సారాంశమిది :

"మేఘావృతము గాఢాంధకారమునైన కాళరాత్రి అప్పుడప్పుడు విద్యుల్లతల మెరుపు. దేశభవిష్యత్తును గూర్చిన ఆలోచనలో శివాజీ, అతడొక పిలుపువిని పైకిచూచాడు. భారతమాత తనంతతాను అభివ్యక్తమైంది. ఆయుధహస్తయై, చిరునవ్వు చిందిస్తూ ఉంది. ఆమె తన చేతిలోని ఖడ్గంవైపు చూపు నిలిపింది. ఇదేమార్గం !"

"ఆత్మబలిదానం చేసినవారి రక్తము స్వాతంత్ర్యానికి మూల్యము" అని జుగంతర్ (22-4-1906) వ్రాసింది :

"రక్తధారలనుండి దృఢవిశ్వాసాలుత్పన్నమౌతాయి. స్వాతంత్ర్య బీజాలను దివ్యపురుషులు రక్తమునందు మొలకెత్తించినపుడు ఏ శక్తి నశింపచేయలేదు. నేటి మన అచంచలదీక్ష ఆత్మబలిదాన ఫలితం; రేపది మన విశ్వాసాలకు అఖండ విజయం చేకూర్చుతుంది. నేడు ప్రజలు ప్రశాంతంగా తమ జీవితాలను అర్పించడం కర్తవ్యం; రేపు ఆవ్యక్తుల ఉద్యమమే మన ఆత్మవిశ్వాసానికి విజయాన్ని సాధింపదని ఎవరైనా చెప్పగలరా?"

"క్రియకు ప్రతిక్రియ చేయండి. ముష్టిఘాతాలను తింటే కాలితాపు నివ్వడం మరచిపోకండి. అప్పుడే నీ పౌరుషవహ్ని ప్రకాశిస్తుంది. మృత్యుభయం వలదు. అత్యుత్సాహంతో బహిరంగంగా నీవుపాడేపాట ఈ విధంగా సాగింది.

*"ఓ తల్లీ! జీవితం నిర్గమించనీ*
*ఈలోకంలో నీ సేవలో ఉండగా*
*వందేమాతరం మంత్రోచ్చారణతో"* **11-11-1906**

"జీవితాన్నిపొంది జీవితం ఫలవంతం చేయటానికి ప్రారంభించు. స్వాతంత్ర్య సదనంలో నీ జీవితం బలిగా అర్పించు. రక్తపాతం లేకుండ దేవతార్చన కృతకృత్యంకాగా" (5-3-1907).

"సింహాసనం మహారాణి కేర్పాటుచేయ్. లక్షలాది హృదయాలలో రక్తసముద్రం మథింపబడ్డపుడు ఆమె కృపాకటాక్షాలు ప్రసరింపచేస్తుంది".
(26-3-1907)

"దుమ్ములో, చినుగుపాతల్లో పడిఉన్న తల్లిని చూడు. ఎవరామె కన్నీరుతుడుస్తారు? ఆమె అవమానానికి ప్రతిక్రియగల మొదటిబిడ్డ ఎవరు? కర్తవ్యపథం నిష్కంటకంగాఉంది ..., మృతి ద్వారానే తల్లి జీవితాన్ని చూస్తుంది." (26-3-1907)

దీపావళి నాటి పత్రికలో ఇట్లు చెప్పబడింది: "వందేమాతరం వినాదం శత్రువుయొక్క సాహసాన్ని, బలాన్ని దోచుకొన్నది. చూడు. తల్లి మందహాసం. అది విజయహాసము. అంతా సవ్యంగా జరుగుతుందని సైగచేస్తూంది. ఆమె రాక్షస సంహారానికి సిద్ధంగా ఉంది. ఆమె జంతు బలుల నంగీకరించదు. ఆమె ఆత్మబలిదానాన్ని వాంఛిస్తూంది. దేశభక్తులారా! ముందుకురండి". (2-11-1907)

"ఈరోజుల్లో సభలతో ప్రయోజనంలేదు." కాబట్టి చెఱసాల అంటే భయం, జీవితంమీద ప్రేమ వీటిని హృదయాలనుండి బహిష్కరించాలి. శత్రునాశనానికి నిర్ణీతసమయం లేదు. మనం ఎన్నిక చేసుకోవడంలో ఉంది. అర్హమైన ఉత్తమకృత్యాలైతే వెంటనే ఆచరించడం ఉత్తమ లక్షణం.

"దుర్బలులు న్యాయదినమునకై ప్రశాంతంగా వేచి ఉండాలనీ తమకు కల్గించిన బాధలకైనా వ్యక్తిగతంగా కక్ష తీర్చుకోకూడదని తలుస్తారు. కాని అటువంటి విధానం పురుషత్వవినాశానికి; మత, ఆధ్యాత్మికాభివృద్ధులకు విరుద్ధంగా ఉంటుంది....స్మృతికర్తలు దుర్మార్గుల సంహారం పాపంకాదని ప్రకటించారు ...వారి దేశాలు నివాసార్హమైనవిగా చేసుకోవాలని కాంక్షించేవారు శత్రువినాశానికి, దేశాభివృద్ధికి, తమ గుణసంపత్తిని వినియోగించాలి .. దుర్మార్గులయం దెట్టి దాక్షిణ్యాన్ని చూపించరాదు; శత్రుసంహారానికి సిద్ధంగా ఉండాలి. శత్రువును చంపడం అతని మంచికే; అతడింకా ఎక్కువకాలం జీవించి ఉంటే పాపాలెక్కువ చేస్తాడు." (మార్చి, 1908) – అని 'సంధ్య' వ్రాసింది.

మాతృదేవిని ప్రేరేపించుటకు రక్తంతోటే ఆరాధించాలని 'దైనిక హితవాది' వీరోచితంగా ఆహ్వానించింది (11-11-1907). యుద్ధ భేరులు మ్రోగనిమ్ము. మాతృదేవిని రక్తస్నానమొనరింపనిమ్ము; ఆ దృశ్యాన్ని చూస్తే శత్రుహృదయంలో భీతి కలుగుతుంది."

'సంధ్య' ఆయుధ సంచలనానికి పిలుపునిచ్చింది. అది కష్టం కాదని చెప్తూ ఇలా నుడివింది : స్వాతంత్ర్యముయొక్క ఆవశ్యకతయందు నమ్మకం కలవారు, దానిని చూడందే మరణించనివారు అయిన వీరసముదాయం మనకు తక్షణ అవసరం.

భౌతిక ఆకర్షణలను త్యాగం చేయడానికి, ఉరికంబానికి చిరు నవ్వుతో ఎక్కడానికి జీవిత ప్రారంభదశలో ఉండే యువజనుల ఉత్తేజ పరచడం తేలికైనవిషయం కాదు. దేశంలోని వాతావరణాన్ని ఉద్దీప్తం చేసిన దేశభక్తి గీతాలు సులభంగా ఈపనిని సాధించాయి. వందేమాతరంతో దీప్తివి పొందిన కవులు తమ కవితాపరంపరతో ఆవేశ ప్రవాహాన్ని వెల్లిగొనచేశారు. ప్రభుత్వం అటువంటివారు కనిపించటంతోటే చాలమందిని అణచివేసింది. కాని ఇంతకుపూర్వమే వందలకొలది ఉత్సాహవంతుల మనస్సులలో, హృదయాల్లో దేశభక్తి గీతాలు స్థానమేర్పరచుకొన్నాయి; వారు ప్రభుత్వపు ఆంక్ష ఉన్నప్పటికీ వ్యాపింపచేశారు, మచ్చుకు కొన్ని ఉదాహరణలు; వీనితో ఏ విప్లవసాహిత్యమైనా గర్వపడాలి :

"ఓ తల్లీ! ఈ ప్రాణాలకు స్వల్ప ప్రాధాన్య మిచ్చేటట్లు నాకు బోధించు; జీవితం స్వీయ త్యాగంచేత ఆశీర్వదింపబడింది ఔతుంది. అందరికై జీవితాన్ని త్యాగంచేయటానికి నీపాదాలు సేవించటం నాకు బోధించు. నన్ను నీ సేవక సమూహముయొక్క ముందు భాగమందు మొదటి వాణ్ణిగా ఉండేటటుచూడు తల్లీ!"

"నీపాదముల స్పర్శచే పరిపూరితమైనభూమిలో నాజీవిత రక్త ప్రవాహంచే ఉత్తేజితులైనవారిని కల్పించనిమ్ము." మాతృదేశం మరణించ టానికి ఆహ్వానిస్తుంది. నీవు క్రమశిక్షణకు విధేయుడవై సిద్ధంగాఉంటావా? లేదా?"

—విజయచంద్రముఖర్జీ

"శక్తి పూజావిధానంలో సాంప్రదాయసిద్ధంగా నిర్భయురాలగు తల్లి పాదాలవద్ద మాశిరములు వంచి నమస్కరిస్తున్నాము .... యుద్ధధ్వనుల మధ్య శత్రురక్తాన్ని చిమ్మిస్తూన్న తనఖడ్గంతో తృప్తిపడి అంబవస్తుంది."

—బరదచరణమిత్ర.

"తల్లీ! ఆభరణములతోడి అలంకారాన్ని తీసి పారవేయ్; పునుకల మాలను ధరించు .... బంగారు మురళిని పక్కకుపెట్టు; ఆవేశంతో ఉరకలు వేసే నీ ఖడ్గాన్ని తీసుకొని, రాక్షసరక్తంతో దాహంతీర్చుకో"

——హరీస్‌చంద్ర చక్రవర్తి.

"నేడు మేము రక్తసముద్రాన్ని మథించి, అమూల్యాభరణమైన స్వాతంత్ర్యాన్ని తెస్తాము. మేలుకో, తల్లీయుద్ధస్వరూపీ, నీపాదసన్నిధిలో మాపూజలు సమర్పిస్తాం,"

—. కిశోర్‌చంద్ర గంగూలీ.

"స్వర్గంనుండి, మృత్యువునుండి పతన మౌతున్న పిడుగులను, హింసను. ఆపదలను అవయవాలన్నీ ముక్కలై చెల్లాచెదరవుతున్నా నీకంటె ప్రశాంతంగా భరించగల వారెవరున్నారు?

——దేవబ్రజ బాసు

"దళితమైన భారతం నిన్ను కోరుతున్నది. ఓ మురారీ! సుదర్శన చక్రధారీ! భారతావనిలో తిరిగి కనిపించు .... శత్రురక్త ధారలతో ప్రపంచాన్ని వెల్లిగొన జేయుటకు భయంకర ఖడ్గంతో రా! బానిసత్వంలో ఉన్న భారతదేశ శృంఖల విమోచకుడా! నీవురమ్ము!"

——కామినీకుమార్ భట్టాచార్య

గణగణ మ్రోగుతున్న శబ్ద(మాట) ధ్వనులతో యువజనులు ప్రేరేపింపబడుటలో ఆశ్చర్యమేముంది? వారు వీరులవలె లేచారు. వారు ఖడ్గాన్ని ఝుళిపించి, రక్తపాతం చేయడానికి, వారి ప్రాణాలను స్వాతంత్ర్య దేవత కర్పించటానికి సంసిద్ధంగా ఉన్నారు.

స్వదేశి ఉద్యమానికి వ్యతిరేకంగా 'ఏంటీ స్వదేశి సర్క్యులర్' అను పేరుతో ప్రభుత్వాజ్ఞ జారీ అయింది. దాని దుష్ఫలితాల నెదుర్కొనటానికి యువజనులు నిర్ణయించారు. బహిష్కరణ, ఆందోళన, సామూహిక సభల కార్యకలాపములలో శాంతిభద్రతల నెలకొల్పటానికి యువజనసంఘ మొకటి అవసరము.

బరిసాల్ సమావేశ సమయంలో ప్రభుత్వాజ్ఞావ్యతిరేకసంఘాన్ని మైనింగు ఇంజనీరయిన రమాకాంతరాయ్ ప్రారంభించాడు. పాఠశాలల నుండి, కళాశాలలనుండి బహిష్కరింపబడిన విద్యార్థులు ఆ సంఘంలో సభ్యులయ్యారు; వారి సంఖ్యకూడ అత్యధికమైంది.

ఇంతకుపూర్వమే 13-10-1905 న విద్యావంతులైన యువజనులు అత్యధికసంఖ్యలో చేరి ఉత్తర కలకత్తాలో 'వందేమాతరమ్ సంప్రదాయ' అనేపేరుతో సంఘాన్ని స్థాపించారు. 'వందేమాతరం' గేయమందలి సమున్నత భావసందోహాన్ని వ్యాపింపచేయడమే దాని లక్ష్యం. మన్మథనాథమిత్ర దానికి అధ్యక్షుడు; సురేశచంద్ర సమాజపతి దాని కార్యదర్శి; రాయ్ అమృతలాల్ మిత్ర బహదూర్ ఆ సంఘముయొక్క కోశాధికారి. ప్రతి ఆదివారము సభ్యులు 'వందేమాతరం' పాడుతూ ప్రధానవీధులలో ఊరేగింపు ఉత్సవాన్ని లేవదీసేవారు. మార్గమధ్యంలో విరాళాలిస్తే స్వీకరించేవారు; కాని నిధుల సేకరణ వారి లక్ష్యం కాదు. హేమేంద్రప్రసాద్ఘోష్ వ్రాసినదాన్ననుసరించి ఒకప్పుడు రవీంద్రనాథ్ ఠాకూర్కూడ ఈ ఊరేగింపులో పాల్గొన్నట్లు తెలుస్తుంది. మత దృక్కోణంలో జాతీయతకు దీప్తిని కలిగించటానికి 'వందేమాతరం'ను ఉపయోగించుటలో ఆ సంఘం విజయాన్ని పొందింది. ఆరోజుల్లో బంకించంద్రుని జన్మస్థలమగు కాంటలపాడ్ జాతీయవాదులకు యాత్రాస్థలమైంది. బెంగాలీ యువజన సమూహములు ఉత్తేజాన్ని పొందటానికి ఆ స్థలాన్ని సందర్శించారు. వారామార్గంలో తప్పనిసరిగా వందేమాతరమును గానంచేయడం, వివాదాలు చేయడం జరిగేది. గీతాన్ని వ్రాయడానికి ప్రేరేపణను

బంకించంద్రునకు కల్గించిన స్థలంమీదుగా తెలిసో, తెలియకో వారిలో ఎక్కువ మంది వెళ్తూ వుండేవారు; వారు త్తేజంతో తిరిగి వచ్చేవారు. ఆనందమఠ సన్న్యాసులగూర్చి, వారు స్వాతంత్ర్యాన్ని పొందుతూవచ్చిన పద్ధతుల గూర్చి భావించకుండా ఉండేవారు.

పోలీసులు దండిస్తూ ఉంటే మూగగా సాధుత్వంతో విధేయతను చూపే ప్రజలు ఇప్పుడు ఎదురుతిరగసాగారు. గతంలోవలె ఎవరికివారు ఒక్కొక్కరే వ్యతిరేకతను చూపే క్షణికమైనకోపం ఇప్పుడెంతమాత్రము కాదు, విదేశీయుల అధికారాన్ని అంతంచేయడానికి, స్వాతంత్ర్యాన్ని తిరిగి పొందటానికనే నిర్ణీత ప్రయోజనంకోసం ఆయుధాల నుపయోగించడం అవగాహన చేసుకోబడ్డది.

సర్క్యూలర్ వ్యతిరేకసంఘం నకాలంలో హేతుబద్ధదృష్టితో నేర్పడ్డ వృత్తిసమితి, ఆత్మోన్నతి సమితి వంటి సమితుల సృష్టికి మార్గమేర్పర చింది. వానిశాఖలు పట్టణాలలో, గ్రామాల్లోకూడ ఏర్పడ్డాయి కోమిల్లాలోని ఒక ఆంగ్లేయునిచే అందుకోబడ్డ నివేదిక (17-5-1907) ననుసరించి; "ప్రత్యేకంగా లాటి, కత్తి, బల్లెములు మొదలగు ఆయుధాలు వృత్తి, వందేమాతరం సభ్యులు ఉపయోగించటానికి శిక్షణ గరపటానికి అనంఖ్యాకంగా తాలింఖానాలు ఏర్పడ్డట్లు తెలిపే సాక్ష్యాధారం ఉంది. గుప్తి (కట్టెలో దాచియుంచేకత్తి) బహిరంగంగా ఇప్పుడమ్ముతున్నారు".

ఈ విషయాలను ప్రభుత్వ నివేదికలు ధ్రువపరుస్తున్నాయి, "ఈ సమితులలో యువజనులు, బాలురు వ్యాయామశిక్షణ, క్రమశిక్షణ, లాటి, కుస్తీలలో తమంతటతాము శిక్షణపొందుటను నేర్చుకొనుచుండిరి. ఈ సమితులలోని సభ్యులను జాతీయ స్వచ్ఛందసేవాదళ మందురు; బలాన్ని బలంతో నెదుర్కొనుటకు శిక్షణపొంది సంస్థను రూపొందించడం వారి అభి

మతమైనట్లు తెలుస్తూంది, అంతేకాక రక్షణకు, కవ్వింపుచర్యల నెదుర్కో టానికి దానినిఅందుబాటులో ఉంచటం వారియభిప్రాయమని స్పష్టమౌతుంది.'

ఈ సమితులు తమ సభ్యులు యుద్ధశిక్షణను, నిస్తంత్రీవిధానాన్ని, తంత్రీవిధానాన్ని, ధనుర్విద్యను, తుపాకుల నుపయోగించటాన్ని నేర్చు కొంటారని పత్రికలలోప్రకటించాయి. వారికిసహాయంచేయటానికి బహిరంగ సభలలో వక్తలు ప్రజలకు ఆయుధప్రయోగం శిక్షణ పొందుదని విజ్ఞప్తి చేశారు; అవసరంవచ్చినపుడు ప్రతికుటుంబమొక సభ్యుణ్ణి మాతృభూమి సేవకై కానుకగా సమర్పించాలని కోరారు.

టైమ్స్ ఆఫ్ ఇండియా (18-5-1907) నివేదిక ననుసరించి: తూర్పు బెంగాల్‌లోను, పశ్చిమ బెంగాల్‌లో ఎక్కువభాగంలో జాతీయ స్వచ్ఛంద సేవాదళాలు చురుకుగా పనిచేస్తున్నాయి. వారు పసుపుపచ్చని తలపాగా ఎరుపు చొక్కాతో ప్రత్యేకదుస్తులు ధరించి వీధుల్లో క్రమబద్ధంగా అడుగులువేస్తూ ముందుకు సాగుచు వందేమాతరం అని నినాదాలుచేస్తూ, జాతీయగీతాలుపాడుతూ ఉండేవారు' అని స్పష్టమవుతుంది.

కలకత్తా స్వచ్ఛంద సేవాదళాలకు కేంద్రస్థానము. అవి 16-10-1905 నాడు తాము తీసుకొన్న ప్రతిజ్ఞ నమలుజరుపుటకేర్పడ్డవి. బెంగాల్ అంతటా ఇది వ్యాపించింది. విదేశవస్తు బహిష్కరణ, ఆందోళన, సామూహికంగా పనిచేయడం దాని ప్రధాన లక్ష్యాలు.

1907లో బ్రిటీషు పార్లమెంటుసభ్యుడైన సి. జి. ఓడానల్ బెంగాలులో పర్యటించాడు. అతడీ విధంగా చెప్పాడు : "గడచిన రెండు సంవత్సరాలవలె అదేరోజున అంటే 16 అక్టోబరునాడు బెంగాల్ ప్రజలు తమకు జరిగిన గొప్ప అన్యాయంయొక్క రెండవ సాంవత్సరికపుటుత్సవం చేసుకొన్నారు. కలకత్తాలో ఇతర ప్రధాన పట్టణాలలో సామూహిక నిరాహార దీక్ష, బహిరంగసభలు నిర్వహింపబడ్డాయి; వారు నల్లని దుస్తులు

ధరించారు; వట్టికాళ్ళతో వారు దేవాలయానికి వెళ్ళి వారి ప్రతిజ్ఞను పున శ్చరణ చేశారు." (ది కాజెస్ ఆఫ్ డిస్కన్ టెంట్స్ ఇన్ ఇండియా పుట. 59)

జాతీయ కార్యకర్తలు అసన్‌సోల్ రైల్వే కార్మికుల సమా వేశంలో వారి నుద్దేశించి మాట్లాడుతూ, వారికి విలువైన సలహా నిచ్చారు. (ది టైమ్స్ ఆఫ్ ఇండియా 30-9-1907). వందేమాతరమ్ నినాదం, భారతీయ కార్యకర్తలు ఆందోళన చేయడానికి పిలుపుగల కరపత్రాలు కలకత్తాలో పంచబడ్డాయి.

జాతీయ స్వచ్ఛంద సేవాదళముల సభ్యత్వం పెరిగింది; వాటి యుద్ధతత్వం పెరిగింది. ప్రాత బ్రోటో స్వచ్ఛంద సేవాసమితితోపాటు వందేమాతరమ్ సంప్రదై అనేపేరుగల నూతన సంస్థ ఉద్భుద్ధమైంది. 'లండను టైమ్సు "ఈసంస్థ ప్రమాదకరమైంది" అని వర్ణించింది. దీని సభ్యులు లాటీలు, బల్లెములు, కత్తులు మొదలైన ఆయుధములు ధరించే వారు. కొంతమంది ఆగ్నేయ ఆయుధాలను ధరించేవారు. ఈ సేవాదళాలు మరింతగా బహిష్కరణభావాన్ని తీవ్రతరమొనరించాయి. అప్పుడప్పుడు వీధుల్ని చుట్టుముట్టి, బ్రిటీషు వస్తువుల వర్తకులనుండి లాగుకొని నాశనం చేసేవారు. కాబట్టి ప్రారంభంలో ఏప్రిల్ 4, 1906 న ది టైమ్సు ఆఫ్ ఇండియా సేవాదళాల కార్యకలాపాలగూర్చి వ్రాస్తూ మంటకంటె పొగ ఎక్కువ ఉందని వ్రాసింది. 1907 లో దాని నివేదికలలో మార్పు ప్రముఖంగా గోచరిస్తుంది జులై 1907 లో టైమ్సు పాత్రికేయుడీ విధంగా వ్రాశాడు: వారు ప్రతిచోట బ్రిటీషు రాజ్యానికి వ్యతిరేకంగా విప్లవాన్నిగూర్చి బోధిస్తారు; చురుకుగా బహిష్కరణను కొనసాగిస్తారు. (5-7-1907) పోలీసులు కొడుతూ ఉంటే 1906వ సంవత్సరం ప్రారంభదశలోవలె వారింక మెదలకుండ ఊరుకోవడం జరగడంలేదు; ధైర్యంగా వారితో పోరాడారు. ఆగష్టు 7, 1907 నాడు జుగంతర్ కార్యాలయాలమీద దాడి చేయటానికి పోలీసులు ప్రయత్నించగా ఆయు ధాలు ధరించిన సేవాదళాలు త్రిప్పికొట్టాయి. ఆగష్టు 8న, బహిష్కరణ

ద్వితీయ సాంవత్సరికపు టుత్సవాన్ని చేయడానికి ఊరేగింపు బయలు దేరగా పోలీసులు వీథుల్లో బారుతీరారు. జాతీయ సైన్యాన్ని (Marchers) సేవాదళాలు వెంటనంటి ఉండగా, 20 మంది స్వచ్ఛందసేవకులు గుర్రాల మీద జాతీయపతాకాన్ని కావలా కాస్తుండగా ఉత్సవం జరిగింది. ఆగష్టు 27న కోర్టు హౌసువద్ద పోలీసులతో పెద్ద పోరాటం జరిగి ఇద్దరు స్వచ్ఛ ద సేవకులగూర్చి కోర్టులో న్యాయవిచారణ జరిగింది''. (తిలక్ అండ్ ది స్ట్రగుల్ ఫర్ ఇండియన్ ఫ్రీడమ్, పుట 281-82).

బ్రిటిషువారి అమానుషకృత్యాలను ఖండిస్తూ 15-9-1907 ఆదివారంనాడు కలకత్తాలో బ్రహ్మాండమైన బహిరంగసభ జరుపబడింది. లియాఖత్‌హుసేన్ సభ నుద్దేశించి మాట్లాడాడు. కుటీరపరిశ్రమల కార్య కర్తలసభనుద్దేశించి సురేంద్రనాథ్‌బెనర్జీ సెప్టెంబరు 17న ఇలామాట్లాడాడు, 'మనమధ్యనుండి ద్రోహులను తరిమివేయాలి; చెరసాలలో పెడతారు. ఇతర ప్రాంతాలకు పంపుతారు, ఉరితీస్తారని' భయపడి మనం స్వదేశీ ఉద్యమాన్ని వదలిపెట్టవద్దు''. సభలోపాల్గొన్నచాలామందిని న్యాయస్థానాల్లో వారి నేరాలగూర్చి విచారించి శిక్షించి బాధించారు.

బ్రిటిషువారి హృదయాల్లో భయోత్పాతము పెరిగింది; పట్టణాలకు గ్రామాలకు పోలీసుల, సైనికుల కావలా అభివృద్ధయింది. 1907 సంవ త్సరం ద్వితీయార్థంలో తూర్పుబెంగాలు పర్యటించిన బ్రిటిషు లేబరుపార్టీ నాయకుడు కీర్‌హార్డీ మైమెన్‌సింగ్‌వంటి చిన్నప్రదేశాల్లో అత్యధికమైన పోలీసు బలగం ఉండటాన్నిచూచి వ్యాఖ్యానిస్తూ 'ముట్టడిలోఉన్న పట్టణం వలె చూడటానికి కన్పిస్తూంద'ని వాక్రుచ్చారు.

సతీశ్‌చంద్రబోసు 1902లో అనుశీలన సమితిని స్థాపించాడు. పి. మిత్రయొక్క మార్గదర్శకత్వంతో అది బాగుగా అభివృద్ధి చెందింది. అరవిందుడు బెంగాలులోని యువకులకు ఆయుధముల నుపయోగించుటలో శిక్షణ నిచ్చుటకు బరోడానుండి యతీంద్రబెనర్జీ (ఈయనే నిరాలంబ స్వామి

అయినారు) ని పంపారు. 1904 లో బరీంద్ర కుమార్ కూడ అతనితో కలిశాడు. ఒకరితరువాత ఒకరు ఉన్నతకుటుంబాలనుండి విద్యార్థులైన యువజనులు దీనివైపు ఆకర్షింపబడ్డారు. బాంబుబుచేయడం తెలిసిన శాస్త్రజ్ఞులుకూడా వారిలో ఉన్నారు. యుద్ధకళనుగూర్చిన గ్రంథములు రహస్యంగా సంతరింపబడి అందుబాటులోకి అనూదితమయాయి.

అనుశీలన సమితి సభ్యులలో క్రమశిక్షణ ప్రధానస్థానమాక్రమిస్తుంది. దానిలో చేరటానికి వచ్చేవారికి వివిధ రకములైన కఠిన పరీక్షలు పెట్టే వారు. అకుంఠిత ఆత్మవిశ్వాసం, సహనశక్తిగల ఎన్నికచేసిన దేశభక్తులగు యువజనులకే సభ్యత్వము ఇవ్వబడుతుంది. దాని సభ్యుల ప్రవర్తన నియమావళి, 'ఆనందమఠము' ను బాగా జ్ఞాపకంచేసేటట్లు నిర్ణయింపబడ్డది.

అనుశీలన సమితి ప్రధాన నాయకుడగు పులిన్‌బిహారిదాసు సభ్యులచే ప్రతిజ్ఞచేయిస్తూ ఉండేవాడు. పది, పండ్రెండుమంది సభ్యులు కాళి ఆలయంలో చేరి ఉండేవారు. ఇతరులెవ్వరికి, చివరికి మామూలు పూజారికి కూడ ప్రవేశానుమతి లేదు. ఆగంతకులు కాళీమాతముందు కూర్చొని, ఆరాధించి, హోమంచేస్తారు. పులిన్‌దాసు స్వయంగా మంత్రోచ్చారణ చేస్తాడు. ఆరాధనానంతరము ముద్రించియున్న ప్రతిజ్ఞ చదివింపబడుతుంది. క్రొత్తగా వచ్చినవాడు కాళీమాతముందు మోకరిల్లుతాడు. అతడు ప్రతిజ్ఞ చేస్తూఉండగా అతని తలపై ఖడ్గము, భగవద్గీత పెట్టుకొనుమని చెపుతారు. సమితియందు సభ్యుడగుటకు ముందురోజు అతనిని ఉపవాసముండుమని సభ్యత్వస్వీకరణ కార్యక్రమమునకు మానవాతీత మహిమను కల్పించెడివారు. పలుతడవలు ఈ ప్రతిజ్ఞాకార్యక్రమము కాళీమందిరమునకు బదులు శ్మశానభూమిలో జరిపెడివాడు. కాళీమూర్తిని అతనియెదుట పెట్టుచుండెడివాడు. రెండు పెద్ద తుపాకులను కాళీమాత పాదములవద్ద ఉంచెడివాడు. నూతన సభ్యత్వ స్వీకరణోత్సవము తరువాత అతనికొక రహస్యనామమివ్వబడేది; ఆ పేరుతోనే సమితిలో అతడు గుర్తింపబడేవాడు.

రాష్ట్రీయ స్వయంసేవక సంఘ స్థాపకుడు ఆద్య సర్‌సంఘచాలక్ అయిన కె. బి. హెడ్గావర్ ఈ అనుశీలనసమితి ఉపదేశమును పొందిన సభ్యుడే. అతని రహస్యనామము 'కోకన్' అని ఇప్పుడు చెపుతున్నారు. (ఆరమ్దు స్ట్రగుల్ ఫర్ ఫ్రీడమ్, పుట 179)

అనుశీలన సమితిలో శిక్షణపొందిన యువజనులకు ఆయుధముల కొరత ఉండేది. కలకత్తాకు సమీపంలోగల ఫ్రెంచివారి వలన ప్రదేశమైన చంద్రనగర్‌కు వారిలో చాలమంది ఆయుధాలనిమిత్తం వెళ్ళుతూఉండేవారు అక్కడ ఆయుధాలమీదకాని, ఆయుధాల అమ్మకంమీదకాని నిర్బంధం లేదు. వాటిని విదేశంనుండి పోష్టుద్వారాకూడా దిగుమతి చేసుకోవటానికి వీలుగా ఉండేది. తిరుగుబాటుదారులు కావలసిన సామానుకై ఫ్రాన్సుకు వ్రాయగా, 1906లో వారికి రెండు పెద్దతుపాకులు, ఆరుచిన్నతుపాకులు అందాయి. 1907లో ఫ్రాన్సు ఆయుధ కర్మాగారాలనుండి 34 రిజిష్టరు పార్శిళ్ళు వచ్చాయి. ఎక్కువ పార్శిళ్ళలో చిన్నతుపాకులున్నాయి. దానికి దానికి తగ్గట్టు బరీంద్ర ఆలిపూర్‌లో బాంబులుతయారీలో నిమగ్నుడయ్యాడు.

వందేమాతరం హృదయాల్లో మనస్సులోనింపుకొని బ్రిటిషువారికి వ్యతిరేకంగా పోరాడిన యువకవీరుల పేర్లు అధికసంఖ్యలో ఉన్నాయి; వారి పేర్లు అజరామరులు. పదునైదేండ్ల వయస్సుగల సుశీలకుమార్ సేన్ వారిలో ఒకడు.

వందేమాతరం కేసు జరుగుతూ ఉండేటప్పుడు లాల్‌బజారు న్యాయ స్థానంలో వేలాది యువజనులు గుమిగూడుతూ ఉండేవారు. వందేమాతరం వివాదాలు చేస్తూ పత్రికకు వారు మద్దతు ప్రదర్శించేవారు. గుంపులు చెదర గొట్టుటకు ఉక్కుటోపీల పోలీసులు అమానుషమైన లాఠీచార్జీలలో నిత్యము నిమగ్నులయ్యారు. 26-8-1907న ఒక అద్భుతం జరిగింది. చిన్న బాలుడొకడు పోలీసుల దౌర్జన్యం సహించలేక తిరిగి కొట్టాడు. 'సంధ్య' 31-8-1907 నాటి పత్రికలోని నివేదిక నమపరించి: "ఎర్రముఖంగల

పోలీసు అధికారి అకారణంగా ప్రజాసమూహంపై దౌర్జన్యం చేస్తుండగా సుశీల్‌కుమార్ చూచి, పోట్లాటలో అడుగుపెట్టాడు. అడుగు పెట్టటంతోటే దౌర్జన్యానికి గురిఅయ్యాడు. సుశీల్ పదునైదేళ్ళ బాలుడు; ఇక ఎఱ్ఱముఖం గల దరోగా గొప్ప బలమైనవ్యక్తి. అయినప్పటికి సుశీ ఉత్సాహం కళ్ళతో చూడవలసిందే ఎఱ్ఱముఖంవాడు పూర్తిగా దెబ్బతిన్నాడు. ఫిరంగి వ్యక్తుల ప్రదర్శన చూచి ఎవ్వరూ భయపడవద్దు. వారిలోపలంతా డొల్లే; సుశీల్ బయటి ఆడంబరాన్ని భగ్నంచేసి గుట్టు బయటికిలాగాడు" అని ఉంది.

22-8-1907 న సుశీల్‌కుమార్‌ను న్యాయస్థానంలో విచారించారు; పదిహేను కొరడాదెబ్బలు శిక్ష విధించారు. నవ్వుతూ ఆ బాలుడు వాటిని స్వీకరించాడు. అతడు అధ్యయనం చేస్తున్న జాతీయకళాశాల అతని గౌరవార్థం ఒకరోజు మూసివేశారు. ఆగస్టు 28న కళాశాల ఆవరణలో జరిగిన బ్రహ్మాండమైన సభలో వీరబాలకుని అభినందించారు. సురేంద్రనాథ్ బెనర్జీ సభలో అతనికి బహూకరించడానికి బంగారు పతకాన్ని పంపాడు. సభ సమాప్తమైనతరువాత కలకత్తా ప్రధాన వీథుల్లో అతనిని ఘనంగా ఊరేగించారు. దారిపొడుగునా 'వందేమాతరమ్' నినాదం గాలిలో ధ్వనించింది.

యువజన సమూహము ప్రసిద్ధ బెంగాలీ గీతాల్ని పాడారు. దాని సారాంశమిది ;

"ఓ తల్లీ ! నా పెదవులమీద వందేమాతరమ్ నినదిస్తూఉండగా నీ సేవలో మరణించగలిగితే; అదే ధన్యము ఓ ఇంగ్లండు దేశీయులారా ! కొరడా దెబ్బలద్వారా మా తల్లిని మరచిపోయేటట్లుచేద్దామని ఊహించావా ? మేము మాతల్లికి అటువంటి కుమారులమని ఎప్పుడూ భావించకండి !"

'వందేమాతరమ్' పత్రిక సుశీల్‌కుమార్‌ను అభినందించడం మరచిపోలేదు. ఈవిధంగా అది అతన్ని ప్రశంసించింది ; 'సామ్రాజ్యవాదుల

సేవకులకు దౌర్బల్య చిహ్నాన్ని ప్రదర్శించడం జాతీయ భావానికే గౌరవ హానియని తలంచుటచే సుశీల్‌కుమార్‌ను జైల్లో క్రూరంగా కొరడాతో కొట్టి నప్పటికి అతడు చలించలేదు." అది ఇంకా ఈవిధంగా వ్రాసింది : 'శిక్షింప బడిన దేశభక్తుల సంఖ్య అంతకంతకు అధిక సంఖ్యలో పెరిగిపోజొచ్చెను. వారిలో ప్రతిఒక్కడు అపూర్వ నైతిక ధైర్యాన్ని ప్రదర్శించాడు. ఆ విషయం విశ్వవ్యాప్తమైన ప్రశంసకు పాత్రంకావడమేకాక, సామ్రాజ్యవాదుల హృదయాలలో భీతిని కలిగించింది.' 11-11-1907)

అటువంటి యువకులలో ఇద్దరు దేశభక్తుల పేర్లు ప్రస్తావించటాని కర్హమైనవి. భారతదేశంలో అపూర్వమైనమొదటి బాంబుకేసుకు బాధ్యులైన ఈ చిన్నబాలుర పేర్లు చరిత్రపుటల్లో రక్తాక్షరాల్లో అలంకరింపబడవలసినవి. అందులో ఒకడు రంగపూరుకు చెందిన ప్రఫుల్లకుమార్ ఛాకి, రెండవవాడు మిద్నపూరుకు చెందిన కుదీరామ్‌బోసు. విభజనానంతరము ప్రాథమిక దినాల్లో రంగపూర్ పాఠశాలలోకూడా దేశభక్తి కార్యక్రమాలపై నిర్బంధా లుండేవి. దాదాపు 80 మంది బాలురు వందేమాతరం నినాదంచేస్తూ నడచి వెళ్ళారు. వారే జాతీయ పాఠశాల ఏర్పడటానికి బాధ్యులు. ప్రఫుల్లకుమార్ ఛాకి వారి నాయకుడు. 15-16 ఏండ్ల వయస్సులో విప్లవ సంఘంలో సభ్యు డయ్యాడు. దృఢ శరీరుడయిన అతడు స్వచ్ఛశీలి.

14 వత్సరాల ప్రాయంలో కుదీరామ్ వందేమాతరమ్ ఉద్యమంలో పాల్గొన్నాడు. మిద్నపూర్ జిల్లా మేజస్ట్రేటు సమక్షంలో 1-4-1906న పారిశ్రామిక ప్రదర్శనకు ప్రారంభోత్సవం చేయవలసి ఉంది. వందే మాతరమ్ నినాదాలు చేయడానికి, బ్రిటీషు వ్యతిరేక కరపత్రాలను పంచ టానికి కుదీరామ్‌చే రెండునెలలకు ముందే పథకం వేయబడింది. 28-2-1906 నాటికే పోలీసులు పసికట్టారు. అతనివద్దనే మూడు కరపత్రాలు వారు సంపాదించారు. పోలీసులు అతన్ని బలవంతంగా పట్టుకోబోయేటప్పటికి "జాగ్రత్త. న్యాయస్థానంలో కేసేమీ సాక్ష్యాధారాలతో స్థాపింపబడలేదు. మీరు నన్నెక్కడకైనా తీసుకువెళ్ళండి, మిమ్ము నేననుసరిస్తాను. కాని

మర్యాదగా ప్రవర్తించండి" అని గర్జించాడు. పోలీసులకు కోపావేశం కలిగి అతన్ని బలవంతంగా పట్టుకోబోయారు. కుదీరామ్ ఎదిరించి, తప్పించుకున్నాడు.



చాలరోజుల తరువాత నేతబడి (పాఠశాల) హాస్టల్‌లో అతడున్నట్లు పోలీసులు గమనించారు. మరునటిరోజే ప్రదర్శనకు ప్రారంభోత్సవం జరుపబడవలసియున్నదిగాన శాంతిని నెలకొల్పు దృష్టితో పోలీసులకు 15 సంవత్సరాల ప్రాయముగల ఈ బాలుని భయపెట్టడం అవసరం. అర్ధరాత్రి ఒంటిగంట సమయంలో ఇద్దరు సబిన్‌స్పెక్టర్లు, పదిమంది సాయుధ పోలీసు కాన్‌స్టేబుల్సు హాస్టలుపై దాడిచేశారు; నిద్రపోతూ ఉన్న బాలుని కస్టడిలోకి తీసుకున్నారు. ఎంత అద్భుతకృత్యం! కాని ఏవిధంగానో అతని పథకం తలక్రిందులయింది.





ప్రారంభోత్సవ సమయంలో కుదీరామ్ స్నేహితులు వందేమాతరమ్ నినాదం అత్యద్భుతంగా చేసారు. పోలీసులు ఏమిచేయటానికి తోచక దిగ్భ్రమచెందారు. ప్రదర్శన చివరిరోజున కుదీరామ్‌నుండి బలవంతంగా స్వాధీనపరచుకున్న కరపత్రాలు పంచబడ్డాయి. కుదీరామ్‌పై సెక్షను 124 A, 506 ఐ. పి. సి.ల ననుసరించి తీవ్రంగా నేరారోపణలు చేయబడి కోర్టు ఎదుటకు తీసుకురాబడ్డాడు. కాని యుక్తవయస్కుడు కాకపోవడంచేత కేసు ఉపసంహరించుకోబడి 16-5-1906న అతడు వదిలిపెట్టబడ్డాడు.



1904 ఆగస్టునుండి 1908 మార్చివరకు కింగ్సుఫోర్డు కలకత్తా రాజధానికి ప్రధాన మేజస్ట్రేటు. దేశభక్తిని మాటల్లోగాని, పనిలోగాని, వ్రాతలోగాని ప్రదర్శించినవారికి అతడు క్రూరమైన శిక్షల విధించడంలో ప్రసిద్ధి వహించాడు. విప్లవకారుల దృష్టిని సహజంగా అతడాకర్షించాడు. అతని జీవితాన్ని రక్షించడం ప్రభుత్వానికి తీవ్రమైన వ్యాకులం అయింది. అతడు జిల్లాసెషన్సు న్యాయవాదిగా ఉద్యోగాభివృద్ధినిపొంది, ముజఫర్ పూర్‌కు బదిలీ అయినాడు.

కాని విప్లవకారులు కక్ష తీర్చుకోటానికి పూనుకున్నారు. ఇద్దరు బాలురకు ఆబాధ్యత అప్పచెప్పబడ్డది. వారు సాయుధులై ముజఫర్‌కు వెళ్ళారు. వారెవరోకాదు కుదీరామ్‌బోసు, ప్రఫుల్లఛాకీలే. ఏప్రియల్ 30వ కుదీరామ్‌బోసు కింగ్సుఫోర్డుమీద బాంబు విసిరాడు, కాని కింగ్సుఫోర్డు అద్భుతంగా తప్పించుకున్నాడు. ఇద్దరు ఆంగ్లేయులు చంపబడ్డారు.

ఆ ఇద్దరు విప్లవకారులు వెంటనే పట్టణంనుండి పారిపోయారు, ప్రఫుల్ల తాను పట్టుబడబోతున్నపుడు తన్నుతాను కాల్చుకున్నాడు. అతని మృత శరీరం అతడు ప్రతిదినము వందేమాతరం జపిస్తూ ఆరాధిస్తూఉండే తల్లి ఒడిలోపడిపోయింది. అది 6 గంటల సాయంకాలసమయం. (1-5-1908)

16 యేండ్ల ప్రాయంగల కుదీరామ్ రాత్రంతా నడచాడు; అతడు తినలేదు; విశ్రాంతి తీసుకోలేదు. దారుణంగా అలసిపోయాడు. 24 మైళ్ళ దూరంనడిచి అతడు వైని రైల్వేస్టేషనుకుచేరాడు. అతనికి విపరీతంగా ఆకలివేసింది. అతడు దుకాణంలో గుప్పెడు అన్నాన్నికొని మ్రింగాడు. దుకాణదారుడు అతనికి నీరుఇచ్చాడు. అతడుత్రాగబోతూఉండగా పోలీసులు అతన్ని పట్టుకున్నారు. అతనిమీద ప్రశ్నల పరంపర క్రుమ్మరించారు. కుదీరామ్ తప్పించుకోవటానికి ప్రయత్నించాడు కాని తప్పించుకోలేక పోయాడు. అతడు తన కోటును చేతిక్రింద మడచియుంచాడు. అందు రెండు చిన్నతుపాకులున్నాయ్. అతడు వాటిని బయటకులాగి ప్రేల్చటానికి ప్రయత్నించాడు. కాని ప్రేల్చలేకపోయాడు. పోలీసు కాన్‌స్టేబుల్సు ముజ ఫర్ పూర్‌కు అతన్ని ఆ సాయంకాలం రైలుకే తీసుకు వెళ్ళారు. రైల్వే స్టేషనులో పెద్ద జనసమూహం గుమికూడి ఉంది. కుదీరామ్ ముఖం ప్రశాంతంగా సంతోషంతో వెలిగిపోతున్నది. పోలీసు స్టేషనుకు తీసుకొని పోవటానికి అతడు టాంగా ఎక్కటంతోటే వందేమాతరం అని నినాదం చేశాడు. ఆ అసాధారణకృత్యానికి జనసందోహం ఆశ్చర్యంతో అతని అమాయిక ముఖంవైపు తేరిపార చూచారు.

1908 ఆగస్టు 8వ తేది ఉదయం 6 గంటలకు కుదీరామ్ ఉరి తీయబడ్డాడు. అతని ముఖానికి నల్లని ముసుగు వేసేటప్పటికి చిరునవ్వు నవ్వాడు. మరియొక మొగ్గ పూర్తిగా వికసించకుండానే తల్లి పాదాలను అలంకరించింది.

మాతృదేవ్యారాధనకు, మాతృదేశ స్వాతంత్ర్యానికి అడ్డువచ్చిన వాటిని చక్కబరచు విప్లవకారుల ఆశయం అజేయమైంది. వారి హృదయాలు ప్రఫుల్ల కుసుమాలు; అవి మాతృదేవి పాదాలనలంకరించటానికి సమయంకోసం వేచి సంసిద్ధంగా ఉన్నాయి. మాతృమూర్తి వారిద్వారా వివిధ ఆయుధాలు ఉపయోగించింది.

బెంగాల్ లెఫ్టినెంట్ గవర్నరు సర్ ఆంద్రూఫ్రేజర్ ప్రయాణిస్తున్న రైలును పేల్చివేయటానికి 6-12-1907న ప్రయత్నం జరిగింది. ఆనెలలోనే 23వ తేదీన దక్కా జిల్లా మేజిస్ట్రేటు బి. సి. అల్లెన్ విప్లవకారుని తుపాకిగుండుకు గురియై గాయపడ్డాడు. 7-4-1908న చంద్రనగర్ నగరాధ్యక్షునిపై బాంబు విసరబడింది. ఇదేరకమైన ఇతర సంఘటనలు చాలా జరిగాయి; విప్లవకారులు బానిసత్వమును నడపుచున్న రాజప్రతినిధి ప్రభుత్వ హృదయంలో భీతిని కల్గించారు. శ్రీ అరవిందుడు ఈసంఘటన కన్నింటికి వెనుక ఉన్నాడని ప్రభుత్వము చక్కగా ఊహించింది. లెఫ్టినెంట్ గవర్నరు గవర్నరుజనరలుకు వ్రాసిన లేఖలో తెలిపిన సమాచారం ఇది :-

"అతడు (అరవింద ఘోష్) విప్లవకారుల నాయకుడు. అతడు సమర్థుడు, తంత్రజ్ఞుడు, మతదురభిమాని. ఈ గుణగణములు అతనిలోని జీవశక్తిని కల్గిఉన్నవి. స్థిరచిత్తంలేని వ్యక్తియందు ఆ గుణసంపత్తి తరచుగా ఉండదు. అతడు నాయకుడు. అతనిమాటను అందరూ ఆదరిస్తారు. ప్రభుత్వంపై తిరుగుబాటు చేయడానికి ప్రేరణను ఇచ్చే వ్రాతలు వ్రాసి, రాజకీయ హత్యకు దోహదంచేసి, అతడు అగ్రగామి అయ్యాడు. అంతేకాక శత్రువుల కంటబడకుండా తననుతాను రక్షించుకోగల చాకచక్యం గల ఒక సైన్యాధిపతివలె అతడు నిశ్చింతగా ఉన్నాడు. అతనికి వ్యతిరేకంగా సాక్ష్యం మనకు దొరకదు.

# 7. దేశ ప్రహరణధారిణి

ఖుదీరాముడు, ప్రఫుల్లుడు విప్లవకారులను ఉత్తేజితులనుచేశారు. ముజఫర్‌పూర్‌లో జరిగిన బాంబు ప్రేలుడు బ్రిటిష్ సింహాసనాన్ని గడగడ వణికించింది. ఆ దేశభక్తి ప్రేరణ చేతనే మదన్‌లాల్ ధింగ్రా కర్జన్‌వైల్‌ను జహంగీరు హాలులో 1-7-1909 న హతమార్చాడు. హత్యానేరం మోప బడినప్పుడు అతడు ఆగ్రహంతో ఇట్లా అన్నాడు. "పరదాస్యంనుంచి నా మాతృభూమికి విముక్తి కలిగించటానికి కృషిచేసే దేశభక్తుణ్ణి నేను. హంతకుడు అన్నపదాన్ని నేను నిరసిస్తున్నాను. ఎందుకంటే నేను చేసిన పని పూర్తిగా న్యాయవంతమైనదని నాకు తెలుసు". ధింగ్రా తుదిపలుకులు వందేమాతరంవల్ల అతడెంతో ప్రభావితుడైనట్లు తెల్పుతున్నాయి. చూడండి- "హిందువులుగా నా దేశానికి జరిగిన దోషాన్ని భగవంతునికే అవమానంగా నేను భావిస్తాను. నా మాతృభూమికార్యం అంటే అది శ్రీరాముని కార్యమే. ఆమెకు సేవ చేయటం శ్రీకృష్ణునికి సేవచేయటమే, ఐశ్వర్యం, మేధాశక్తి లేనినావంటి తనయుడు ఆమె పాదపీఠానికి స్వీయ రక్తాన్ని తప్ప మరేమి అర్పించగలడు? కనుక నేను ఆపనేచేశాను. భగవంతుడికి నాప్రార్థన ఏమంటే నేను తిరిగి ఈ దేశంలోనే జన్మించాలి. నాదేశం స్వాతంత్ర్యం పొందేవరకు ఈ పవిత్రకార్యనిర్వహణలోనే మళ్ళీ మరణించాలి. మానవ సౌభాగ్యానికి భగవన్మహిమకు ప్రతీకగా నాదేశం నిలవాలి."

నోరారా వందేమాతరం ఆలపిస్తూ మదన్‌లాల్ ధింగ్రా ఉరికంబాన్ని ఎక్కాడు, 17-8-1909న చిరునవ్వుతో అతడు ప్రాణత్యాగం కావించాడు. తనకు మరణదండన విధించిన జడ్జితో "జ్ఞాపకం ఉంచుకోండి. ఆంగ్లేయుల్ని సాగనంపే సుదినం వచ్చితీరుతుంది." అనిపలికాడు ధింగ్రా. ఆ పలుకులు కాలక్రమేణ యథార్థమయ్యాయి. ఎందరో యువ విప్లవకారులు రుధిర తర్పణం చేసారు. ఎన్ని గాథలని....

బనారస్‌లో వందేమాతరం అనినినాదాలుచేస్తూన్ననేరానికి పోలీసుల కొరడాలతో హింసింపబడిన 13 ఏండ్లబాలుడే విప్లవ సేనానిగా మారిన చంద్రశేఖర ఆజాద్. భారత విప్లవ మహానాయకులలో ఒకడైన భగత్ సింగు దేశమాతను నిరంతరం స్మరిస్తూ ఉండేవాడు. భారతభూమి నాలుగు చెరగులా ప్రతిగడ్డిపోచ, ప్రతిఅణువు అసంఖ్యాకమైన దేశభక్తులకు స్ఫూర్తిదాయకమైపోయాయి. అందులోని ప్రతివ్యక్తిజీవితం జాజ్వల్యమానంగా ప్రకాశించే అగ్నిగోళమే అయింది.

సుశీల్‌చంద్రలాహిరి మదన్‌పూర్‌కు చెందినవాడు. అతడు కలకత్తా విశ్వవిద్యాలయంలో చదువుకొన్న సైన్సు విద్యార్థి. బనారస్ కుట్రకేసులో అనుమానితుడైన లాహిరిని 21-12-1918న లక్నోలో బంధించారు. అతని నివాసంలో రెండు పిస్టల్స్, రెండువందల తూటాలు కన్పించాయి. మే 6న అతనికి అయిదేండ్ల కఠినకారాగారశిక్షతోపాటు వేయిరూపాయల జరిమానా వేశారు. అగస్టు 11న అతనిపై వేరొక అపరాధం మోపి ఉరిశిక్ష విధించారు. "ఉరితీయబడే ముందుగా లాహిరి పవిత్ర గంగాజలం తెప్పించుకొని స్నానంచేసాడు. స్వదేశ స్వాతంత్ర్యానికై సర్వస్వం ధార పోసిన ధీరుడిలాగా అతడు గర్వంతోను, దృఢనిశ్చయంతోను ఉరికంబం చేరుకున్నాడు. త్రాడు బిగుసుకొంటున్న అతని గొంతులోనుంచి వందేమాతరం ధ్వనించింది". (The Role of Honour, P. 326.)

మాతృభూమిని అనుక్షణం ఆరాధించే గోపీమోహనసహా తన తల్లి పిలుపు విన్నాడు. కోర్టులో 14-2-1924న అతని వాఙ్మూలం ఇట్లా

ఉంది – "గతసంవత్సరారంభంనుంచి వార్తాపత్రికలలో బెగర్ట్ అనే పాశ్చాత్యవ్యక్తి భారత స్వాతంత్ర్యానికి సంబంధించిన విషయసేకరణకై ప్రపంచ పర్యటన చేస్తూ మనదేశానికి రాబోతున్నట్లు చదివాను. అతని లక్ష్యం మనప్రయత్నాలకు విఘ్నం కలిగించటం. ఈవిషయమే నేను అహోరాత్రాలు ఆలోచించసాగాను. తల వేడెక్కింది. నిద్ర పట్టలేదు. అన్నం నోటికి పోలేదు. ఒకనాటిరాత్రి 'అతన్ని అనుసరించి అంతం చెయ్యి' అన్నమాటలు విన్పించాయి". గోపీమోహన్ ఆ పలుకులు శిరసా వహించాడు. పొరపాటున అతడు బెగర్ట్‌వలెనే ఉండే మరొక తెల్లవాణ్ణి హతమార్చాడు. గోపీ ఇందుకు పశ్చాత్తాపపడినా ఆశాపూరితహృదయంతో– "బెగర్ట్ తాను క్షేమంగా ఉన్నట్లు అనుకోవచ్చు. కాని అది అడియాస మాత్రమే. నా కృత్యాన్ని నేను పూర్తిగా నిర్వహించలేకపోయినా ఆ కొరవను తక్కినవారు పూర్తిచేస్తారు" అని పలికాడు. అతని మరణ సందేశం ఇట్లా ఉంది – "ఇది నాకెంతో శుభదినం. తన హృదయంలో శాశ్వతంగా దాచుకోవటానికి నాతల్లి నన్ను పిలుస్తోంది. అందుకే నేను అక్కడకు వెళ్ళదల్చుకున్నాను". కోర్టుగదిలో గోపీ తన రక్తబిందువులు దేశంలోని ఇంటింటా స్వాతంత్ర్యబీజాలను నెలకొల్పుతాయని వాక్రుచ్చాడు. జైల్లో ఉన్నా ఉల్లాసంగా కాలం గడిపాడు. మృత్యుదినానికి ముందురాత్రి కూడా హాయిగా నిద్రించాడు. ఉరికంబానికి తానే స్వయంగావెళ్ళి ఉచ్చును మెడకు తగుల్చుకున్నాడు. అప్పుడుకూడా అతని వదనంలో ఆనందపు వెలుగు; పెదవుల్లో దైవప్రార్థన, మాతృస్తుతి. తల్లికి వ్రాసిన లేఖలో అతడు "అమ్మా! భారతదేశంలోని ప్రతితల్లి నావంటి కొడుకుల్ని కలిగి ఉండాలని ప్రార్థించు. ఫలితంగా ప్రతి హిందూగృహం నీవంటి తల్లివల్ల పునీతం అవుతుంది" అని అభిలషించాడు. బహుశః గోపీమోహన్ తల్లి ఆవిధంగానే దేవుణ్ణి ప్రార్థించిందేమో! ఆవెంటనే ఎందరో గోపీమోహన్‌లు ఉద్భవించారు. బిస్మిల్, అష్ఫక్, రోషన్, నాసు–ఇంకా వందలకొద్ది వీరులు గోపీలేని లోటును పూరించటం మొదలుపెట్టారు.

ఫైజాబాద్‌లో 19-12-1927న అష్ఫక్ ఉరితీయబడ్డాడు. అతడు పండిట్ రామ్‌ప్రసాద్ బిస్మిల్‌కు అన్నివిధాలఅనురూపుడైన అనుయాయి. కాకోరీ బ్యాంకుదోపిడిలో ఒక్కదెబ్బతో ప్రభుత్వ ధనాగారాన్ని ధ్వంసం చేశాడు అష్ఫక్. న్యాయనిర్ణయంరోజున లేతపసుపురంగు చొక్కా ధరించిన అష్ఫక్ తనకు బాష్పాంజలితో వీడ్కోలిస్తున్న బంధువులతో "పరమ పవిత్రమైన స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నందుకు నాకెంతో గర్వంగా ఉంది. హిందూ సంఘంలో ఉత్తమశీలసంపన్నులుగా పేరొందిన కన్హాయ్, ఖుదీరాముడు మొదలైనవారి సరసనచేరటానికి ఈరూపంలో నాకు అవకాశం దొరికింది." వాక్రుచ్చాడు. అష్ఫక్ ఉరితీయబడ్డరోజునే గోరక్‌పూర్‌జైల్లో బంధితుడైన రామ్‌ప్రసాద్‌నుకూడా ఉరితీశారు. రామప్రసాద్ తల్లిధైర్యం ఇతర మాతృమూర్తులకు మార్గదర్శకం కాదగింది. ఆమెకుమారుణ్ణి కడసారి కలిసికొన్నప్పుడు "మిక్కిలిబలవంతుడైన శత్రువునెదుర్కొని స్వాతంత్ర్యం కోసం పోరాడే నీలాంటివాడికి తల్లినైనందుకు నేనెంత గర్విస్తున్నానో నీకు తెలుసా నాయనా!' అన్నది.

రోషన్‌సింగ్ నావడాలోని సంపన్న కుటుంబానికి చెందినవాడు. జన్మభూమి పిలుపు వినగానే అతడు సుఖసంపదలన్నింటిని త్యజించి యుద్ధ రంగంలోకి ఉరికాడు. 21-12-1927న అతనికి ఉరిశిక్ష అమలుపరిచారు. చివరిక్షణంవరకు అసాధారణమైన హుందాతనాన్ని ప్రకటించాడు రోషన్. అతని తుది పలుకులు "వందేమాతరం".

అది 1930 డిసెంబర్ 8వ తేదీ. మిట్టమధ్యాహ్న సమయం. కలకత్తాలోని బెంగాల్ ప్రభుత్వ కార్యాలయం హడావిడిగాఉంది. ముగ్గురు యువకులు పడమటి దిక్కునుంచి భవనంలోకిజొరబడి బ్రిటిష్ అధికారులపై కాల్పులు సాగిస్తున్నారు. వారు గదివెంటగదిగా చివరిగదిలోకి రాగానే పోలీసుబలగం చుట్టుముట్టింది. ఉద్రేకంతో పరస్పరం కాల్పులుసాగించారు. అయితే లోపలనుంచి కాల్పులు ఆగిపోయిన అనంతరంగాని పోలీసులు గదిలోకి అడుగుపెట్టలేకపోయారు. లోపల ముగ్గురు విప్లవవీరులు నెత్తురు

మడుగులో పడిఉన్నారు. వారిలో సుధీర్‌గుప్తా అక్కడే మరణించాడు. వినయ్ హాస్పిటల్‌లోచనిపోయాడు. బ్రతికినప్పటికి దినేష్‌ని 2-2-1931న ప్రభుత్వం ఉరితీసింది. ఇంటిదగ్గర దినేష్‌ని 'నాసూ' అని పిలిచేవారు. నాసూ జైల్లోఉన్న మూడునెలల్లోను 12 పౌండ్లు సంపాదించాడు. తల్లికి అన్నా వదినెలకు వ్రాసినలేఖలో ఇట్లాఉంది వాసూ అభిప్రాయం – "మనం హిందువులం. మృత్యువుకు భీతిల్లటం అంటే అపజయాన్ని అంగీకరించటమే. మరణం కేవలం భౌతిక శరీరానికే, ఆత్మకు మరణంలేదు. నాలోని నేనే ఆత్మ. అదే భగవంతుడు. దీన్ని గుర్తించటం శాశ్వతత్వాన్ని పొందటం." 7-7-1931 ఉదయం 3-45కు దినేష్‌ని ఉరితీయటానికి నిర్ణయించారు. సమయం దగ్గరపడింది. "దినేష్ ఉత్సాహంతో లేచి మామూలుగా కాలకృత్యాలు ముగించుకొని కడపటి పయనానికి సన్నద్ధుడయ్యాడు. జంకు గొంకు లేకుండా మృత్యుస్తంభానికి దారితీసేమెట్లెక్కాడు. ఉరిత్రాడు బిగుసుకుపోయేవరకు అతని కంఠం బిగ్గరగా వందేమాతరాన్ని ఆలపిస్తూనేఉంది. (The Role of Honour, P. 427)

చిట్టగాంగు విప్లవవీరులగాథలు రోమాంచంగానూ, కొనియాడదగినవిగానూ ఉన్నాయి. విప్లవకారులలో ఒకాయన గ్రామపాఠశాలలో ఉపాధ్యాయుడు. అతన్ని అందరూ మాస్టర్‌దా అనేవారు. కాని అతని అసలుపేరు సూర్యసేన్. భారత విప్లవచరిత్రలో అతడునిరంతరం వెలుగులు విరజిమ్మే ఉజ్వల తారక. నిజమైన విప్లవవాదికి ఉండవలసిన సహనం, ఆసక్తి, యుక్తి, ధైర్యం, చైతన్యం, అన్నిలక్షణాలు అతనిలో మూర్తీభవించాయి. 'ఇండియన్ రిపబ్లికన్ ఆర్మీ' అనేపేరుతో ఒకసైనికదళాన్ని చిట్టగాంగులో స్థాపించి నడిపించాడు. 18-4-1930న రాత్రి సమయంలో వీరు బ్రిటిషు వారి మందుగుండు గిడ్డంగులు ఆక్రమించి అక్కడఉన్న శస్త్రాలను లాక్కొని వందేమాతరం పాడుకొంటూ వీధులవెంట తిరిగారు.

దాదాపు మూడుసంవత్సరాలు మాస్టర్‌దా బ్రిటిష్‌వారితో తన పోరాటం సాగించాడు. అతని అనుయాయులందరూ ఒకరివెంట ఒకరు

దేశమాత ఒడిలోకి జారిపోయారు. చివరికి కొంత సంఘర్షణానంతరం ప్రభుత్వసైన్యం మాస్టర్ దా ని గోయిరాలాగ్రామంలో 16-1-1933 న బంధించి 12-1-1934 న ఉరితీసింది ఆరోజు గాఢంగా మాతృధ్యానంలో మునిగిపోయిన అతణ్ణి మేల్కొల్పటం ఎవరికీ సాధ్యంకాలేదు. ఆఖరుకు తన ధ్యానం పూర్తిఅయిన తరువాత మాస్టర్ దా యథాస్థితికివచ్చి శీఘ్రంగా ఉరికంబానికి చేరుకున్నాడు. ఆవేశంతో తుదిక్షణందాకా వందేమాతరాన్ని ఉచ్చైస్స్వరంతో జపిస్తూనే ఉన్నాడు. దశదిశలా అతని కంఠధ్వని మార్మోగసాగింది. అతనికి ప్రతిగా అతని అనుచరులుకూడా వందేమాతరం నినాదాలు చేశారు. అనుకోని ఈ సంఘటనకు చకితులైన జైలు అధికారులు బలహీనంగా ఉన్న మాస్టర్ దా దేహాన్ని బలిష్ఠమైన లాఠీలతో మోదారు. కాని వారికి అతని కంఠాన్ని ఆపటం శక్యంకాలేదు. మాస్టర్ దా తన ఉద్రేకంలో ఒంటికి తగుల్తున్న దెబ్బలను గుర్తించనేలేదు. అధికారుల తీవ్రమైన హింసాప్రవృత్తికి అతనిదేహం తాళలేక నేలకూలిపోయింది. బరువుగుండెలతో అతని అనుచరులు "వందేమాతరం" అంటూ దిక్కులు పిక్కటిల్లేలా అరవసాగారు. పోలీసులు నిస్సహాయులైనారు. చైతన్యశూన్యమైన మాస్టర్ దా శరీరానికి ఉరిత్రాడు తగిలించబడింది. అంతే-చిట్టగాంగు విప్లవనిర్మాత, నామశ్రవణమాత్రానే ఆంగ్లేయుల నరాలను కలవరపరచిన ధీరుడు, గ్రామీణుని మొదలు విశ్వవిద్యాలయ విద్యార్థి వరకు అందరి మనస్సులను అమోఘమైన తన దేశభక్తితో ఆశ్చర్యపరవశంచేసిన నాయకుడు అస్తమించాడు. ఆరోజు రాత్రే అతని జీవిత సహచరుడు తారకేశ్వర దస్తీదార్‌కూడా స్వాతంత్ర్య సమరంలో వీరమరణం పొందాడు.

మరణించిన పిమ్మటకూడా జాతీయవీరులు బ్రిటిషువారికి భయం కలిగిస్తూ ఉండేవారు. వారి భస్మావశేషాలనుంచి అశేషంగా వేలకొలది విప్లవకారులు వందేమాతరం నినాదంతో ఆవిర్భవిస్తారని భయపడేవారు ఆంగ్లేయులు. అందుకని వారు విప్లవకారుల మృతకళేబరాలను ఈస్టిండియాకంపెనీ నౌకలో ఉంచి జలచరాలకు ఆహారంగా సముద్రంలో

పడవేసేవారు. అయినా తీరానికి చేరుకొనే సముద్రతరంగాలు మృతవీరుల అంతరంగసందేశాలను కొనివస్తుండేవి. చల్లని సముద్రపు పిల్లవాయువులు మాస్టర్‌దా ఉపదేశాన్ని అతని అనుచరులకు అందించాయి. వారు తమ ప్రియతమ నాయకుని మృతికి హేతుభూతులైన ఆంగ్లేయాధికారులను మట్టుబెట్టి ప్రతీకారం తీర్చుకున్నారు.

20వ శతాబ్ది ప్రారంభంలో వందేమాతరం విన్పించటం మొదలు పెట్టగానే అసంఖ్యాకమైనదేశభక్తులకది నిరంతరస్మరణీయమైన మహా మంత్రంగా మారింది. 1942లో మలయాలో ఉత్పన్నమైన భారత స్వాతంత్ర్యదళపు విప్లవకారులు భారతదేశంలోకి ప్రవేశించాలని ప్రయత్నిం చారు నాల్గు జట్లుగా వారు సింగపూర్ విడిచారు, కాని దురదృష్టవశాత్తు వారిలో చాలామంది ఇండియాలో కాలుపెట్టగనే పోలీసులచేతిలో చిక్కారు, 10-9-1943న ఆనందన్, సత్యేంద్రబర్దన్, అబ్దుల్ ఖాదిర్, ఫౌజాసింగ్ అనే నలుగురు విప్లవయోధులు మద్రాసులో ఉరితీయబడ్డారు. 'ఉరికి ముందు రాత్రి వారు వందేమాతరాన్ని మనసారా పాడుకొన్నారు. చెక్కుచెదరని ధైర్యంతో ఉరికంబపు మెట్లెక్కారు. కొనఊపిరి ఉన్నంతవరకు వారు ముక్తకంఠంతో వందేమాతరంఅని అరుస్తూనే ఉన్నారు.' (The Role of Honour, P. 578)

బ్రిటిష్ సైనికోద్యోగులలోకూడా స్వాతంత్ర్యంకోసం తపించుతూ సాహసంతో విప్లవానికి సంసిద్ధులైన యువకులున్నారు. 18-4-1943న వారిలో Fourth Madras Coastal Defence Bettery కి చెందిన కొంత మంది పితూరీ జరుపుతున్నారన్న ఆరోపణతో ఖైదుచేయబడ్డారు, ఆ అప రాధులపైన బెంగుళూరులో విచారణ జరిపించి ఉరిశిక్ష విధించారు. మద్రాసులో వీరిని ఉరితీశారు. వీరందరు 26 సంవత్సరములలోపువారే. గణనీయమైన ధైర్యాన్ని వీరు ప్రదర్శించారు. వందేమాతరంవల్ల ఉత్తే జితులై ఆ గీతాలాపనంతోనే చెదరని దరహాసంతో ఆ వీరకిశోరాలు తమ జీవితాలను త్యాగంచేశారు." (The Role of Honour, P. 582)

# 8. తొలి విజయం

వందేమాతరమూ, స్వదేశీ ఉద్యమమూ క్రమంగా క్షీణించిపోతున్న కాంగ్రెసు ప్రతిష్ఠను నిలబెట్టి నూతనజీవం పోశాయి. దేశం మారుమూలల్లో ఏవో పనిపాటులతో జీవితం గడిపే ప్రతివ్యక్తినీ వందేమాతరం ఆకర్షించి స్వాతంత్ర్య సంగ్రామం అనే మహాప్రవాహంలోకి తీసికొనివచ్చింది. రవీంద్రనాథటాగూరు అప్పుడే శాంతినికేతనం స్థాపించి కోలాహలంతో నిండిఉండే నగరవాతావరణానికి దూరంగా ప్రశాంతంగా గడపసాగాడు. "అప్పుడు ఒక ఝంఝాప్రభంజనం సముద్భవించింది. వందేమాతరం అనే రణభేరీనినాదంతో, ఉదాత్తమైన ఆశయాలతో ఉన్నతాదర్శాలతో, విప్లవోద్వేగంతో జాతీయోద్యమం బయలుదేరింది. ఆ ఉద్యమానికి ప్రధానార్చకుడైనాడు కవి. ("Modern Review, July 1917; Ajit Chakravarty) ప్రళయభీకరమైన ఆ రణనిస్వాణనిస్వనం పర్వతాలను గ్రక్కదలించి సముద్రాల ఘూర్ణిల్లజేసి ఆఫ్రికాలో ఉన్న మోహన్‌దాస్ కరమ్‌చంద్‌గాంధీ చెవిన పడ్డది. గాంధిజీ దానినిగూర్చి ఇట్లా వ్రాశారు - "ప్రతి పాశ్చాత్యదేశానికి దాని జాతీయగీతం ఉన్నది. పాశ్చాత్యులు ముఖ్యమైన సందర్భాలలో వారి జాతీయగీతాన్ని పాడుకుంటూంటారు. బ్రిటిషువారి "God save the king" అనే జాతీయగీతం సుప్రసిద్ధమే. ఆ గీతం పాడినంతనే ఆంగ్లేయుడు వీరభావంతో ఉత్తేజితుడౌతాడు.

జర్మనీకికూడా జాతీయగీతం ఉన్నది. అట్లాగే ఫ్రాన్సుకి "La Marseillaise" అనే చక్కని జాతీయగీతం ఉన్నది. ఇది గ్రహించిన బెంగాలీ కవిచంద్రుడైన బంకించంద్రుడు బెంగాలీ ప్రజలకోసం ప్రత్యేకంగా ఒక గేయం వ్రాయాలని సంకల్పించాడు. ఆ సంకల్పమే "వందేమాతరం గేయంగా అవతరించింది. ఈ గేయం బెంగాల్ అంతట విపరీతమైన ప్రఖ్యాతిని ఆర్జించింది. స్వదేశీ ఉద్యమానికి చెందిన పెద్దపెద్ద సభలలో లక్షలకొలది ప్రజలు గుమికూడి బంకింగేయాన్ని ఆలపించసాగారు. వారలా మారుమ్రోగిన ఆ గేయం అనతికాలంలోనే మన జాతీయగీతంగా రూపుదాల్చింది. ఉత్తమలక్ష్యంలోను, మాధుర్యంలోను, ఆర్ద్రభావనలోను తక్కినదేశాల జాతీయగీతాలకంటె విశిష్టత కలిగింది వందేమాతరం. ఇతర జాతీయగీతాలలో పరదేశాలపైని అసహనత్వం గోచరిస్తుంది. కాని అట్టిలోపాలు వందేమాతరం గేయంలో మచ్చుకైనా కన్పించవు. దాని ఏకైకలక్ష్యం మనలో దేశభక్తిని ప్రేరేపించి పెంపొందించటమే. బంకిం చంద్రుడు ఈ గేయంలో ప్రతిమాతృమూర్తిలోనుఉండే సద్గుణాలే భారత మాతలోను ఉన్నట్లు చిత్రీకరించాడు. మనం తల్లిని ఎట్లాపూజిస్తామో అట్లాగే ఈ గేయం పాడటంవల్ల మన దేశమాతనుకూడా మనం ప్రార్థించినవాళ్ళ మౌతాము. ఇందులో చాలావరకు సంస్కృతపదాలు ఉపయోగించబడినా అవి సులభంగానే అర్థమవుతాయి. (Indian opinion 2-12-1905)

లండన్‌లో ఉన్నపుడు సుభాస్‌చంద్రబోస్ స్వదేశీ ఉద్యమం రోజుల్ని గర్వంతో జ్ఞాపకం చేసుకొనేవాడు. ఒకసారి సుభాస్ లాంక్‌షైర్‌లో డాక్టర్ ధర్మవీర ఇంట్లో దిలీప్‌కుమార్ రాయ్‌తో – 'సాయుధ విప్లవమే భారత స్వాతంత్ర్యానికి ఏకైకమార్గం' అని వెల్లడించాడు. ఈ విషయాన్ని 'The Subhas I Knew' అన్న గ్రంథంలో దిలీప్‌కుమార్‌రాయ్ తెలిపాడు సుభాస్ ఇట్లా పలికేవాడు – 'మనం విప్లవంవిషయంలో యౌవనదశలో ఉన్నప్పుడు రష్యావిప్లవం బాల్యదశలోఉన్నది అవిఅద్భుతమైన రోజులు. నేనప్పుడు పసివాణ్ణి. కాని నారక్తంలో అప్పటి స్వదేశీగేయాలు ఇంకా

ధ్వనిస్తూనేఉన్నాయి. ఈశతాబ్దారంభంలో జరిగిన బెంగాల్‌విప్లవం నిజమైన మొదటి ఉద్యమం. ఎందుకంటే దుర్బలుల మనుకున్న మన ప్రజలకు ఆ ఉద్యమం వారిశక్తిని వారు గుర్తించేటట్లుచేసింది. జాతీయ చైతన్యానికి ప్రాణం పోసిన ఆ ఉద్యమం మన విధిని మలుచుకోగల శిల్పులం మనమే అన్న సత్యాన్నికూడా స్పష్టీకరించింది.'

ఈ విధంగా యువకుల మనస్సులపై చెరగని ముద్రను వేసింది వందేమాతరం. 1905లో బెంగాల్ విభజింపబడింది. అదేసంవత్సరం డిశంబరులో కాంగ్రెస్ 12వ సమావేశం బెనారస్‌లో జరిగింది. గోపాలకృష్ణ గోఖలే అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ఆయన మితవాది, "మంచిజరిగినా చెడుజరిగినా మన భవితవ్యం ఆంగ్లేయులతో ముడిపడియున్నది. మనం ఎటువంటి ప్రగతిని సాధించాలనుకున్నప్పటికి అది బ్రిటిష్ సామ్రాజ్యానికి కష్టంకలిగించకుండా ఉండాలి" అని గోఖలే చెప్పాడు, లాల్, బాల్, పాల్ ముగ్గురు స్వదేశీ, విదేశవస్తు బహిష్కారం అనే విషయాలపై కాంగ్రెస్‌చే తీర్మానాలు చేయించటానికికృషిచేశారు. బెంగాల్ విభజననిరసించే తీర్మానం కూడా ఏకగ్రీవంగా అంగీకరించబడింది. సిస్టర్ నివేదితకూడా కాంగ్రెస్ సమావేశానికి వచ్చింది. ఈ సమావేనికి విచ్చేసిన మరొకవ్యక్తి ప్రముఖ బెంగాలీ కవయిత్రి. గాయనిఅయిన సరళాదేవి చౌధురాణి, ప్రేక్షకులు ఆమె వందేమాతరం ఆలపించితే వినాలని కుతూహలపడ్డారు. ఆ కోరికను వారు అధ్యక్షుడైన గోఖలేకు తెలిపారు. ఆ రోజుల్లో బెంగాల్‌లో వందేమాతరం అని అనటంలేదా ఆ గీతం పాడటం నిషేధింపబడ్డాయి. నాటి కాంగ్రెస్‌సభ బెంగాల్‌లోకాక బెనారస్‌లో జరుగుతున్నప్పటికి గోఖలే వందేమాతరం గానం చేయించటానికి నిరాకరించాడు. వెంటనే జనంలో కలకలం బయలుదేరింది. అందరూ వందేమాతరంలోని మాధుర్యం చవిచూడాలని తహతహ లాడారు. అప్పుడు గోఖలే ఆగేయంలోని కొన్నిపంక్తులు పాడటానికి అవకాశ మిచ్చాడు. కాని సరళాదేవి గానం మొదలుపెట్టి వందేమాతరాన్ని సమగ్రంగా పాడింది. ఆ గేయానికి ఆనాటిశ్రోతలు ఎంతగా హర్షపులకిత హృదయులైనారో చెప్పలేము.

బాబూ సురేంద్రనాథ బెనర్జీ ప్రసంగింపబోయే ముందుకూడా తిరిగి వందేమాతరం నినాదాలు సభలో విజృంభించి వినిపించాయి. ఆ కలకలం సర్దుమణిగాక బెనర్జీ మాట్లాడుతూ బెంగాల్ విభజనని వ్యతిరేకిస్తూ పన్నెండవ తీర్మానాన్ని చేశాడు. జాతీయోద్యమంగా వందేమాతరం రూపొందిందనే విషయాన్ని అతడు గుర్తించాడు. బెంగాల్ ప్రజల కష్టాలు, వేదనలు, నిరాశలు సర్వభారతానికి తెలుపవలసి ఉంటుందని బెనర్జీ అన్నాడు. అతని ప్రసంగం అంతా హర్షంతోను వందేమాతరం నినాదాల తోను స్వీకరించారు సభాసదులు. "లార్డ్ కర్జన్ కుతంత్రంతో చేసిన బెంగాల్ విభజనని మనం అంగీకరించం. అది జరిగింది అక్టోబర్ 22. నేడు డిశంబర్ 29. బెంగాల్ విభజన అంతరించేదాకా మనం ఈ ఉద్యమాన్ని ఆపకూడదు. (కూడదు కూడదు అని సభలో కేకలు) బెంగాల్ క్రొత్తవిభాగంలో సభలు నిషేధింపబడ్డాయి. సంకీర్తనసంఘాలు, దారుల వెంట వందేమాతరం పాడుతూ వెళ్ళటం నిషేధింపబడ్డాయి. (జనంలో కొందరు వందేమాతరాన్ని శ్రావ్యంగా పాడారు.) మీరిప్పుడు ఎంత శ్రద్ధా భక్తులతో ఏ గేయాన్ని గానంచేశారో ఆ గేయం పాడటం నేరంగాను శిక్షార్హంగాను పరిగణిస్తోంది ప్రభుత్వం. (సిగ్గు సిగ్గు) దేశభక్తి గీతాల నాలపిస్తున్న యువకుల్ని బంధిస్తున్నారు. ఇటీవలనే జైల్లో ఉంచబడ్డ అరడజనుమంది యువకులు జైలుగోడలు ప్రతిధ్వనించేలా దేశభక్తి గేయాలను ఉద్రిక్తహృదయంతో పాడారు. (వందేమాతరం నినాదాలు) జైలు అధికారులు ఆహారం తీసుకొచ్చారు. కాని ఆ యువకులు అన్నం ముట్టటానికి తిరస్కరించారు. (వందేమాతరం నినాదాలు)" ఈవిధంగా సాగిన బెనర్జీ ప్రసంగాన్ని సభాసదులు సంతోషంతోను వందేమాతరం అనే నినాదాలతోను గ్రహించారు. వారు వందేమాతరంలోని మకరందాన్ని తనివితీరా గ్రోలారు. మదనమోహన్ మాలవ్యా తన ప్రసంగంలో ఇట్లా అన్నాడు - "వందేమాతరం అని వ్రాసిన వ్రాతపలకలను నిషేధింపవలసిన అవసరమేమి వచ్చింది? వాటిని తీసుకువెళ్ళి తగలబెట్టవలసిన పనేముంది? నిజానికి వందేమాతరం ఒక మామూలు నినాదం. 'తల్లీ!

నీకు వందనం చేస్తున్నాను' అని దాని అర్థం. దానిలో ఎట్టి దురాలోచన కాని, అవహేళనకాని, మత్తుకాని లేవే. ఆంగ్ల సాహిత్యాధ్యయనపరుడైన ఏ ఆంగ్లేయుడుకాని వందేమాతరానికి అభ్యంతరం చెప్పటం ఆశ్చర్య కరం", ఆరోజుల్లో జాతీయ నాయకుల ప్రసంగాలు తరచుగా వందే మాతరం నినాదాలతో అడ్డగింపబడుతూండేవి. ఇందుకు లెక్కలేనన్ని నిదర్శనాలు మనకు దర్శనమిస్తాయి. మచ్చుకి ఒక్కటి. 1907 మొదట్లో బాబూ విపినచంద్రపాల్ పూర్ణస్వరాజ్యాన్ని కోరుతూ అన్నమాటలు ఇట్లా ఉన్నాయి. "ఒకవేళ ప్రభుత్వం గనుక "ఇదుగో మీకు స్వాతంత్ర్యం ఇచ్చేస్తున్నాం తీసుకో అంటే, మీకు నమస్కారం అంటాను, అంతేగాని ఆ దయాభిక్షను స్వీకరించను. స్వాతంత్ర్యం ఎవరో ఇచ్చేది కాదు, నేను స్వయంగా స్వశక్తితో సంపాదించుకొంటాను (వందేమాతరం నినాదాలు)" (వందేమాతరం నినాదాలు) అని చెప్తాను". సామాన్యంగా ప్రసంగాలు కాగానే వందేమాతరం నినాదాలు చాలాసేపు మిన్నుముట్టుతూండేవి.

1907 లో కైర్‌హార్డీ అనే బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు భారత యాత్ర జరిపినప్పుడు అతనికి ఎక్కడికి వెళ్ళినా వందేమాతరంతో స్వాగత మీయబడేది. తన ప్రసంగానంతరం కైర్‌హార్డీకూడా తప్పనిసరిగా 'వందే మాతరం' అనేవాడు. బరిసల్‌లో ఒక స్త్రీ 'వందేమాతరం' అని చెక్క బడిన వెండిపళ్ళాన్ని హార్డీకి, అట్లాగే చెక్కబడిన వెండి కుంకుమబరిణెను శ్రీమతి హార్డీకి బహూకరించింది. హార్డీ టుటికోరిన్‌నుంచి కొలంబోకు వెళ్ళబోతూ తన టోపీని గాలిలో ఊపుతూ 'వందేమాతరం' అంటూ సెలవు తీసికొన్నాడు.

అరవిందుడు బరోడా నుంచి బనారస్ కాంగ్రెసుకువచ్చాడు సోదరినివే దితఅతన్నికలిసికొని బెంగాల్‌కు రమ్మనికోరింది. 'ఎప్పుడు మీరు కలకత్తా వస్తారు? ఎంతకాలం మీరు పరోక్షంగా కృషిచేస్తారు? ఎప్పుడు మీరు మీ భవానీమందిర్ కలను ఆచరణలో చూపుతారు? మేమందరం మీ ఆగమనంకోసం ఎదురుచూస్తున్నాం!' అని ఆమె అరవిందునితో పలికింది.

అందుకాయన ఇట్లా సమాధానమిచ్చాడు – "నేను త్వరలోనే వస్తాను" ఆయన జాతీయ కళాశాలలో ఉపన్యసించేందుకని కలకత్తా వచ్చాడు. తరువాత కొంతకాలానికి జరిగిన బరిసల్ సమావేశానికి అతడు వెళ్ళాడు ప్రభుత్వం చేస్తున్న దురాగతాలుచూస్తున్నకొద్దీ అతనికి బలాన్ని బలంతోనే ఎదిరించాలనే నిశ్చయం కలిగింది.

ఒకనెల తరువాత లోకమాన్య బాలగంగాధరతిలక్ ప్రబోధం వినే అదృష్టం కలిగింది బెంగాల్ ప్రజలకు. 'తిలక్‌కు ఎప్పుడైతే బెంగాల్ ప్రజలతో ప్రత్యక్ష సంబంధం ఏర్పడిందో అప్పటినుంచి బెంగాల్ ప్రజల వీరపురుషులలో శివాజీకూడ ఒకడైనాడు. 1906లో బెంగాలీయులు శివాజీ ఉత్సవాలలో పాల్గొనటానికి తిలక్‌ను అనుచరసమేతంగా ఆహ్వానించారు. అంతవరకు బెంగాలీయుడుకాని ఏవ్యక్తీ అంతటి ఘనస్వాగతాన్ని అక్కడ పొందలేదు. పూనా నాయకులకు వీరోచిత సత్కారం ఇవ్వబడింది. జనం వారిని కలకత్తా వీధులలో ఉత్సాహోద్రేకాలతో ఊరేగించారు. నాయకులు ఎక్కినబండ్లను గుర్రాలుకాక ఉత్సాహంతో ప్రజలే స్వయంగా లాగారు. ప్రాసంగికులు గంగాజలంతో పవిత్ర స్నాతులై భగవదాశీర్వాదాలను అభిలషిస్తూ వేదిక నధిరోహించేవారు.' (Lokamanya Tilak by Ramgoal P. 243)

బెంగాలీయులు భవానీ భక్తులు. దానికితోడు శివాజీకూడా భవానీ భక్తుడుకావటంతో బెంగాల్‌కు శివాజీకి నడుమనున్న బంధాలు మరింత సన్నిహితం అయ్యాయి. 4-6-1906 నుంచి వారంపొడుగునా బెంగాల్‌లో శివాజీ ఉత్సవాలు జరిగాయి.

ఇరవైరెండవ కాంగ్రెస్ సమావేశం డిసెంబర్ 1906 న కలకత్తాలో ఏర్పాటైంది. వందేమాతరం నినాదాలు మిన్నుముట్టాయి, సభలో ఆగీతాన్ని పాడారు. దేశమంతటా వందేమాతరం పరివ్యాప్తం కావటానికి ఆసభ దోహదంచేసింది. సభారంభంలోనే రవీంద్రనాథటాగూరు స్వయంగా వందే మాతరాన్ని గానంచేశాడు. స్వాగతసమితి అధ్యక్షుడైన డాక్టర్ రాస్

బిహారీ ఘోష్ తన స్వాగతోపన్యాసంలో "జాతీయగీతాన్ని గానం చేయటాన్నే కాదు-వందేమాతరం అని ఉచ్చరించటాన్నికూడా ప్రభుత్వం నిషేధించింది. దీనిని ఎదిరించినవారిని తీవ్రంగా శిక్షించింది". అని ఆవేదనతో అన్నాడు. ఆ సభతో వందేమాతరానికి ఎంతో ప్రచారం వచ్చింది. నాటినుంచి ప్రతికార్యక్రమంలోను వందేమాతరాన్ని విధిగా పాడటం అలవాటైపోయింది. ప్రాసంగికులు తమ ప్రసంగాలను వందేమాతరం నినాదంతో ముగించేవారు. "గాయకురాండ్రు సామూహికంగా వందేమాతరం గానంచేసేవారు. ప్రేక్షకులు గౌరవసూచకంగా లేచి నిలబడేవారు. విషయనిర్ణాయకసంఘ ప్రతినిధుల ఎన్నిక కాగానే సభ వాయిదాపడేది". (How India wrought Her Freedom, Annie Besant, P. 447)

క్రమక్రమంగా వందేమాతరం తలుపులమీద గోడలమీద కనబడటమేకాక జెండాలమీద, వ్రాత పలకలమీద అలంకరింపబడుతుండేది. ఆ భక్తిభావంతోనే చీరలు. ధోవతులు అంచులమీద వందేమాతరం నినాదం వ్రాయబడేది. వాటిని ధరించటం గర్వకారణంగా భావించేవారు ప్రజలు. 1910 లో 'అమ్మా ! నేను నీనుంచి సెలవుతీసుకొంటాను. మందహాసంతో నేను ఉరికంబం ఎక్కుతాను, ఇందుకు సాక్షులు ప్రజలే. మహాఅయితే ఒక బాంబు ఒకప్రాణాన్ని కబళిస్తుందేమో. కానివేలకొలది బాంబులు మాఇండ్లలో ఉన్నాయి. నిన్ను ఈ ఇంగ్లీషువారేమిచేయగలరు తల్లీ ' అన్న అర్థాన్నిచ్చే నాల్గుపంక్తులు బెంగాలీపద్యం ముద్రితమైన ధోవతులు విపరీతంగా ప్రజాదరణ పొందాయి. ఈ పద్యం వ్రాయబడ్డ ధోవతుల నన్నిటిని ప్రభుత్వం సత్వరం స్వాధీనపరచుకొంది. కానిఉద్యమాన్ని అరికట్టటం ఎట్లాసాధ్యం? విద్యార్థులందరూచేరి వీరావేశంతో విదేశవస్తువులను, అంగళ్ళను దగ్ధంచేయసాగారు. వందేమాతరం నిషేధాన్నిలెక్కచెయ్యని స్కూలుపిల్లలు మొక్కవోని విక్రమంతో ఉద్యమంలో పాల్గొన్నారు.

విపినచంద్రపాల్ తూర్పుబెంగాల్‌లో పర్యటిస్తూ ప్రజల్ని ప్రబోధింపసాగాడు. అతని మొదటి మజిలీ సిల్‌హెట్. 16-8-1906 న పెద్ద

ఎత్తున విద్యార్థిసమావేశం ఏర్పాటుచేయబడింది. విపినచంద్రపాల్ తన ప్రసంగంలో భారతీయులు జైలుభయాన్ని విడిచిపెట్టి వందేమాతరం ఆలపించాలని ఆ ప్రయత్నంలో జైలుకు పోవటానికికూడా సంసిద్ధులు కావాలని ఉద్బోధించాడు. "వందేమాతరం" అంటూ అతడు చెప్పిన విషయాలకు సమ్మతిని తెలిపింది ప్రజాసమూహం. మిగతాచోట్లకూడా ఇలాగే జరిగింది.

అతివాదులు ప్రభుత్వంమీద యుద్ధం ప్రకటించేంతదూరం పోయినారు. వారు దేశభక్తులకు పిలుపునిస్తూ "బూటకపు వాగ్దానాలకు తాత్కాలిక లాభాలకు మోసపోకండి. లక్ష్యసాధన మార్గంనుంచి వైదొలగకండి. స్వాతంత్ర్యదేవతకు మీ రక్తాన్ని ధారపోయండి. మృతవీరుల భస్మావశేషాలు ప్రతీకారంకోసం అలమటిస్తున్నాయి. వాటి పిలుపును ఆలకించకపోతే వంచనాపాపం మిమ్మల్ని నిలువునా చుట్టుకుంటుంది" అని చెప్పేవారు. ఉద్వేగపూరితమైన బెంగాలీయుల ఆత్మ పాశ్చాత్యుల దురాక్రమణకు హింసాయుతంగానే ప్రతిస్పందించింది. శిఖరాయమాణమైన దేశభక్తిభావాన్ని అవిరళంగా పెంపొందించే క్రొత్తవిధమైన మాతృదేశ ప్రార్థనలను, సాహిత్యాన్ని బెంగాల్ సృష్టించింది. భారతదేశంలో జాతీయత అనే క్రొత్తమతం ఉద్భవించి సంగీత, సాహిత్యాదులను, సర్వకళలను ప్రభావితంచేసి మాతృదేవికి సర్వశోభితమైన నూతన వస్త్రాలంకరణ నొసగింది. అసదృశమైన సౌందర్యంతోను, వైభవంతోను, శక్తితోను వర్ధిల్లే భారతావనిని కవితారూపంలో కన్పింపజేశాడు బంకించంద్రుడు. ఈ గేయం మన ప్రజలను తేజోవంతులైన జాతీయవాదులుగా మార్చింది. వేలకొలది ఉపన్యాసాలు, వార్తాపత్రికలలోని వ్యాసాలు, చేయలేనిపని ఈ ఒక్క గేయం చేసింది. ఈ గేయంలో శత్రువులను తరిమివేస్తూ దేశాన్ని అనుక్షణం సంరక్షిస్తున్న జాతీయసేనను దర్శించగలిగారు ప్రజలు.

"వందేమాతరం గేయం, ఆనందమఠం నవల భారతప్రజల్ని ఎంతో ప్రభావితుల్ని చేశాయి. విపినచంద్రపాల్ బంకించంద్రుని తత్వాన్ని

అరంచేసికొని హిందువులు ఆరాధించే దేవతల సమష్టిరూపమే భారతమాత" అని 1909 లో స్పష్టంగా ప్రకటించాడు. స్వదేశీ ఉద్యమసమయంలో అరవిందుడు తాను నడపిన పత్రికకు 'వందేమాతరం' అని పేరుపెట్టాడు. బెంగాల్‌లో విప్లవకారులకు అందింపబడే రహస్య సూచనాపత్రాలలోని విషయం 'ఓం వందేమాతరమ్' అనే మాటలతో ఆరంభమవుతూ ఉండేది. (Freedom struggle in India, P. 215)

చాలామంది బెంగాల్ విప్లవకారులు మాతృపూజాతత్పరులు లేదా తాత్వికులు. వీరిలో మొదటివర్గంవారు మాతృభూమిని వివిధస్థితులలోనున్న శక్తిరూపిణిగా పరిగణించేవారు. (Indion Nationalist and Thought, P. 120) మాతృపూజా తత్పరులను, తాత్వికులనుగూర్చి లాలాలజపతిరాయ్ "వారు తమవిధిని, గౌరవాన్ని గుర్తెరిగినవారు. తమ ప్రతిజ్ఞలకు కట్టుబడి ఉండేవారు.' అని వ్రాశాడు. "వారు శూన్యవాదులు, అరాజకవాదులుకారు. వారు దేశభక్తిని మహోన్నతపరచి మతస్థాయి కల్పించిన విశుద్ధ దేశభక్తులు, వారిమతం దేశాభిమానంతో పొందుపొసగి ఉండటమేకాక దానికి గాఢత్వాన్ని చైతన్యాన్ని - రెంటిని కలిగిస్తుంది. వారిజీవితం సర్వం దీనితో ముడిపడింది. (young India, P. 194)

"వందేమాతరం గేయంలో ప్రస్ఫుటమయ్యే అభిప్రాయం ఇది - భారత్ మనకందించిన ఐహిక పారమార్థిక సంపదను మాతృమూర్తిగా చిత్రించడం జరిగింది. ఏ దివ్యశక్తి తనబిడ్డలను భౌతికంగాను ఆధ్యాత్మికంగాను భరించి కాపాడుతున్నదో ఆ మాతృమూర్తిని స్తుతించడంజరిగింది. వందలకొలది దేశభక్తులచేత పవిత్రంగా భావించబడి గానంచేయబడ్డ ఈ గేయమే యథార్థమైన భారతజాతీయగీతం. ఇందులో దేశం మాతృమందిరంగా కాక హృదయార్పణ భావంతో సంతానం అందించే పూజలందుకొంటున్న మాతగానే తలంపబడింది. కాబట్టివారు దేశగతిని సర్వాంగసుందరంగామలచి యుగాలతరబడిగా అభ్యుదయాన్ని కలిగించే శక్తిని అర్చిస్తున్నారన్నమాట. నిరంతరమైన ఈ అర్చనావిధి బాహ్యరంగంలోను ఆంతరరంగంలోను దేశం

సాధించే ఘన విజయాలకు దోహదంచేసి ఉజ్వలమైనచరిత్రను సృష్టిస్తుంది. ఈ రీతిగా భారత చరిత్ర, దాని భౌగోళికస్థితి విడదీయలేనంతగా పెనవేసి కొన్నవి. భౌగోళికంగా ఉజ్వలముఅయిన భౌతిక సౌందర్యాన్ని మాత్రమే భారతదేశంగా తానెన్నడూ భావించలేదని. అనంతమూ చిరంతనమూ అయిన మాతృదేవిగానే తాను భారతమాతను దర్శిస్తున్నట్లు తెలియజేశాడు అరవిందుడు. భారతదేశపు ఈ రహస్యతత్వాన్నే బంకించంద్రుడు విశద పరుస్తూ త సోదర ప్రజలు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుపొంది పూర్వపు ఔన్నత్య శిఖరాలకుచేరేహక్కు కలిగిఉన్నారని గేయరూపంలో తెలియచేశాడు. (Resurgent India, Sisir Kumar Mitra, P. 191) బంకించంద్రునిద్వారా వెల్లడించబడిన ఈ రహస్యం ప్రజలమనస్సులో స్థిరంగా పాతుకొన్నది, దేశం జాగృతమైంది. ఫలితంగా 12-12-1911 న జార్జి చక్రవర్తి ఢిల్లీకి వచ్చినపుడు కర్జన్ప్రభువు చేసిన బెంగాల్ విభజన ఉత్తర్వును రద్దుచేశాడు. రవి అస్తమించని బ్రిటిషు సామ్రాజ్యం వందేమాతరమ్ అన్న రెండు పదాల శక్తిముందు తలవంచింది. ఇది తొలి విజయం.

## 9. విజృంభణ

ఆర్. సి. దత్ ఉద్దేశంలో బంకించంద్రుని పరమోత్కృష్ట రచన అయిన వందేమాతరం భారత జాతీయతకు, సంస్కృతికి అచ్చపు మణి దర్పణం. (The culture of India, P. 73) బి సి. పాల్ ఉద్దేశంలో "వందేమాతరంలో నిహితమై ఉన్న జాతీయభావన కేవలం సాంఘిక, ఆర్థిక రాజకీయపరమైన ఆదర్శాలకు పరిమితమైనదికాదు. అదొకమతం". అది సర్వభారతాన్ని ఆవరించింది. విపినచంద్రపాల్‌కు మద్రాసుతో సన్నిహిత సంబంధాలు ఉన్నాయి. అతనిద్వారానే వందేమాతరం మద్రాసుకు ప్రయాణించిందని చెప్పవచ్చు. తరువాత సుబ్రహ్మణ్యభారతి దానిని ప్రఖ్యాతం చేశాడు 1905 లో బెనారస్ కాంగ్రెసుకు వచ్చిన యువప్రతినిధులుకూడా వందేమాతరం సందేశాన్ని దేశంలోని భిన్నప్రాంతాలకు తీసుకువెళ్ళారు. 1905, 1906 సంవత్సరాలలో సుబ్రహ్మణ్యభారతి కాంగ్రెస్ సమావేశాలకు పత్రికాప్రతినిధిగా మద్రాస్‌నుండి హాజరయ్యాడు. అతడు సిస్టర్ నివేదితను కలకత్తాలో కలిసికొన్నప్పుడు ఆమె అతనిని మాతృభూమికి సేవచేయటానికి దీక్షపూనమని కోరింది. సుబ్రహ్మణ్యభారతి ఆమెను తన గురువుగా భావించాడు. అతని మొదటి కవిత "జయబంగళా" అన్నది. తరువాత తమిళంలో అతడు వ్రాసిన "వందేమాతరం" "నమోభారతా" "భారత్ అవర్ లాండ్" అన్నవి మిక్కిలి ప్రజాదరణను పొందాయి.

జి. ఏ. నటేశన్ ఈ మూడురచనలను ఒక్కొక్కటి 15 వేల ప్రతుల చొప్పున ముద్రించి ఉచితంగా పంచిపెట్టాడు. భారతి రచించిన దేశభక్తి గేయాలన్నింటికి వందేమాతరంలో బంకిం వర్ణించిన మాతృమూర్తే స్ఫూర్తి ప్రదాత. 'స్వదేశగీతాంజలి' అనే తన గ్రంథపీఠికలో సుబ్రహ్మణ్యభారతి "ఈ పుష్పాలు ఐకమత్యానికి, శాశ్వత నూతనత్వానికి చిహ్నమైన భారత మాతకు అంకితమైనాయి" అని వ్రాశాడు. 1909 లో వెలువడ్డ 'జన్మ భూమి' అన్న గ్రంథపీఠికలో అతడు "స్వాతంత్ర్య తేజస్సు నాకు అతి ప్రీతికరమైనది. కాబట్టి కొన్ని పుష్పాలను తల్లికి సమర్పించాను. ఆమె భక్తులకివి ఇష్టమైనాయి. మాత వాటిని స్వీకరించింది అది నాకు మరెన్నో పుష్పాలు ఆమెకు అర్పించటానికి ధైర్యాన్ని సమకూర్చింది". మాతృ భూమి మీద సుబ్రహ్మణ్యభారతికి గల ప్రేమ అతని ప్రతిపలుకులోను, పంక్తిలోను కన్పిస్తుంది. అతడు ఆంధ్రలో పర్యటిస్తున్న విపినచంద్ర పాల్‌ను మొదటిసారిగా మద్రాసు రమ్మని సవినయంగా ఆహ్వానించాడు.

సురేంద్రనాథ ఆర్యా మద్రాసులో ప్రముఖ స్వదేశ కార్యకర్త. జనజాగరణకొరకు అతడు మార్కెట్ సమీపంలోనే సభలను ఏర్పాటు చేసేవాడు. ఒడ్డున విరుచుకుపడే సముద్రపుకెరటాల మహోన్నతధ్వనితో అక్కడచేరిన సభాసదులు చేసే వందేమాతరం నినాదాలు పోటీపడేవి. 1908 జూలైలో లోకమాన్య తిలక్‌ని బంధించి జైల్లో ఉంచినప్పుడు దేశవ్యాప్తంగా తీవ్రమైన నిరసన తరంగంలా లేచింది. మద్రాసులోకూడా సురేంద్రనాథ ఆర్యా, అతని అతివాదమిత్రులు నిరసనసభలు ఏర్పాటు చేశారు ఆర్యా హింసను, విప్లవాన్ని పురికొల్పే ప్రసంగం చేసినట్లు వార్తా పత్రికలు ప్రచురించాయి.

స్వదేశీ ఉద్యమానికి మరొక కేంద్రస్థానం టుటికోరిన్. ఎన్నో ఏండ్ల నుంచి టుటికోరిన్ కొలంబోకు మధ్య పొగ ఓడలు నడపబడుతూండేవి. వాటి యాజమాన్యం వహిస్తున్న బ్రిటిష్ ఇండియా స్టీం నావిగేషన్ కంపెనీ విపరీత మైన రేట్లను విధించి ప్రజలనుంచి వసూలుచేసేది. దీనినెవరూ అరికట్టలేక

పోయారు. అమాయక భారతీయులను దోచుకొంటూ వారు తమగల్లాపెట్టెలు నింపుకొనేవారు. బెంగాల్‌లో వందేమాతరం ఉద్భవంతో బంగాళాఖాతం అలలు నూత్న సందేశాన్ని మద్రాసుకు చేరవేశాయి, తత్ఫలితంగా అగష్టు 1906న బ్రిటిష్ కంపెనీకి వ్యతిరేకంగా స్వదేశీ స్టీం నావిగేషన్ కంపెనీ వెలసి తననౌకలను ప్రవేశపెట్టింది, అసూయాద్వేషాలతో స్వదేశీకంపెనీ నాశనం చేయటానికి ప్రయత్నాలు జరిగాయి, చివరికి బ్రిటిష్ కంపెనీ తనరేట్లను తగ్గించుకున్నప్పటికీ అన్నిచోట్ల పనిచేసిన ఆమంత్రం స్వదేశీ అభిమానం ముందువీగిపోయింది, ఈఘనకార్యం సాధించిన చిదంబరంపిళ్ళె, సుబ్రహ్మణ్యశివ – ఇద్దరూ అతివాద రాజకీయవేత్తలు. వీరు, బ్రిటిష్‌వారి ఆధిపత్యంలో ఉన్న ఫ్యాక్టరీ కార్మికుల సభలలో ఎన్నోప్రసంగాలుచేశారు. వారి తీవ్రమైన స్వదేశీఉద్యమ ప్రచారంవల్ల తిర్నవేల్లి, టుటికోరిన్‌ల నడుమనున్నపరిస్థితి ఫిబ్రవరి 1908 నాటికి ఉధృతమైంది. ఈప్రదేశాలలో ఉన్న బ్రిటిష్ యాజమాన్యపు ఫ్యాక్టరీలలోని కార్మికుల సమస్యవైపు దేశం అంతటి దృష్టి ఆకర్షితమైంది. 27-2-1908న వెయ్యిమంది పనివారు ఫ్యాక్టరీలో పనిఆపివేసి అర్ధరాత్రివరకు వందేమాతరం నినాదాలతో వీధులలో ప్రదర్శనచేశారు. ఇది తక్కిన పాశ్చాత్య కంపెనీలనీలకుకూడా వ్యాపించింది. చిదంబరంపిళ్ళె, సుబ్రహ్మణ్యశివ నిర్బంధితులయ్యారు. కాని అప్పటికి స్వదేశీఉద్యమం రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను చొచ్చుకు పోయింది. నాయకుల్ని బంధించినప్పటికీ ప్రజలు తమ ఉద్యమాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు. ప్రభుత్వం క్రూరంగావారిని అణచివేయాలని చూచింది. "వందేమాతరం" అని అరుస్తున్న 15 సంవత్సరాల బాలుణ్ణి తిర్నవేలిలో బంధించారు. బ్రిటిష్ మేజిస్ట్రేట్ కాక్స్ ఆ బాలుణ్ణి కొరడాతో కొట్టాలని ఆజ్ఞాపించాడు. ఆమాటవిన్నంతనే ప్రజలు తీవ్రంగా నిరసించారు. ఈవార్త దగ్గరగా ఉన్న పల్లెలకుకూడా ప్రాకింది బ్రిటిష్ చర్యకు ప్రతిగా వందేమాతరం నినాదాలు, నిరసన ప్రదర్శనలు 14-3-1908 నుంచి మొదలైనాయి. 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రిక ఇట్లా వ్రాసింది. "అన్ని దుకాణాలు మూయబడ్డాయి. వర్తకం ఆగిపోయింది. అందరు వ్యక్తులు తిర్నవేలికి వచ్చి ఆ నిరసన ప్రదర్శనంలో పాల్గొన్నారు. దాని ఫలితంగా

వాణిజ్యం. రవాణా స్తంభించాయి.' ఈ హర్తాళ్ విజయవంతమైంది. సుమారు నాల్గువేలమంది ప్రజలు కాలేజీ విద్యార్థులతోపాటు ప్రదర్శన జరిపారు.

బాబారావు సావర్కారుచేత చిదంబరంపిళ్ళె 'అభినవ భారత' అనే బిరుదును అందుకున్నాడు. చిదంబరంపిళ్ళె విప్లవజ్యోతిని అనేక జిల్లాలకు కొనిపోయాడు. అందువల్ల పల్లెలలో, పట్టణాలలో భారతమాత సమితులు ప్రభవించాయి. సమితి సభ్యులు "ఆనందమఠం"లోని సన్యాసినులవల్ల ఉత్తేజితులైనారు. సమితియొక్క రహస్య సమావేశాలు 1911 జనవరి జులై నెలలమధ్య తూత్తుకుడి, టెంకాసి, షెంకొట్టా, పూనలూరు, వత్రపథమ్ మొదలైన ప్రదేశాలలో జరుగుతూండేవి. ఈ సమావేశాలలో సభ్యులు కాళీమాత ప్రతిమముందు బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా పోరాడి స్వరాజ్యాన్ని సాధిస్తామని ప్రమాణంచేసేవారు. ఇదేసమయంలో కొన్ని కరపత్రాలు తిర్నవేలినుంచి అనేకప్రదేశాలకు పోస్టు చేయబడ్డాయి. వారు విప్లవసమితులలో చేరమని జనులను కోరారు. ఈ కరపత్రాలపై 'వందేమాతరం' అని సంతకాలు చేయబడ్డాయి. ముద్రాపకులపేరు "ఫరంగీనాశనీ ప్రెస్, మద్రాసు" అని వాటిమీద ఉండేది. ఆ సమయంలో తిర్నవేలి జిల్లా కలెక్టరుగా ఉన్న విలియం డి ఎస్కార్ట్ ఏష్ స్వదేశీ నావిగేషన్ కంపెనీని నాశనంచేసి చాలామంది దేశభక్తులకు కఠినశిక్షలు విధించాడు. డిసెంబర్ 1910న అతనికి అతివాదులు "భారతమాత సంఘసభ్యులమైన మేము ప్రజాసంబంధాల విషయంలో జోక్యం చేసుకోవద్దని మిమ్మల్ని హెచ్చరిస్తున్నాం. మీరు మూర్ఖంగా ప్రవర్తిస్తే మీ తలనే కోల్పోవలసి ఉంటుంది." అని హెచ్చరిక పంపారు. ఏష్ ఆ హెచ్చరికను నిర్లక్ష్యంచేసి యథాపూర్వంగానే క్రూరంగాప్రవర్తింపసాగాడు. అతనిపని పట్టటానికి వాంచీ అయ్యర్ పూనుకున్నాడు. 17-6-1911న వాంచీ అయ్యర్ ఒకే పిస్టల్‌గుండుతో ఏష్‌ని అంతంచేసి తననుకూడా కాల్చుకున్నాడు. వాంచీ తన తుదివలుకులతో ఇట్లాఅన్నాడు – "శ్రీరాముడు,

మాత్రం మానలేదు. పంచనదుల గలగలధ్వనులతో వందేమాతర ధ్వని కూడా అందంగా అతికిపోయింది.

మహారాష్ట్రానికి బెంగాల్‌కుమధ్య వారధి తిలక్. అతని 'కేసరి' పత్రిక బెంగాల్‌ను వెన్నుతట్టి దాని స్వాతంత్ర్య సమరానికి ఉత్తేజననిచ్చింది, అతడు స్వదేశీ ఉద్యమాన్ని పశ్చిమతీరానకూడా వ్యాప్తిపరిచాడు. స్వదేశీ ఉద్యమం, వందేమాతరం – ఈ రెండూ సమానమైన ప్రాధాన్యముగలవన్న సంగతి తిలక్ మహాశయునకు బాగాతెలుసు. వందేమాతరం యొక్క కార్య రూపమే స్వదేశీ, వందేమాతర ప్రభావం బొంబాయి రాష్ట్రమంతటా కార్చిచ్చులా వ్యాపించింది, పూనానుంచి ప్రచురింపబడే వందేమాతరం వార్తా పత్రిక ప్రజలలో స్వాతంత్ర్య భావాన్ని మరింత ఉధృతం చేసింది. యువకులకు అది ఈవిధంగా సందేశమిచ్చింది. 'నిజమైన వీరలక్షణం న్యాయంకోసం, స్వాతంత్ర్యంకోసం జరిపే ఆత్మత్యాగంలోనే ఉంటుంది.'

వందేమాతరం ఆంగ్లేయుల గుండెల్లో రైళ్ళు పరువెత్తించింది. వందేమాతర నినాదంచేసినా, గేయంపాడినా ప్రభుత్వం తీవ్రంగా శిక్షించేది. ప్రభుత్వ విధానం భీతావహమైన వాతావరణాన్ని సృష్టించినట్లనిపించి నప్పటికి యువజనులు ధైర్యంగా ప్రభుత్వాన్ని ఎదిరించి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల విలువను పెంచారు. చేతిలో భగవద్గీతని పెదవిపై వందేమాతరాన్ని నిలిపి ఉరికంబానికెక్కిన దేశభక్తులనుచూచి సమస్తదేశం పులకించింది. మహారాష్ట్ర యువజనులుకూడా తక్కువ తినలేదు. వారు మొదటిసారిగా తిలక్, సావర్కర్ అతని అనుచరుల మార్గదర్శకత్వంక్రింద విదేశవస్త్రాలను దహనం చేశారు. తరువాత బాబారావు సావర్కర్ ఆవిప్లవాగ్నిని ప్రతి గ్రామానికి నగరానికితీసుకువెళ్ళాడు. ఆ కాలపుచరిత్ర ధైర్యంతో వీరత్వంతో నిండిఉండేది. ఉదాహరణకు నీల్ సిటీ స్కూలు సంఘటన చూడండి, నాగపూర్‌లోని నీల్‌సిటీస్కూలు విద్యార్థులు ప్రభుత్వ నిషేధపుటుత్తరువును నిరాకరించి రాజకీయ సమావేశాలు జరుపుతూ జాతీయగీతాలాపన చేస్తూఉండేవారు. ఒకసారి ఒక ఇన్స్‌పెక్టర్ స్కూలు ప్రిన్సిపాలుతోకలిసి విద్యార్థులను

పరిశీలించటానికి వచ్చాడు. వారిద్దరూ మొదటి క్లాసురూములోనికి రాగానే విద్యార్థులు వందేమాతరం నినాదాలు చేశారు. ఆ శబ్దాలకు భూమ్యాకాశాలు ప్రతిధ్వనించాయి. నిశ్చేష్టుడైన ఇన్స్పెక్టర్ మరొక క్లాసుకు వెళ్ళాడు. అక్కడా ఇలాగే జరిగింది. ఈవిధంగా ప్రతితరగతిలోనూ విద్యార్థులు ఐక్య కంఠంతో వందేమాతర నినాదాలువిన్పించారు. చివరికిముందుగా వందేమాతరం అన్నవిద్యార్థి ఎవరో తెలిసికోవాలనుకొన్న ఇన్స్పెక్టర్ అభిమతం ఫలించలేదు. చేసేదిలేక మొదటి రెండు క్లాసుల విద్యార్థులను పాఠశాలనించి తొలగించటం జరిగింది. వారు వీరపురుషులుగా తమ క్లాసునుంచి 'వందేమాతరం' అని అరుస్తూ బయటకు వెళ్ళిపోయారు. రెండునెలల తరువాత ప్రిన్సిపాల్ సుముఖుడై వారినందరినీ తిరిగి స్కూల్లో చేర్చు కున్నారు. తరగతులు ప్రారంభమయాయి. కాని వారి నాయకుడు అక్కడ లేడు.



ఆ నాయకుడే కేశవరావ్ బలిరామ్ హెడ్గెవార్. హెడ్గెవార్ అప్పుడు 19 సంవత్స రాల చిన్నవాడు. కండలుతిరిగి పొడవైన దేహంతో తళతళలాడే కళ్ళతో, చెదరని పట్టు దలను సూచించే వదనంతో ఉండే హెడ్గెవార్ నీల్ సిటీస్కూల్లో మొదటగా వందేమాతరం అన్నబాలుడు, పైగా విద్యార్థి నాయకుడు. 1907 లో హెడ్గెవార్ రంపయాళికి వెళ్ళాడు. అక్కడ ఆరోజు విజయదశమి సందర్భంగా రావణవధ ప్రదర్శింపబడుతోంది. ఊరేగింపు నిర్ణీతస్థలానికి చేరగానే హెడ్గెవార్ బిగ్గరగా "వందేమాతరం" అంటూ లంఘించాడు అంతకుముందు అనుకున్నవిధంగా ఎందరో యువ కులు వందేమాతర నినాదాలతో దూసుకువచ్చారు. ప్రజలు వెనుకకు వెళ్ళారు. హెడ్గెవార్, దబీర్, బొగార్ వందేమాతరం గానంచేశారు.
(Rashtradrashta Hedgewar, by B. V. Deshpande.)

యువకుడైన హెడ్గెవార్ కలకత్తాలోని నేషనల్ మెడికల్ కాలేజీలో చేరి చదువసాగాడు. డాక్టర్ డిగ్రీ పొందినతరువాత జన్మభూమికోసం తన జీవితాన్ని అంకితంచేయాలని నిర్ణయించుకున్నాడు. "రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ" నిర్మాత ఈ మహనీయుడే.

1908 లో లోకమాన్య తిలక్‌ని ప్రభుత్వం బంధించినప్పుడు దేశ వ్యాప్తంగా నిరసనలు, ప్రదర్శనలు జరిగాయి. ముఖ్యంగా బొంబాయి నమ్మెలో మునిగిపోయింది. జూన్ 29న పోలీసులతో ఘర్షణకూడా జరిగింది. కోర్టులో తిలక్‌ని విచారించేటప్పుడు వేలకొలది ప్రజలతో హాలంతా నిండిపోయింది. "తిలక్ మహారాజ్‌కీ జై" నినాదాలు, వందే మాతరం గానం కోర్టు ఆవరణ అంతటా ప్రతిధ్వనించాయి. తిలక్‌కి 6 సంవత్సరాలు దేశనిర్వాసశిక్ష విధించారు. బర్మాలోని మాండలే జైలుకు ఆయనను తరలించారు. దేశమంతటా గణపతి ఉత్సవాలు జరిగే సమయం అది. తిలక్ అభిమానులందరూ ఎక్కడెక్కడ గణపతి ప్రతిమ అలంక రింపబడ్డాయో అక్కడక్కడ ఆయాప్రతిమలవెనుక దాగుకొన్నారు. ఇంకే ముంది – గణపతి విగ్రహాలలోనుంచి భారతమాతాకీ జై అన్న జయజయ ధ్వానాలు విన్పించసాగాయి. పోలీసులు ఆగ్రహోదగ్రులై కొన్ని నిషేధపు ఆజ్ఞలను ప్రకటించారు. "వందేమాతరం" అనికాని "తిలక్ మహారాజ్‌కీ జై" అనికాని "శివాజీ మహరాజ్‌కీ జై" అనికాని ఎక్కడా వినపడ కూడదు. కాని ఈ నిబంధనలు మొరట లేనందున ప్రజలు వాటిని పాటించ లేదు. చట్టాన్ని పాటించలేదన్న నెపంతో ఆ నినాదాలు చేసిన ఎందరో బాలబాలికలపై, యువతీయువకులపై పోలీసులు లాఠీచార్జీ చేశారు. పది హేడు మందిని నిర్బంధించారు. తిలక్ మాటల్లో చెప్పాలంటే "నేను జైలుకు వెళ్ళినప్పుడు దేశం అంతా వందేమాతరం అన్న మహారవంతో ఒక్కుమ్మడిగా మేల్కొన్నది; స్వరాజ్యకాంక్షతో మేల్కొన్నది. ఈకాంక్ష అణగారిపోయిన జనులమంచి ఉద్భవించిన కొత్త వెలుగు".

వందేమాతరం జాతి జీవనాడితోపాటు చలించసాగింది. విడుదల పొందిన వెంటనే తిలక్ ప్రజల మనస్థితి ఎట్లాగుందో తెలిసికోవాలని ఆదుర్దా పడ్డాడు, "నేను జైలునుంచి రాగానే ప్రజల నినాదం విన్పిస్తుందేమోనని చూచాను. కానినిశ్శబ్దమే నాకుఎదురైంది. ఒకవిధమైన అయోమయావస్థలో ఆశ-నిరాశల మధ్యనున్న ప్రజానీకం నాకు కన్పించింది." తిలక్ తిరిగి ప్రజలను వందేమాతరం అనే మహామంత్రంవైపు మరల్చవలెననుకున్నాడు. బలవత్తరమైన బ్రిటిష్ సామ్రాజ్యాన్ని ఎదుర్కొనగల శక్తి ఆ మంత్రం ద్వారా మాత్రమే ప్రాప్తమవుతుందన్న సంగతి తిలక్‌కు తెలుసు. ('The Legacy of Lokamanya' P. 186)

తిలక్ దర్శనమాత్రంచేతనే ప్రజలు వందేమాతరాన్ని జ్ఞాపకంతెచ్చుకున్నారు. 17-6-1914న తిలక్ ఇంటికి చేరుకున్నాడు. 21వ తేదీన ఆయనకు పూనాలో ఘనమైనప్రజాస్వాగతం ఏర్పాటుచేయబడింది. ఆయన ఉపన్యాసం కాగానే 'తిలక్ మహారాజ్‌కీ జై' 'వందేమాతరం' అన్న కేకలు మిన్నుముట్టాయి.

విజేతవలె తిలక్ తిరిగి కాంగ్రెస్‌లో చేరాడు. సంవత్సర సమావేశం 1916వ లక్నోలో జరిగింది. రెండువందలమంది సహచరులతో బొంబాయి నుంచి లక్నోకు ప్రయాణం చేస్తున్న తిలక్, ప్రజలచేత రాజమర్యాదలను పొందాడు ఆయన ఆగమనంతో కాంగ్రెస్ పందిరి కళకళ లాడింది.

హైదరాబాదుకుకూడా వందేమాతరం పిలుపు అందింది. ఛాదర్ ఘట్‌లోని ఒక తాలింఖానా స్వదేశీ ఉద్యమానికి కార్యస్థానం అయింది. ఇక్కడ అఘోరనాథ్ సభలను ఏర్పాటుచేసేవాడు. బెంగాల్‌నుంచి విప్లవ కారులు తమ కార్యకలాపాలనిమిత్తం తరచు హైదరాబాద్ వస్తూండేవారు. ఎన్నో వ్యాసాలు తిలక్, బిపినచంద్రపాల్‌ల ఛాయాచిత్రాలతో ప్రచురితమైనాయి. స్వదేశీఉద్యమాన్ని గూర్చిన కరపత్రాలు, ఫొటోలు హైదరాబాద్‌కు దిగుమతి అయేవి. "స్వదేశీ ఉపయోగించండి" అన్నది నినాదం

గాను, "వందేమాతరం" అన్నది జాతీయగీతంగాను మారాయి. కాల క్రమేణా జాతీయోద్యమం పెంపొందసాగింది. (Sarojini Naidu, by Padmini Sen Gupta, P. 17)

ఆపై స్వదేశీ ఉద్యమం చాలావరకు పూనానుంచి కర్ణాటకకు వ్యాపించింది. ఆరోజుల్లో ఎంతోమంది విద్యార్థులు కర్ణాటకనుంచి పూనావెళ్ళి చదువుకుని తిరిగి వచ్చేటప్పుడు స్వదేశీ సందేశాన్ని తీసుకువచ్చేవారు. ఉత్తర కర్ణాటక విద్యార్థులు "ఆర్యబాలసభను" స్థాపించారు. 1906-07 లలో కొందరు దేశసేవకులు తిలక్ యొక్క "కేసరి" పత్రిక ప్రతులను సంపాదించి అందులోని విషయాలను కన్నడీకరించి ప్రజలకు పంచిపెట్టే వారు. కర్ణాటకలో సుప్రసిద్ధ దేశభక్తుడైన దేశపాండె గంగాధరరావు తన స్వీయచరిత్రలో తాను మొదట తిలక్ ఉద్యమాన్ని విశ్వసించలేదని తరువాత కేసరి పత్రిక ప్రభావంవల్ల గాఢంగా తిలక్ ఆశయాలకు ముగ్ధుడినై నానని ఉద్యమంలో చేరానని చెప్పుకున్నాడు.

స్కూలు విద్యార్థులు వందేమాతరాన్ని పుస్తకాలమీద చక్కగా వ్రాస్తుండేవారు. ఉత్తరాలు వ్రాసేటప్పుడు శుభసూచకంగా ముందు 'వందే మాతరం' అని వ్రాసి ఉత్తరం ప్రారంభించేవారు. 12-9-1908న "కర్ణాటక వైభవ" అనే పత్రిక "వందేమాతరం" శీర్షికతో ఒక బాలుడు "నేనిక ఏమాత్రం ఈ పరప్రభువుల పాలనక్రింద హిందూదేశం పడుతున్న పాట్లు చూచి సహించజాలను" అని తండ్రికి వ్రాసిన లేఖను ప్రచురించింది. ఆ బాలుడే తరువాత కర్మయోగి హనుమంతరావుగా రూపొందాడు. "భారతీయ దేశభక్తి" అన్న తన గ్రంథాన్ని ముగిస్తూ హర్డెకర్ మంజప్ప వందేమాతరం అని మూడుసార్లు ఉల్లేఖించాడు.

చారిత్రకంగా చెప్పాలంటే స్వదేశీ ఉద్యమంకంటె ముందుగానే "వందేమాతరం' కర్ణాటకకు పరిచయమైంది. బి. వెంకటాచార్య బంకిం ప్రసిద్ధనవలలను ఎన్నింటినో కన్నడీకరించాడు. ప్రొఫెసర్ జి.ఎస్. హాలప్ప కూడా వందేమాతర లక్ష్యాన్ని వేనోళ్ళ కొనియాడాడు.

1937 లో కొందరు విజాతీయులు వందేమాతరం శాసన సభలలో పాడటానికి, కాంగ్రెస్ వేదికలమీద పాడపాటానికి అభ్యంతరం తెల్పుతూ ఒక సవరణను కర్ణాటక రాష్ట్ర కాంగ్రెస్ కమిటి ముందుంచారు. అయితే సభ్యులందరూ యోచించి ఈ విధంగా సిద్ధాంతీకరించారు. – 'వందేమాతరం మాతృభూమియొక్క పవిత్ర ప్రార్థన కర్ణాట రాష్ట్ర కాంగ్రెస్ కమిటి వందేమాతరం మాత్రమే జాతీయగీతంగా ఉండగల యోగ్యత కలిగిందని అఖిలభారత కాంగ్రెస్ కమిటీకి సిఫార్సు చేస్తోంది, "వందేమాతరం విషయంలో కర్ణాటకులకున్న అశేషమైన ఆదరాభిమానాలు ఇందువల్ల మనకు వ్యక్తమౌతున్నాయి, సుప్రసిద్ధ కన్నడకవులైన కె. వి. పుట్టప్ప, బేంద్రే మున్నగువారు వందేమాతరాన్ని ఎంతో ప్రశంసించారు. జి. పి. రాజరత్నం అనే ఆయన "కేవలం వందేమాతరం నినాదమేకాక ఆ గేయంమొత్తం మననాల్కలమీద మన పిల్లలనాల్కలమీద తాండవించాలి. అది మనకు గాయత్రీ మంత్రం' అన్నాడు (Vichara Taramga, P. 68)

అన్ని మంత్రాలు, సూక్తులు కొద్దిమాటలలో పొందికగా చెప్పబడినట్టివే. వందేమాతరంలో మాతృ లక్షణాలు (దేవీ లక్షణాలు) మాత్రమే స్పష్టంగా నిరూపింపబడినప్పటికీ స్వాతంత్ర్య పోరాటం, స్వదేశీ ఉద్యమం విప్లవ స్వభావం, జాతీయ సమైక్యత మొదలైనవికూడా దానిలోనే ఇమిడి ఉన్నాయి. జాతీయ గీతమైన 'వందేమాతరా'నికి కొందరు బ్రిటిష్ సైన్యాధిపతులుకూడా లేచినిలబడి గౌరవం తెలిపారని సురేంద్రనాధబెనర్జి వ్రాశాడు. 63 రోజులు నిరాహారదీక్షజరిపి 13 సెప్టెంబర్ 1929లో ఆత్మాహుతి గావించుకున్న జతీన్‌దాస్ వందేమాతరం తనని కేవలం బెంగాలీయునిగాకాక భారతీయునిగా మలచిందని చెప్పాడు. ఖుల్నాకు చెందిన పదహారేండ్లబాలుడు ఇందుభూషణరాయ్ "వందేమాతరం" వలన "ఆనందమఠం" వలన ప్రభావితుడై తన జీవితాన్ని దేశమాతకు పూజా పుష్పంగా సమర్పించాడు. ఈ విధంగా అసంఖ్యాకమైన దేశభక్తుల త్యాగాలు స్వాతంత్ర్యతటిల్లతలను దేశంనాల్గుమూలలా వెల్లివిరిసేలా చేశాయి.

నమస్కారానికి కృతజ్ఞతా నివేదనానికికూడా పర్యాయంగా "వందేమాతరం" స్వీకరింపబడింది. సుప్రసిద్ధ వక్త శ్రీ శ్రీనివాసశాస్త్రి నూతన శకానికి చిహ్నమైంది 'వందేమాతరం' అన్నారు.

వందేమాతరం నినాదం లేకుండా ఒక్క బహిరంగసభకూడా ఆరోజుల్లో జరిగేది కాదు. 1938 లో సుభాస్‌చంద్రబోస్ హరిపూర్ కాంగ్రెస్ సమావేశానికి వందేమాతర నినాదాలమధ్య అధ్యక్షత వహించాడు; బాబూ రాజేంద్రప్రసాద్ తరువాతి కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడ్డాడు. అప్పుడుకూడా వందేమాతర నినాదాలు ఉప్పతిల్లాయి. ఇట్టి సంఘటనలు కోకొల్లలు.

1899 లో వినాయకదామోదర్ సావర్కర్ "మిత్రమేలా" అనే రహస్యసంఘాన్ని స్థాపించాడు. 1904 లో దానికి "అభినవభారత"మని పేరు మార్చబడింది. ఈ సంఘసభ్యులే నాసిక్‌జిల్లా కలెక్టర్ అయిన జాక్సన్‌ను 21-12-1909 న హతమార్చారు. ఈ సంఘం రహస్యంగా "వందేమాతరం" అన్నపేరుతో ఒక చిన్న పత్రికను ప్రచురించింది. ఆ పత్రిక ప్రతులు కొన్ని 24-12-1910 న సావర్కర్ విచారణ సందర్భంలో కోర్టువారికి సమర్పింపబడ్డాయి.



# 10. విశ్వవ్యాప్తి

"వందేమాతరం" విదేశాలకుకూడా పయనించింది.

అరవిందుడు యీ పాటను ఆంగ్లంలోకి అనువాదంచేసి ప్రపంచం లోని ఇతర అణగద్రొక్కబడ్డ జాతులకు దీనినొక స్వాతంత్ర్య మంత్రంగా కానుకపెట్టాడు.

ఈ "వందేమాతరం" సర్వత్రా ఒక విప్లవచిహ్నం అయింది. ఇంగ్లాండులోని భారతీయుల పెదవులపై కూడ నాట్యం చేయసాగింది. విప్లవ సందేశ ప్రవక్తలైన "సావర్కారు, హరదయాళ" "ఇంగ్లాండు లోని భారతీయులమధ్య ఒక ఉత్సాహపూరితమైన వాతావరణాన్ని సృష్టించారు. ఇంగ్లండులోని "ఇండియాహౌస్" విప్లవ కార్యకలాపాలకు కేంద్రం అయింది. వందేమాతరం గీతాలాపనలు లండన్ నగరంలో మార్మోగుతూ బ్రిటిషు ప్రభుత్వానికి వేదన కలిగించాయి". (Armed struggle for freedom Page 197.

1857 భారత స్వాతంత్ర్య సంగ్రామ స్వర్ణోత్సవం "ఇండియా హౌస్"లో 10-5-1908 న జరిగింది. ఆ ఉత్సవపు ఆహ్వానపత్రికలు

'వందేమాతరం' శీర్షికతో వెలువడ్డాయి. ఆ 'భారతీయ భవనం' రంగు రంగుల చాందినీలతో మనోహరంగా అలంకరింపబడింది. భవనం లోపల 1857 విప్లవవీరుల చిత్రపటాలు అలంకరింపబడ్డాయి. పూలతో సుగంధ ధూపాలతో పవిత్ర మాతృదేశ వాతావరణం అక్కడ ప్రత్యక్షమైంది. ఈ ఏర్పాట్లకు స్ఫూర్తిదాత చైతన్యమూర్తి అయిన 'సావర్కార్' ఆసందర్భంలో యిలా అన్నారు. "ఈ ఉత్సవం మధుర సంగీత వాద్య సమ్మేళనంతో దేశభక్తవర్మ పాడిన స్ఫూర్తిదాయమైన జాతీయగీతంతో ప్రారంభమైంది. 'వందేమాతరం' నినాదాలు ఈ భవనపు గోడలను దూసుకుపోయి వీధులలో గర్జిస్తున్నాయి". ఉత్సవం ముగిసే సమయంలో అనేకమంది యువకులు ముందుకువచ్చి భారత స్వాతంత్ర్య సాధనకు తమనుతాము అంకితం చేసుకుంటూ దీక్ష తీసుకున్నారు.

1857 స్వాతంత్ర్య సంగ్రామపు స్మృతి చిహ్నంగా భారతీయ యువకులు వందేమాతరం బ్యాడ్జీలను ధరించి సగర్వంగా లండన్ వీధులలో సంచరించారు. కళాశాల ప్రధానాచార్యులు ఈ బాడ్జీలను కళాశాలలో ధరించ రాదని ఆజ్ఞాపించారు. కాని ఆత్మగౌరవంగల భారతీయ విద్యార్థులు ఆ ఆజ్ఞలను లెక్కచేయలేదు. భారతీయవిద్యార్థుల యీ యితర సంస్కారంతో కలతచెందిన ఒక కళాశాల ప్రిన్సిపాల్ భారతస్వాతంత్రవీరులను నీచమైన భాషలో నిందించాడు. ఇది భారతీయవిద్యార్థులకు సహింపరానిదైంది. ఈ సంఘటనలతో వారిలో దేశభక్తి తీవ్రమైంది. కళాశాలలు బహిష్కరించబడ్డాయి నాటి ప్రముఖ విద్యార్థి నాయకులలో 'హర్‌నామ్ సింగ్-ఖాన్'లు కూడా ఉన్నారు.

'హర్‌నామ్‌సింగ్' 'నాభా' సంస్థానానికి చెందినవాడు. అతనికి నెలకి రు 250/- ఉపకారవేతనం లభిస్తుండేది. అతడు 'సిరెన్సెస్టర్' వ్యవసాయ విశ్వవిద్యాలయాన్ని బహిష్కరించటంతో ఆ ఉపకార వేతనం నిల్పివేయబడింది. అతడు చేసిన నేరమల్లా "1857 మృతవీరుల స్మారకారం"

అనే మాటలుగల బ్యాడ్జిని దానిమీద 'వందేమాతరం' జండాను ధరించటమే. అతనికి సావర్కరే స్వయంగా యీ బ్యాడ్జిని యిచ్చాడు.

"మదనలాల్ డీంగ్రా" గూడా యీ బ్యాడ్జితో కాలేజీకి వెళ్ళాడు. ఉపాధ్యాయుడు-తోటి విద్యార్థులుకూడ అతడిని ఆ బ్యాడ్జి తీసివేయమని వత్తిడిచేశారుగాని అతడు దానికి లొంగలేదు. దానితో గందరగోళం ప్రారంభమయి కొందరు విద్యార్థులు వెకిలిచేష్టలతో ఇతనిని పీడించ నారంభించారు. అంతటితో 'డీంగ్రా' అందరికంటే ఎక్కువగా వెకిలివేషాలు వేస్తున్న విద్యార్థిపైకి దూకి వాడిగొంతు పట్టుకొని ఒక 'చాకు' దూసి ఝళిపిస్తూ "జాగ్రత్త - నీగొంతు కోస్తా" అన్నాడు. దాంతో అంతటా నిశ్శబ్దం ఆవరించింది. అది మొదలుకొని అతన్ని తాకటానికికూడా ఎవ్వరూ సాహసించలేదు.

భారతదేశంలో అరవిందుని వందేమాతరం పత్రికను అణచి వేయడంతో 'మేడమ్‌కామా' - మరికొందరు భారత విప్లవకారులు 'పారిస్' నగరంలో అదేపేరుతో ఒక పత్రికను ప్రారంభించారు. బ్రిటిష్ వారు అంతమొందించగోరుతున్న ఆ వందేమాతరం రాక్షసుడు అంతకు ముందు ఆరువేలమైళ్ళ దూరంలో ఉంటే ఇప్పుడు వాళ్ళ తలుపుదగ్గరే నిలిచాడు. యూరపులోని విప్లవకారులందరితోనూ సంబంధాలున్న 'వీరేంద్రనాధ్ ఛటోపాధ్యాయ"డు అదేసమయంలో పారిస్‌కు వచ్చాడు. "అతడు 1908 లో ఐర్లండుకు వెళ్ళి 1909 లో భారతదేశ శ్రేయస్సు కోసం కృషిచేస్తున్న 'మేడమ్ కామా' యొక్క 'వందేమాతరం' సంఘంలో చేరడానికి పారిస్‌కు వచ్చాడు". (The Role of Honour Page 343.)

"తిలక్ అండ్ ది స్ట్రగుల్ ఫర్ ఇండియన్ ఫ్రీడం" అనే గ్రంథంలో 316వ పుటలో యిలా వ్రాయబడింది. "పారిస్‌లోని భారతీయ దేశభక్తులు ఒక మాసపత్రికను ప్రచురించటానికి పూనుకున్నారు. వారు వలసరాజ్య పరిపాలకులచే నిషేధింపబడ్డ అభ్యుదయ బెంగాలీ వారపత్రిక

'వందేమాతరం' పేరునే పెట్టారు. దాని మొదటి సంచికలో యిలా ఉంది. 'విదేశీయుల అక్రమమూ క్రూరమూ అయిన విధానాలకు వ్యతిరేకంగా బెంగాల్‌లోని ధీరులు వివేకవంతులు అయిన నాయకులు 'వందేమాతరం' ద్వారా ప్రారంభించిన మహోద్యమం అంత శక్తివంతంగాను పటిష్టంగాను మేం కొనసాగిస్తాం".

యూరపుఖండంలోని దూరతీరాలకు వ్యాపించిన 'వందేమాతరం' అమెరికా ఖండంలోకికూడ జొరబడ్డది. 'గదర్' ఉద్యమ సభ్యులు కెనడాలోని భారతీయులు కలుసుకున్నప్పుడు 'వందేమాతరం' అని పరస్పరం అభివాదం చేసుకొనే క్రొత్తపద్ధతి ఏర్పడింది. ఈ 'వందేమాతరం' అనే అభివాదం సన్నిహితత్వానికి, నైతికతకు, దేశభక్తికీ చిహ్నమయింది.

1914 లో విదేశాల్లోని భారతీయులు ((Comagathamaru) 'బడ్జ్ బడ్జ్' వద్ద బ్రిటిష్ సైనికులచే పాశవికంగా వధింపబడ్డారు. వారి నాయకుడైన 'గురుదత్తసింగ్' తప్పించుకొని ప్రచ్ఛన్నంగా నివసించసాగాడు. ఆరేళ్ళ తర్వాత 19-4-1920 న ఆయన తన నిజరూపాన్ని వెల్లడించుకోడానికి 'రాజభూజదత్తచౌధరి'ని కలుసుకోడానికి వెళ్ళినప్పుడు ఆయన హృదయంలోని భావావేశం పొంగి పొర్లి చౌధరిని చూడడంతోనే అప్రయత్నంగా 'వందేమాతరం' అని కేకవేశాడు. ఆవిధంగా యీ 'వందేమాతరం' భారతీయ దేశభక్తుల రక్తనాళాల్లో లీనమై ప్రవహించింది.

ఈ 'వందేమాతరం' తోనూ 'ఆనందమఠం తోనూ స్ఫూర్తిపొంది గదర్ ఉద్యమ పత్రిక 'గదర్' ఒకప్రకటనను ప్రచురించింది. ఆ ప్రకటన మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

హిందుస్థాన్‌లోని గదర్‌ఉద్యమమునకు ఉత్సాహవంతులు వీరులు అయిన సైనికులు కావలెను.

జీతం - మృత్యువు

బహుమానం - వీరమరణము.

పెన్షను - స్వాతంత్రము.

కార్యక్షేత్రము - హిందుస్థాన్

"సాన్ ఫ్రాన్సిస్కో" లోని భారతీయ దేశభక్తులు "భారతమాత సంఘము" అనే ఒక సంస్థను స్థాపించారు. దాని రహస్య పత్రిక "వందే మాతరం ఖాల్సా". ఆ పత్రికలలో ఒకదానియందు 'నాందీ'గా యీపద్యంవుంది.

## వందేమాతరం ఖాల్సా

"ఎవని మది బానిసత్వము నేవగించి
అగ్నితురగపు స్వారిచే న్యాయసమర
మందు హింసను హింసించి ఆర్తరక్ష
ధీరమగు 'ఖాల్సా' నొక్కనే వీరుడంౘు"

అందులో ఇంకా ఇలావుంది. ఈ ఖాల్సాను గురుదేవుడు భారతమాత చేతి ఖడ్గంగా సృజించాడు. ఇప్పుడు హిమాలయాలనుండి కన్యాకుమారివరకూ గల ఆమె యావద్దేశమూ మరణిస్తున్నది. ఆమె జీవరక్తం పీల్చివేయబడు తున్నది. గురుదేవుడు ధర్మరక్షణకు ఇచ్చినఖడ్గం ఏనాటికి ఆత్మద్రోహాన్ని ఇచ్ఛగించదు. అందుచేత ఓ ఖాల్సా - లే....మనకు పతనంలేదు. సత్-శ్రీ అకాల్ !"

సాన్ఫ్రాన్సిస్కో లోని (oklond) ఆక్లండ్ నుండి వెలువడ్డ రహస్య కరపత్రాలు భారత దేశానికి చాటుగా చేరవేయబడ్డాయి.

'వందేమాతరం' నినాదం భారతీయులు ప్రపంచంలో ఎక్కడ నివసిస్తుంటే అక్కడికల్లా చొచ్చుకపోయింది. ఐరోపా, అమెరికాలలోవలెనే

ఆఫ్రికాలోని ప్రజలకుకూడా భారతీయుల నినాదం ప్రియతరమైంది. 1912లో 'గోపాలకృష్ణగోఖలే' ఇంగ్లండులో ఉన్నాడు. ఆయన స్వదేశానికి తిరిగి పోయేటప్పుడు ఆఫ్రికాకు రావలసిందిగా ఆయనకొక పిలుపు వచ్చింది. అక్టోబరు 22న ఆయన 'కేప్‌టౌన్' చేరుకున్నాడు. వందలాది భారతీయులు ఆయనకు కృతజ్ఞతతోను ప్రేమతోనూ స్వాగతం పలికారు. ఎడ్లబండ్లతో ఆయనను ఊరేగించారు. ప్రతిచోటా ఆయనను 'వందేమాతరం' నినాదాలతోనే అభినందించారు. ఆయన 'జోహాన్స్‌బర్గ్' 'నేటాల్' 'ప్రెటోరియా' మొదలైన పట్టణాలనుకూడ సందర్శించాడు. అన్నిచోట్లా ఆయనకు 'వందేమాతరం' నినాదాలతోనే స్వాగతమివ్వబడింది.



# అశనిపాతం

సుప్రసిద్ధ సంగీత విద్వాసుడైన పండిత విష్ణుదిగంబర్ పాలస్కార్ గాంధర్వ మహావిద్యాలయన్ని స్థాపించాడు. ఆయన మహాగాయకుడేగాక గొప్ప దేశభక్తుడు. బహిరంగసభలలోను ఉత్సవాలలోనూ జాతీయగీతాన్ని పాడటమనే సంప్రదాయాన్ని నెలకొల్పిన వాడాయనే, స్వదేశ ఉద్యమపు తొలిదినాలలో ఆయన 'వందేమాతరం' గీతాన్ని పాడటమనే సంప్రదాయాన్ని దేశంలోని వివిధభాగాలకు వ్యాపింపచేశాడు. గాయకులు జాతీయ భావ విరుద్ధమైన పాటలు పాడరాదని ఆయన అభిప్రాయం. ఈవిషయంలో గాయకులు భాధ్యతాయుతులై ప్రవర్తించినప్పుడే వారి ప్రతిష్ఠ పెరుగుతుందని ఆయన విశ్వాసం.

పాలస్కార్ గొప్ప పండితుడేగాక ఆకర్షణీయమైన వ్యక్తిత్వము అద్భుతమైన కంఠస్వరముకలవాడు. స్వాతంత్ర్యోద్యమ నాయకులు ఆయన నెంతోగౌరవంతో చూచేవారు. ప్రతి కాంగ్రెస్ సమావేశ ప్రారంభంలోనూ ఆయన 'వందేమాతరం' గీతం పాడాలని వారికోరిక. 1915 నుండి ఆయన ప్రతిసంవత్సరం కాంగ్రెస్ సమావేశాలకువెళ్ళి తనగానంతో ప్రతినిధుల హృదయాలను ఆకట్టేవాడు.

1923లో ఆంధ్రప్రాంతంలోని కాకినాడలో కాంగ్రెస్ సమావేశం జరిగింది. మామూలుగానే పాలస్కార్ కూడా ఆసభావేశానికి ఆహ్వానింపబడ్డాడు. ఆసంవత్సరం మౌలానా మహమ్మద్ఆలీ కాంగ్రెస్ అధ్యక్షుడు.

సంప్రదాయానుసారం విష్ణుదిగంబర్ వందేమాతరం గీతం పాడటానికి లేచినప్పుడు మౌలానాసాహెబ్ అభ్యంతరం తెలిపాడు. సంగీతం తన మతానికి నిషిద్ధమని ఆయన పేర్కొన్నాడు. అక్కడ సమావేశమైన నాయకులందరూ దిగ్భ్రాంతిచెందారు. విష్ణుదిగంబర్ ఉద్రేకంతో యిలా బదులు చెప్పాడు. "ఇది ఒక జాతీయ వేదికగాని ఏ ఒక్క ప్రత్యేకమతానికి చెందిన వేదికగాదు. గానానికి అభ్యంతరం చెప్పటానికి ఇది మసీదుకాదు. ఇక్కడ గానాన్ని నిషేధించడంలో న్యాయంలేదు. తనను మేళతాళాలతో ఊరేగించినప్పుడు గానానికి అభ్యంతరం తెలుపని అధ్యక్షుడు ఇప్పుడు ఇక్కడ గానానికి అభ్యంతరం ఎందుకుచెప్పాలి.!" అని. అధ్యక్షునికి నోట మాటరాకుండాచేసి అతని సమాధానంకోసం వేచివుండకుండానే "వందే మాతరం" గీతాలాపనచేసి ముగించాడు. ఆయన మాతృదేశాభిమానం జాతీయాభిమానం సదస్యుల మన్ననలకూ పాత్రమైంది. Vishnudigambar Palaskar - National Book Trust, P. 54.



'యన్. సి. కేల్కర్' మరాఠీ పత్రికలో ఈ సంఘటనకు సంబంధించిన ప్రత్యక్ష కథనాన్ని వెల్లడించాడు. 1924 జనవరి మొదటివారంలో 'కేసరి' పత్రిక దానిని పునర్ముద్రించింది.

స్వదేశీ ఉద్యమపు రోజులనుండీ భారతీయులు ఎటువంటి విభేధాలూ లేకుండా ఏకకంఠంతో వందేమాతరం గీతాన్ని పాడారు. ఆగీతం నుండి స్ఫూర్తి పొందిన ప్రజలు ఎటువంటి త్యాగాలకైనా సిద్ధపడి ముందు కొచ్చారు. ఇదేదీ లెక్కచేయకుండా మౌలానా మహమ్మదాలీ వందేమాతరం గీతాలాపాన్ని ఆపివేయడానికి చేసిన ప్రయత్నం ప్రజలను నిశ్చేష్టులను చేసింది. ఇది జాతీయ జీవనస్రవంతిలో లీనంకావడానికి ఇష్టపడక, వేర్పాటు ధోరణిని అనుసరిస్తున్న కొందరు పెద్దల మనస్తత్వాన్ని బయటపెట్టిందే గాని వందేమాతరం గీతానికి ప్రజాబాహుళ్యంలో గల గొప్పదనానికిగాని ఆదరణకుగాని ఎట్టి న్యూనత కల్గించలేదు. 'మహాత్మాగాంధీ' అనేక పర్యాయాలు ఆ జాతీయగీతంయొక్క సుగుణాలను ప్రశంసించారు. 5-1-1927 న కొమిల్లాలో గాంధీజీ ఇలా అన్నారు. "వందేమాతరం అనే మాతృభూమిని గూర్చిన గీతాన్ని మనం పాడటం అంటే యావద్భారత దేశాన్ని గూర్చి పాడటమే". "భారతమాతాకీ జై" అనడంకంటేకూడా 'వందేమాతరం' అనడాన్నే ఆయన ఎక్కువ ఇష్టపడ్డారు. కాని ముస్లిం లీగుకు చెందిన వేర్పాటువాదులు మాత్రం వందేమాతరంపట్ల తమ వ్యతిరేకతను విడనాడలేదు. ఆవిషయంలో వారు మళ్ళీమళ్ళీ వత్తిడి తేనారంభించారు. 1909 లో ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పడటంతోను, 1916 లక్నో ఒప్పందంతోనూ ముస్లింలీగుకు రెక్కలు వచ్చాయి. అది ఇంకా కొన్ని క్రొత్తక్రొత్త కోర్కెలు అధికారపూర్వకంగా బయటపెట్టింది. వాటిలో వందేమాతరం పాడరాదనేది ఒకటి. మహమ్మదీయుల భావాలను గూర్చి కాంగ్రెస్ మొదటినుంచీ మృదుహృదయంతోనూ, సున్నితంగానూ వ్యవహరిస్తూ వచ్చింది జాతీయోద్యమపు తొలిదశలలో దీనికెట్టి అభ్యంతరాన్నీ తెలియచేయలేదు. 1933-34 సంవత్సరంవరకూ కూడా ముస్లిం లీగుయొక్క దృష్టికూడా యీ వైపుకు ప్రసరించలేదు. 1922వ సంవత్సరంలో కాంగ్రెస్ 'ఇక్బాల్'యొక్క 'హిందూస్థాన్ హమారా' అనేగీతాన్ని ఉపజాతీయగీతంగా ప్రవేశపెట్టింది. ఇది కేవలం ఉరుదు మాట్లాడేవారిని

సంతోషపెట్టడానికే. 'వందేమాతరం' ముందు 'హిందూస్థాన్ హమారా' అనేగీతం చప్పగానూ నిస్సారంగాను ఉండేది. అది జాతీయగీతంయొక్క స్థానాన్ని ఆక్రమించలేకపోయేది. మహమ్మదీయులు వెయ్యి సంవత్సరాలకు పైగా భారతదేశంలో నివసిస్తున్నా వందేమాతరం గీతాన్ని అర్థంచేసుకోటానికి తగినంత సంస్కృతపదాల్నిగాని హిందూపురాణాల్నిగాని ఆకళింపు చేసుకోలేకపోయారు. ప్రాచీన సంప్రదాయాలకుచెందిన ప్రతిదీ అనగా యీ దేశపు వాఙ్మయము సంస్కృతీ మొదలైన వేవైనా ఇస్లాముకు వ్యతిరేకమని వారు భావించేవారు. ఆవిధంగా కొంతవిడుపును ఉదారతను చూపిస్తూ కాంగ్రెస్ వేదికపై "హిందుస్తాన్ హమారా" గీతాన్ని ప్రవేశపెట్టిన నాయకుల వైఖరివల్ల ఉత్సాహాన్ని పుంజుకొని ముస్లిములు "వందేమాతరం" స్థానంలో "ఇక్బాల్" గీతాన్ని ప్రవేశపెట్టాలని కోరారు ఈ గీతం పర్ష్యన్ పదజాలం అధికంగా ఉండే హిందుస్థానీ భాషలోఉంది, అది ఒక్కటే దాని అర్హత. ఆ గీతంలో భారతదేశపు భౌగోళికాంశాలను మించి ఇంకేమీలేదు. (First year of Congress Rule Guruda, Pages 71-72)

1937లో రాష్ట్ర శాసనసభలకు జరిగిన సాధారణ ఎన్నికలలో కాంగ్రెస్ 11లో 7 రాష్ట్రాలను గెలుచుకున్నది. అవి బొంబాయి, మదరాసు, సంయుక్తపరగణాలు, మధ్యపరగణాలు, బీహారు, ఒరిస్సా, అస్సాం. కాంగ్రెసు అధికారంలోఉన్న శాసనసభలో కార్యక్రమాలు వందేమాతరంతో ప్రారంభమయ్యేవి. ముస్లింలీగుసభ్యులు అభ్యంతరాన్ని తెల్పుతూ బయటకు నడిచేవారు.

అక్టోబరు ఆఖరులో కలకత్తా కాంగ్రెసుసమావేశ సందర్భంలో తమ కోర్కె నెరవేర్చుకొనేందుకు వత్తిడితేవాలని ముస్లింలీగు నిశ్చయించుకుంది. అంతకు పూర్వం అక్టోబరు 15 నుండి 18 వరకూ జరిగిన లీగు సమావేశంలో కాంగ్రెసుప్రభుత్వంపై అనేక ఆరోపణలుచేస్తూ దానిని హిందూ రాజ్యం అని నిందించారు.

ముస్లింలీగు వార్షికసమావేశం జరిపేనాటికి కాంగ్రెస్ అధికారంలోకి వచ్చి కేవలం కొద్దికాలంమాత్రమే అయింది. వారు ముస్లిములపట్ల న్యాయంగానూ, సరళంగాను ప్రవర్తించలేదనటానికి ఎట్టినిదర్శనాలను లీగర్లుకూడా చూపలేదు. ఆసమావేశంలో కొనిరాబడిన ఒకేఒక నిదర్శనం: భావ వైరుధ్యానికి సంబంధించినదే. కాంగ్రెస్ రాష్ట్రాలలో శాసనసభ కార్యక్రమాలు "వందేమాతరం" గీతాలాపనతో ప్రారంభమవుతున్నాయి. వందేమాతరం బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగిన కాంగ్రెస్ ఉద్యమాలలో లెక్కలేనన్నిసార్లు పాడబడ్డది. బహిరంగసభలు వందేమాతరం గానంతో ప్రారంభమయ్యేవి. ఊరేగింపులు, కాల్పులను లాఠీఛార్జీలను ఎదుర్కొని ముందుకు చొచ్చుకుని పోవటానికి ఆగీతం ధైర్యాన్నీ ఓపికను ఇచ్చింది. కాంగ్రెస్ వారిలో అది ఒకవిధమైన పరస్పరాభివాదపద్ధతిఐంది. అది జాతీయతతో వేరుచేయటానికి వీలులేని విధంగా పెనవేసుకపోయింది. ఆవిధంగా "వందేమాతరం" జాతీయతకు మారుపేరని కాంగ్రెసు వారికున్న దృఢవిశ్వాసాన్ని లీగర్లు తిరస్కరించారు.

బంకించంద్రుడు తన నవలలో మహమ్మదీయ పాలకులను ఎదిరిస్తూ సన్యాసులు, సాగించిన ఉద్యమాన్ని వర్ణించాడు. కాని మహమ్మదీయ పాలకులకు మారుగా బ్రిటిష్ పాలకులను ఎదిరిస్తున్నట్లు చిత్రించిఉంటే పాలకులైన బ్రిటిష్ వారిచే ఆనవల నిషేధించబడి బంకించంద్రుని ఉద్దేశ్యాలు నెరవేరకుండా పోయేవి. అంతేగాని వందేమాతరం ముస్లింలకు వ్యతిరేకమైనదికాదని ఆ గీతాన్ని జాతీయగీతంగా స్వీకరించినవారు స్వాతంత్ర్యోద్యమ దినాలలో వివరించారు. బెంగాల్‌లో దేశభక్తి తలయెత్తుతున్నరోజుల్లో ఆ తొలి బెంగాల్ జాతీయవాదులు విద్యావంతులలో దేశభక్తి భావాలను ప్రేరేపించటానికి ఇది ప్రార్థనా మందిరమైంది. దేశభక్తి భావాలు బెంగాల్‌నుండి దేశంలోని ఇతరప్రాంతాలకు వ్యాపించటంతో ఈపాటకూడా ఆయాప్రాంతాలకు ప్రాకి ప్రజలకు మాతృభూమిలాగానే యీ గీతంకూడా ప్రేమాస్పదమైంది. ఈ విధంగా జాతీయ జీవనంలో పెనవేసుకుపోయింది.

ఆ గీతాన్ని జాతీయగీతంగా చేయడానికి అంతకు పూర్వం అర్థశతాబ్దంక్రితం ముస్లింలీగు ప్రయత్నిస్తే ఎలాఉండేదోగాని ఇప్పుడు మాత్రం సమయం మించిపోయింది. కాని ఇదేదీ గుర్తించకుండా ఆ గీతాన్ని పాడరాదని ముస్లింలీగర్లు అభ్యంతరం చెప్పారు.

లీగు ఆమోదించిన తీర్మానం యిలా పేర్కొంటున్నది: "వందే మాతరం జాతీయగీతంగా చొప్పించడంలో కాంగ్రెస్‌యొక్క వైఖరి మొండిగాను-ఇస్లాము వ్యతిరేకంగాను, విగ్రహారాధకతత్వంగాను, సరియైన జాతీయతావికాసానికి వినాశకరంగాను భావిస్తూ దానిని యీ అఖిల భారత ముస్లింలీగు సమావేశం దృఢంగా గర్హిస్తున్నది. ఈ సమావేశం దేశంలోని వివిధ ప్రజాసంస్థలయొక్క శాసనసభలయొక్క సభ్యులను మిక్కిలి ఆక్షేపణీయమైన ఆ గీతంతో సంబంధం పెట్టుకోవద్దని గట్టిగా కోరుతున్నది." (Indian Muslims–Ramgopal Page 255)

భారతదేశ సమైక్యతను భౌగోళికంగాను-భావనాపరంగాను అన్ని విధాలా విచ్ఛిన్నం చేయడానికి గట్టిగా పూనుకున్న ముస్లింలీగు సరియైన జాతీయతావికాసం ఆవిర్భవించడంలేదని ఆందోళన చెందటం పరిహాసానికి పరాకాష్ఠ. ముస్లింలీగు ఎలాంటి కోర్కెలు కోరినా తీర్చకపోతే ఏమౌతుందో అని గాభరాపడే కొందరు లీగును ఏదోవిధంగా తృప్తిపరచకపోతే దేశసమైక్యత ప్రమాదంలో పడుతుంది అనేభావం అంకురించి పెరుగసాగింది. ఆ పరిస్థితిలో 1937 అక్టోబరు మాసాంతంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ కలకత్తాలో సమావేశమైంది. ముస్లింలీగును సంతృప్తిపరచడానికి జాతీయగీతాన్ని విశ్లథం చేయడానికి అందులో కొన్ని మార్పులు ప్రవేశపెట్టేందుకు ప్రయత్నించే ఒక తీర్మానాన్ని ఆమోదించింది.

వందేమాతరానికి సంబంధించి మరొక నిర్ణయంకూడ చేయబడింది. కొన్ని శాసనసభలలో వందేమాతరం గీతాలాపనతో కార్యక్రమాలు ప్రారంభమవుతున్నాయి. దానికి కొందరు ముస్లిములు అభ్యంతరం

చెప్పారు. అయినా జాతీయోద్యమం రూపుదాల్చకపూర్వం ఒక చరిత్రాత్మక నవలలో ఆ గీతానికి ఉన్న స్థానంకంటే ప్రస్తుతపు భారతదేశపు జాతీయ



జీవనంలో భాగంగా ఆ గీతంయొక్క ఉపయోగానికిగల ప్రాముఖ్యం అత్యధికమైందని ఆ సంఘం స్పష్టపరిచింది. అన్నివిషయాలను పర్యాలోచించి ఆ కమిటీ "వందేమాతరం ఎప్పుడు పాడినా ఎక్కడ పాడినా అందులోని మొదటి రెండుపాదాలను మాత్రమే పాడాలని ఆయా కార్యక్రమ నిర్వాహకులకు వందేమాతరానికి బదులుగాగాని లేక దానితోపాటు నిరాక్షేపణీయమైన మరి యే యితర గీతాన్నైనా పాడుకునేందుకుగాని పూర్తి స్వాతంత్ర్యం వుండాలనీ" సిఫారసు చేసింది. ("Mahatma" D. G Tendulkar Vol. 4 Page 252)

వందేమాతరం జాతీయగీతం స్థాయిని అందుకునేందుకు తగివున్నదో లేదో పరిశీలించటానికి కాంగ్రెస్ కార్యవర్గం "మౌలానా అజాద్-జవహర్లాల్ నెహ్రూ సుభాస్‌చంద్రబోస్ - ఆచార్య నరేంద్రదేవ్"లు సభ్యులుగా ఒక ఉపసంఘాన్ని నియమించింది. ఈ ఉపసంఘం రవీంద్రనాథ్ ఠాగూర్‌యొక్క సలహాను మార్గదర్శకత్వాన్నీ తీసుకోవాలి. ఈ సంఘం కాంగ్రెస్ కార్యవర్గంయొక్క తీర్మానాన్నే బలపరచింది.

'ఆనంద్‌మఠ్' విదేశీ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాగించిన ఒక వీరోచిత పోరాటంయొక్క కథ. ఆ ప్రభుత్వం ముస్లిం ప్రభుత్వం అయి

నందువల్ల ఒక క్రొత్త అధ్యాంతరం లేవదీయబడింది. తన నవలలద్వారా ప్రజలలో దేశభక్తిని జాగృతంచేసి బ్రిటిష్ వారిక్రింద తాము అనుభవిస్తున్న బానిసత్వాన్ని ప్రజలు గ్రహించేటట్లు చేయటమే ఆ నవలాకారుని లక్ష్యం. దీని నాయన బహిరంగంగా చేయలేకపోయాడు. కాని ఆయన నవలలు యీ ప్రయోజనాన్ని సాధించాయి. ఈ శతాబ్ది ప్రారంభంలో బెంగాలీ విప్లవకారులు వానిని యీవిధంగానే స్వీకరించారు. విదేశీ దాస్యం నుంచి దేశాన్ని విమోచనం చేయగోరి ఉరికంబాలకెక్కిన విప్లవవీరులకు వందేమాతరం ఒక మంత్రమైంది.

"ఏది ఏమైనప్పటికీ ముసల్మానులను సమాధానపరచేందుకు కాంగ్రెస్ ఆ గీతాన్ని ఛిన్నాభిన్నంచేసి అందులో మొదటి రెండు పాదాలనుమాత్రమే పాడాలని శాసించింది." (Muslim politics S. Mukharjee P 52)

"విచ్ఛిన్నకరవాదులు కొన్ని సంవత్సరాలతరబడి వ్యతిరేకించిన ఆ వందేమాతరగీతానికి చివరకు ఆగతిపట్టింది. అది త్రుంచివేయబడింది." అని K. M. Munshi వ్రాశారు.

ముస్లింలీగు వందేమాతరం గీతాన్ని మొత్తాన్నీ వ్యతిరేకించింది. అంతేగాని అందులో కొంతభాగాన్ని కత్తిరించివేయమని ఎప్పుడూ సూచించి ఉండలేదు, అందుచేత దాన్ని ఛిన్నాభిన్నంచేసిన పరమ మూర్ఖత్వం పూర్తిగా కాంగ్రెస్‌కే చెందుతుంది. తత్ఫలితంగా అటు ముస్లింలీగు సంతోషించలేదు. ఇటు దేశమూ సంతోషించలేదు ముస్లింలీగు సంతృప్తి చెందలేదన్నమాట ఎలాఉన్నా కోట్లాదిప్రజల మనోభీష్టాన్ని కాలరాచి ముస్లిం లీగర్ల అభిప్రాయం స్వీకరించేసిందనేది సత్యం. భారత జాతీయ కాంగ్రెస్ స్వయంగా తన చేతులతోటే జాతీయ గీతంలోని ప్రముఖభాగాన్ని కత్తిరించి వేసేట్లు చేయటంలో ముస్లింలీగు విజయం సాధించింది. దాంతో అసలు వందేమాతరాన్ని జాతీయగీతం స్థాయినుండి పూర్తిగాతొలగించివేసేప్రయత్నంలో వారికి ప్రోత్సాహంలభించింది. వందేమాతరంలోని మొదటి రెండుపాదాల్ని

కూడా పదభ్రష్టం చేయడానికి ముస్లింలీగు తనదండయాత్ర కొనసాగించింది. లీగు సభ్యులు ప్రతి శాసనసభలోనూ మితిమీరిన దురహంకారంతో ప్రవర్తించేవారు. మద్రాసు శాసనసభలో జరిగిన ఒక సంఘటన ఇక్కడ పేర్కొనవలసివుంది. అప్పుడు బులుసు సాంబమూర్తి స్పీకరుగాను చక్రవర్తుల రాజగోపాలాచారి ముఖ్యమంత్రిగాను ఉన్నారు. 1937 జులై 15న సభాకార్యక్రమాల ప్రారంభంలో శ్రీమతి లక్ష్మీశంకర అయ్యర్ వందేమాతరం పాడారు. ఈ విధానం ఎట్టి అంతరాయమూలేకుండా సెప్టెంబరు 23 వరకుకొనసాగింది. అంతట అకస్మాత్తుగా ముస్లింలీగు సభ్యుడైన షేక్ మహమ్మద్ లాల్జన్ వందేమాతరం పాడటం ఇస్లాంకు వ్యతిరేకంగా యుద్ధాన్ని ప్రకటించడమేనంటూ స్వల్పవ్యవధి తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు. కాని దానికి మద్దతుగాని శ్రద్ధగానీ ఎవరూచూపలేదు. వందేమాతరం మామూలుగానే పాడబడింది. లాల్జన్ సభను బహిష్కరిస్తూ బయటకు నడిచాడు. అతడు తిరిగివచ్చినపుడు క్రమశిక్షణను అతిక్రమించినందుకు విచారాన్ని వ్యక్తపరిచాడుగాని ఆ జాతీయగీతం పాడినప్పుడల్లా అతడు బయటకునడుస్తూనే ఉన్నాడు. సెప్టెంబరు 30న అతడు మళ్ళీ ఒక స్వల్ప వ్యవధి తీర్మానాన్ని తీసుకువచ్చాడు. అక్టోబరు 1న సాంబమూర్తి అరవిందో వివరించిన విధంగా వందేమాతరం యొక్క అర్థాన్ని తెలియచెప్పాడు. కాని లీగ్ సభ్యులపైన దాని ప్రభావమేమీ కనుపించలేదు. డిసెంబరులో లీగ్ సభ్యులు ఒక క్రొత్త ఎత్తువేశారు. జాతీయగీతం ఆలపింపబడేటప్పుడు వాళ్ళు నిలబడటం మానుకున్నారు. డిసెంబరు 21 లీగర్లవత్తిడికి లొంగిపోయి వందేమాతరంకంటె ముందు 'బషీర్ అహ్మద్' ఒక ఉరుదూ గీతాన్ని పాడటానికి అనుమతించారు. ఈ విధంగా 1938 జనవరి 27 వరకు నడిచింది. ఆరోజున ఉరుదూ గీతం పూర్తిగావటంతోనే ముస్లిం లీగర్లు వందేమాతరగీతానికి అభ్యంతరంతెల్పుతూ బయటకునడిచారు. వారిని సంతృప్తిపరచడానికి 1938 జనవరి 28 నుండి ఖోరాన్‌నుండి ఒకభాగము చదవడం ఇంగ్లీషులోకూడా ఒక ప్రార్థన చదవడం ప్రవేశపెట్టబడది.
(Amache Rashtrageeth Vandematharam – P. P. Gokhale – Vivek Monthly Aug 1967)

1938 మార్చి 17న ముస్లింలీగ్ అధ్యక్షుడైన జిన్నా "పద్నాలుగ కోర్కెలను వెల్లడిస్తూ పండిట్ జవహర్లాల్ నెహ్రూ"కు ఒక లేఖ వ్రాశాడు. మహమ్మదీయులు గోవధ చేసేందుకు స్వేచ్ఛ, త్రివర్ణపతాకాన్ని మార్చటం లేదా ముస్లింలీగు పతాకానికికూడా సమానస్థాయినివ్వటం, వందేమాతరం గీతాలాపనకు స్వస్తిచెప్పటం అనేవి ఆ కోరికలలో ఉన్నాయి. గోవధ, పతాకాలకు సంబంధించిన కోర్కెలను ఆమోదించటం నెహ్రూకు సమ్మతమే కాని ఇదివరకే కొంతభాగం తొలగించబడిన వందేమాతరం గీతానికి సంబంధించిన కోరికను ఆయన ఒప్పుకోలేదు. భారతజాతి దానికి సంసిద్ధంగా లేకపోవటమే అందుకు కారణం. 6-4-1938న నెహ్రూ ఆ ఉత్తరాని కిలా జవాబు వ్రాశాడు.

"వందేమాతరం గీతం విషయంలో గత అక్టోబరులో కార్యవర్గం వెలువరించిన సుదీర్ఘమైన ప్రకటనను మీదృష్టికి తెస్తున్నాను. మొట్ట మొదట కాంగ్రెస్ ఎప్పుడూకూడా ఏ జాతీయగీతాన్నీ విద్యుక్తంగా స్వీక రించలేదనేది గుర్తుంచుకోవాలి. అయినా వందేమాతరం గీతం 30 సంవత్సరాలుగా భారత జాతీయతతో అత్యంత సన్నిహితంగా పెనవేసుకు పోయిందనీ దానిచుట్టూ త్యాగమూ జాతీయభావన పరివేష్టించి ఉన్నాయనేది సత్యం. ప్రజాదరణపొందే గీతాలు ఒకరు ఆజ్ఞాపిస్తే వచ్చేవికావు, ఆజ్ఞా పించటంవల్ల వారికి ఆదరణ రానూరాదు. అవి ప్రజాహృదయాలలోంచి, భావావేశంనుంచి ఉత్పన్నమై పెరుగుతాయి. ఈ ముప్పైయేళ్ళుగా వందే మాతరం గీతం మతప్రాధాన్యం కల్గిందిగా ఎన్నడూ భావింపబడలేదు. అది భారతదేశాన్ని స్తుతించే జాతీయగీతంగానే భావింపబడింది. రాజకీయ కారణాలవల్ల ఒక్క బ్రిటిష్ ప్రభుత్వంతప్ప ఇంకెవ్వరూ దానిని ఏవిధం గాను ఆక్షేపించలేదు. అటువంటి అభ్యంతరాలు ఏమైనా ఎప్పుడైనా వెలువరించబడివున్నట్లయితే కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ వానిని జాగ్రత్తగా పరిశీలించి కొన్ని ప్రాచీనగాధలు లేక దేవతామూర్తులను తలపించే అంశాలువున్న పద్యాలను జాతీయవేదికలమీద పాడరాదని నిర్దేశిస్తూ

సిఫారసుచేసింది కాంగ్రెస్ కార్యవర్గం జాతీయగీతంగా వుపయోగించేం దుకు సిఫారసుచేసిన రెండు చరణాలలోనూ ఎవరికైనా క్రోధాన్ని కలిగించే మాటగాని సమానంగాని లేనేలేదు. ఏ దృక్కోణంనుంచి చూచినా ఎవరికైనా అందులో అభ్యంతరం పెట్టతగింది ఏమీలేదు. అది ఎక్కువమంది హృదయాలలోకి అధికంగా చొచ్చుకపోవచ్చు. కొందరికది రుచించక పోవచ్చు వారు మరొక జాతీయగీతాన్ని కోరవచ్చు. అందుకు వారికి పూర్తి స్వాతంత్ర్యంవుంది. కానివారు అధికసంఖ్యాకులు ఎంతోకాలంగా మమకారం పెంచుకొని ఎంతో విలువ ఇచ్చిన గీతాన్ని విడిచిపెట్టమని బలవంతం చేయడం వారిని అనవసరంగా బాధించడం ఇంకా జాతీయోద్యమానికి గ్లాని కల్గించడం అవుతుంది. ఒక జాతీయసంస్థకు ఇటువంటి పని తగదు. Nehru the first sixty years Dorothy Normon Vol P. 540

జాతీయ గీతాన్ని అంతమొందించే ప్రయత్నంనుండి ముస్లింలీగు విరమించలేదు. ఏప్రియల్‌లో కలకత్తాలో ముస్లింలీగు ఒక ప్రత్యేకసమావేశం జరిపి వివిధ కాంగ్రెస్ రాష్ట్రాలలో ముస్లింలు అనుభవిస్తున్న కష్టాలను అన్యాయాలను గూర్చి దర్యాప్తుచేయడా కి పీర్‌పూర్ నవాబు అధ్యక్షతన ఒక ఉపసంఘాన్ని నియమించింది. శాసనసభలలో వందేమాతరం పాడటానికి ముస్లింలీగు తీవ్ర నిరసన తెలియజేసింది.

ముస్లింలీగు దృష్టిలో వందేమాతరం గీతాలాపం ముస్లిములపట్ల జరుపబడుతున్న దారుణమైన దౌర్జన్యంగాను అవమానంగాను పరిగణింప బడుతున్నది. అసలు తమాషా ఏమిటంటే ముసల్మానులు పాడకున్నా మిగతా అందరూ వందేమాతరం పాడుతున్నారు కూసేగాడిదవచ్చి మేసే గాడిదను చెడకొట్టినదన్నట్లు ముస్లింలీగువారు తాము పాడరు ఇతరులను పాడనివ్వరు.

"కాంగ్రెస్ అధికారంలోకి వచ్చిన 9 నెలలకు కాంగ్రెస్ మంత్రివర్గాలు ముస్లింలపట్ల చూపుతున్న నిరాదరణకు వ్యతిరేకంగా అఖిల భారత ముస్లింలీగు ఒక ఉద్యమాన్ని ప్రారంభించింది. 1938 ఏప్రిల్ 17, 18 తేదీలలో కలకత్తాలో జరిగిన ప్రత్యేకసమావేశంలో దానినిగూర్చి ఒకతీర్మానాన్ని అమోదించింది" (Muslim Politics S. Mukharj P.52)

ఆ తీర్మానం ప్రకారమే పైన పేర్కొనబడిన పీర్‌పూర్ నవాబు కమిటీ నియమింపబడింది. ఆ ఉపసంఘం 15-11-1938న తన నివేదికను సమర్పించింది.

"ఆ పీర్‌పూర్ నవాబు నివేదిక తమ కష్టనిష్ఠూరాలనుగూర్చి ఒక సుదీర్ఘమైన జాబితాతయారుచేసింది. అవి ఎంత హాస్యాస్పదంగాఉన్నాయో తెల్పటానికి వానిలో ముఖ్యమైనవికొన్ని ఈ దిగువ ఇవ్వబడుతున్నాయి. కాంగ్రెస్‌వల్ల వారికికల్గుతున్న నష్టాలలో మొట్టమొదటిది వందేమాతరగీతం. కాంగ్రెస్ స్థాపించబడిననాటినుంచీ వందేమాతరం జాతీయగీతంగా పాడబడుతూవున్నది. వందేమాతరం అనేది భారతజాతీయ నినాదమైంది. జిన్నా కనీసం 15 సంవత్సరాలయినా కాంగ్రెస్ సమావేశాలకు హాజరయినాడు. ప్రతిసమావేశంలోను ఆగీతం పాడబడింది. అతడుగాని మరొకముస్లింగాని ఆగీతానికి అన్నాళ్ళూ ఎటువంటి అభ్యంతరం చెప్పిఉండలేదు, అందులో నిజంగా అభ్యంతరకరమైనదేదైనా ఉన్నట్లయితే ముస్లింలీగు అధ్యక్షుని కంటబడకుండాఉండేదికాదు. దీన్నిబట్టి యీఅభ్యంతరం తరువాత తరువాత ఏర్పడిందేనని రూఢి అవుతున్నది" (Muslim Politics, P. 52)

ఆసంవత్సరం మేలో గాంధీజీ 'జుహూ'లో విశ్రాంతి తీసుకుంటున్నారు. ముఖ్యమైన విషయాలలో ఆయన సలహాకోసం కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు ఆయనవద్దకు వెళ్తూ వుండేవారు. మే 26న గాంధీజీ సుభాసుబోసు జిన్నాతో సంభాషణలు జరిపారు. ముస్లింల తరపున కాంగ్రెస్ ఒక ఒప్పందానికి రావాలని జిన్నా అభిప్రాయం, కాంగ్రెసుతో చేతులుకలిపి బ్రిటిష్

వారితో పోరాడటానికి మారుగా ముస్లింలీగు కాంగ్రెసుతో పోరాటం ప్రారంభించింది. కాంగ్రెసు తమప్రతికోరికను ఆమోదిస్తుందని ముస్లింలీగు విశ్వాసం. దానివిశ్వాసం వ్యర్ధకాలేదు. జిన్నా తన 14 కోరికలను గాంధీజీ ముందుంచి తన కోరికలను ఇంకా పెంచగలమనికూడా అన్నాడు.

జూన్‌లో లీగ్ కాంగ్రెస్‌ముందు 11 కోర్కెలను ఉంచింది. అక్కడ కూడా వందేమాతరానికి ఉద్వాసన చెప్పాలనే కోర్కె ప్రధమస్థానాన్ని ఆక్రమించింది. కాంగ్రెస్ నాయకులు ముస్లింలీగుతో కుస్తీపట్టటంతో అలిసిపోయినారు. అందుచేత వారొక రాజీకి రావలసివచ్చింది. ఆకార్యక్రమంలో వందేమాతరం ఒక అనాధశిశువైంది.

గాంధీజీ విసిగిపోయి "హరిజన్" పత్రికలో యిలా వ్రాశాడు. "అది ఎక్కడ పుట్టింది? ఎప్పుడు ఎలా రచించబడింది? అనేది అనవసరం. కాని అది బెంగాల్ విభజన దినాల్లో హిందువులకు ముస్లింలకుగూడా అత్యంత శక్తివంతమైన యుద్ధనినాదమైంది. అది ఒక సామ్రాజ్యవాద వ్యతిరేక నినాదం. నేను బాలునిగా ఉన్నప్పుడు ఆనందమఠాన్ని గురించి దానికర్తయైన అమరకవి బంకింనుగూర్చిగాని ఏమీ ఎఱుగకముందే మొదటిసారిగా వందేమాతరం గీతాన్ని విన్నపుడు అదినన్ను గట్టిగా ఆకట్టుకొని నన్ను దాసుడ్ని చేసుకున్నది. అది హిందువుల గీతమనిగాని, హిందువులకోసమే ఉద్దేశింపబడిందని నాకిప్పుడు తోచలేదు. దురదృష్టవశాత్తు మనకిప్పుడు చెడ్డకాలంవచ్చింది. పూర్వకాలపు మేలిమి బంగారమంతా ఇప్పుడు కల్తీ లోహమైంది. ఇటువంటి కాలంలో మేలిమి బంగారాన్ని అమ్మచూపకుండా వుండటమే వివేకం. అది నీచ లోహంగానే అమ్మబడుగాక, హిందువులు ముస్లిములు కలసి సమావేశాలలో ఆపాటనుపాడి తగాదా తెచ్చుకునేందుకు నేను సిద్ధంగాలేను. అలా అని ఆపాట వాడుకనుంచి తప్పిపోదు. అది కోట్లాది ప్రజల హృదయసింహాసనాలలో సుప్రతిష్ఠితమై వుంది. జాతి జీవించి యున్నంతవరకు ఆ పతాకము ఆ గీతము జీవిస్తాయి".

ఇందులో ప్రజలను సంతోషపెట్టటానికి తగినంతగా వందేమాతరం గీతపు పొగడ్తవున్నది. లీగును సంతృప్తిపరచేందుకు బహిరంగంగా దానిని పాడవద్దనే సలహా ఉన్నది. దీనినిమించిన రాజకీయ చతురతవుండదు. ఆతర్వాత గాంధీజీ జాతీయగీతం విషయంలోగాని జాతీయ పతాకం విషయంలోగాని ఇతరులను బలవంతం చేయవద్దని విద్యార్థులకు సలహా ఇచ్చారు.

"1947 ఆగష్టు 23 న కొంతమంది హిందువులాక్షేపించిన 'అల్లాహో అక్బర్' నినాదాన్ని గూర్చి ప్రస్తావిస్తూ అంతకన్నా గొప్పనినాదం ప్రపంచంలో ఇంతవరకూ పుట్టలేదన్నారు" (Mahatma Vol VIII P 110) అక్కడనుండి క్రమంగా వందేమాతరానికి బదులుగా 'అల్లాహో అక్బర్' నినాదం వినపడసాగింది.

15-8-1947 న బ్రిటిషువారు ఇండియాను విడచి వెళ్ళారు. వెళ్తూ వెళ్తూ దేశాన్ని విభజించివెళ్ళారు. కొన్నివేలమంది హిందువులు తమ మర్యాదను ఆస్తిపాస్తులను పోగొట్టుకొని నిర్వాసితులైనారు. ప్రాణనష్టంకూడా అత్యధికంగా కలిగింది. పట్టపగలు నిర్దాక్షిణ్యంగా వధించటంతోసహా దారుణమైన పాశవిక అత్యాచారాలు వారిపై జరుపబడ్డాయి. మూకఉమ్మడిగా బలవంతపు మత మార్పిడీలు జరిగాయి. పంజాబు, బెంగాలు అమాయకుల రక్తధారలతో పొర్లిపోయాయి.

1947 ఆగష్టు 23న గాంధీజీ వందేమాతరాన్ని గూర్చి ప్రస్తావిస్తూ అది మత నినాదం కాదన్నారు. కాంగ్రెసుకూడాదాన్ని పరిశీలించింది ఆ విషయమై గురుదేవుడు రవీంద్రునితోకూడా సంప్రదించడం జరిగింది. కాంగ్రెసు కార్యవర్గంలోని హిందూ ముస్లిం సభ్యులందరూ దాని మొదటి చరణాలు నిరాక్షేపణీయమైనవనే నిర్ణయానికి వచ్చారు. తగిన సందర్భాలలో దానిని అందరూకలసి పాడాలనికూడా ఆయన వాదించాడు. ముస్లింలను క్రోధోద్రిక్తులను చేయడానికిగాని అవమానించడానికిగాని దాన్ని పాడరాదు.

అది బెంగాలును భుగభుగలాడించిన నినాదమని గుర్తుంచుకోవాలి. పెక్కు మంది బెంగాలీయులు రాజకీయ స్వాతంత్ర్యంకొరకు పెదవులపై ఆ నినాదంతో ప్రాణాలను ఆర్పించారు. అందుచేత దానిని భారతమాతకంకిత మైన గీతంగా భావించినప్పటికీ యీవిషయాన్ని లీగ్ హైకమాండ్‌కు నివేదించవలసిందిగా ఆయన తన లీగ్ మిత్రులకు సలహా యిచ్చాడు. ముస్లింలీగు హైకమాండ్ వందేమాతరం చరణాలు హిందువులు ముస్లింల మధ్య వృద్ధిచెందుతున్న సఖ్యతకు అభ్యంతరకరాలని చెప్పటం ఆయన కాశ్చర్యాన్ని కలిగించివుంటుంది. (Mahatma Vol VIII P. 111)

గాంధీజీకి వందేమాతరంపట్ల అత్యంతమైన ప్రేమవుంది. కాని ముస్లింలీగుపట్ల చింతకూడా ఆయనకు వున్నది. వృద్ధాప్యంలో ఆయన యీ మానసిక వేదనతో మిక్కిలి బాధపడ్డాడు. వందేమాతరానికి జాతీయగీతపు స్థానాన్ని ఇవ్వటానికి ఆయనకెటువంటి సంకోచమూ లేన ప్పటికీ ముస్లింలీగుయొక్క మొండివైఖరివల్ల ఆయన మౌనందాల్చవలసి వచ్చింది. ఐనా ఆయన పదేపదే వ్రాసిన, పలికిన మాటలలోంచి సత్యం తళుక్కున మెరుస్తూనేఉన్నది. 1940 లో ఒక బెంగాలీ క్రైస్తవ విద్యార్థి గాంధీజీ ఇలా వ్రాశాడు. "మిషనరీ కళాశాలలు క్రైస్తవ మతబోధనకు క్రైస్తవమతంలోకి మార్చటానికి కేంద్రాలుగా ఉద్దేశింపబడ్డాయి. ఈ మిషనరీలు బైబిలునుగూర్చి క్రీస్తునుగూర్చి క్రైస్తవమతాన్నిగూర్చి ప్రస్తావిస్తూ ఉంటారు. కాని భారతదేశాన్నిగూర్చి వచ్చిన ఏ ముఖ్య విషయానికైనా ఆశ్చర్యకరంగా ప్రతికూలురౌతారు. మా కళాశాలలో వార్షిక సాంఘిక సమావేశాలుంటాయి. సెప్టెంబరు 7వ తేదీ సాయంత్రం అటువంటి సమావేశం ఒకటి జరిగింది. నాటి కార్యక్రమంలో మొదటి అంశం హాస్టల్ విద్యార్థులబృందం వందేమాతరం పాడటం. అందుకు కళాశాల ప్రధానాచార్యుడు భారత జాతీయగీత గౌరవార్థం యూరోపియన్లు పదినిమిషాలసేపు నిలబడి వుండటం కష్టమని యీ పాటను పాడటానికి

అంగీకరించినట్లయితే దానిని జాతీయగీతంగా తాము అధికారికంగా గుర్తించటమవుతుందని, అందుకు తాము ఏమాత్రం అంగీకరించబోమని స్పష్టంగా చెప్పాడు. విద్యార్థులు ఎన్నివిధాల వాదించినా ఆయన ఆవిషయంలో రాజీపడలేదు. విద్యార్థులు సమ్మె ప్రారంభించారు. సామ్రాజ్యవాద బ్రిటిషు ప్రభుత్వం మన భావాలను ఏనాటికి అర్థంచేసుకోదుగనుక కాంగ్రెస్ కూడా ఆవిధంగానే సత్యాగ్రహానికి సహాయనిరాకరణకు పూనుకోవాలి.

అతనికి గాంధీజీ యిలా సమాధానమిచ్చారు : అది జాతీయగీతమో కాదో నిర్ణయించవలసినవారు మిషనరీలు కాదు. తమ విద్యార్థులు దానిని జాతీయగీతంగా గుర్తిస్తున్నారనేది వారికి చాలు. అనైతికము, అవాంఛనీయము కానటువంటి కార్యక్రమాలు విద్యార్థులు చేపట్టినప్పుడు ఆచార్యులు, ఉపాధ్యాయులు వారితో కలిసి పాల్గొన్నప్పుడే విద్యార్థుల మన్ననలకు పాత్రులవుతారు.

## 12. అనూహ్య పరిణామం

కేంద్ర రేడియో సమాచార మంత్రిత్వశాఖ 'భారతదేశాన్ని గూర్చిన కొన్ని సంగతులు' అన్న పుస్తకాన్ని ప్రచురించింది. అందులోని మొదటి విషయం జాతీయపతాకం. రెండవవిషయం జాతీయగీతం. జాతీయగీతాన్ని గూర్చి యీ క్రింది వివరణ ఇవ్వబడింది :

"1905 జనవరి 24న భారత రాజ్యాంగసభ 'జనగణమన' గీతాన్ని జాతీయ గీతంగా స్వీకరించింది. అది కీర్తిశేషులైన రవీంద్రనాథ ఠాగూర్ చే 1912లో రచింపబడింది. బంకించంద్ర ఛటర్జీ యొక్క సుప్రసిద్ధ ప్రార్థనా గీతం వందేమాతరంకూడా సమాన ప్రతిపత్తిని అనుభవించాలని నిర్ణయించబడింది."

"జాతీయ గీతపు ప్రతిపత్తికి యీ రెండుపాటలు పోటీపడ్డాయి. రెండింటికీ పవిత్రమైన చరిత్రవుంది. రెండుకూడా భారతదేశంలోని గొప్ప కవులచే వ్రాయబడ్డవి."

"ఈ రెండింటిలో వందేమాతరం ప్రాచీన రచన. అది 1882లో ప్రచురింపబడిన బంకించంద్రుని 'ఆనందమఠ్' అనే నవలలోవున్నది. అది రాజకీయసభలలో మొదటిసారిగా 1886లో జరిగిన భారతజాతీయ కాంగ్రెస్

సమావేశంలో పాడబడింది. దానికి రవీంద్రనాథఠాగూరు సంగీతం సమకూర్చారు. క్రమంగా ఆ గీతంలోని మొదటిరెడుపదాలు జాతీయోద్యమం యొక్క నినాదమైనాయి. చరిత్రలో మహోన్నతమైన కొన్నిత్యాగాలకు అది ప్రేరణ నిచ్చింది."

"జాతీయగీతంగా వందేమాతరాన్ని స్వీకరించటంలోని ఇబ్బందల్లా అది లయబద్ధంగా లేదనేదే".

మహాత్మాగాంధీచే 'జనగణమన' భక్తిగీతంగా అభివర్ణించబడింది. డాక్టర్ ఠాగూర్ సంపాదకుడుగావున్న 'తత్వబోధిని' పత్రికలో 1912 లో అది మొదటిసారిగా ప్రచురించబడింది. ఆ కవియే దానిని 'భారతదేశపు ఉదయగీతిక' అనే శీర్షికతో 1919 లో ఆంగ్లంలోకి అనువదించాడు. ఈగీతం మొట్టమొదటిసారిగా 1911 డిసెంబరు 27న అనగా కాంగ్రెస్ సమావేశపు రెండవరోజున పాడబడి హుందాగాను విలక్షణత కల్గినదిగానూ శ్రోతలను ఆకట్టుకొన్నది".

ఈ వివరణాన్ని జాగ్రత్తగా పరిశీలించవలసి వున్నది. జనగణమన మొట్టమొదటిసారిగా 1911 లో పాడబడింది అని చెప్పటం 1912 లో ప్రథమంగా అది ప్రచురింపబడింది అనేకథనంతో పొసగటంలేదు. 1886లో వందేమాతరం గీతానికి రవీంద్రుడు సంగీతంసమకూర్చలేదు. భారత జాతీయ కాంగ్రెస్‌యొక్క ద్వితీయ సమావేశం కలకత్తాలో 1886 లో జరిగింది. ఆ సభాస్థలిలో నిలబడి రవీంద్రుడు తానే రచించిన ఒక గేయాన్ని చదివాడు :-

"మన తల్లి పిలుపై
మనమంతా ఇక్కడ చేరాం...."

[Ravindranath Tagore, A Life Story–Shitees Roy Page 39]

ఇక వందేమాతరాన్ని జాతీయగీతంగా అంగీకరించటంలో ఉన్న ఒకే ఒక యిబ్బంది అది లయబద్ధంగా లేదు అన్న వాదనను పరిశీలిద్దాం. ఈ కథనంలో నిర్దిష్టత లేదు. అది హాయిగా తప్పించుకునేందుకు వీలుగా అసందిగ్ధంగాను అస్పష్టంగాను వుంది. తన అభిప్రాయమేమిటో ప్రభుత్వానికే తెలిసినట్లు లేదు. కాని వాస్తవాన్ని తెలుసుకోవలసిన ఆవశ్యకత ప్రజలకున్నది.

భారత ప్రభుత్వపు మరియొక ప్రచురణ "మన జాతీయగీతాలు" అనేదానిలో వందేమాతరం తాళానికీ లయకూ అనుకూలంగా లేదని నిపుణులు అభిప్రాయపడ్డట్టు చెప్పబడింది. ఆ నిపుణులు అధికార హోదా గలవారు కావటంవల్ల వారెవ్వరో తెలియరాకుండానే ఉండిపోతారు. వారి అభిప్రాయంలో జాతీయగీతంయొక్క ప్రధానమైన అర్హత 'తాళము'. అందుచేత వారు "జనగణమన" సిఫారసు చేశారు. "పాటకుడు ఎంత చేతగానివాడైనా ఆ గీతంలో తాళము తప్పదు అని వారు విశ్వసించారు".

మహాత్మాగాంధీ 'జనగణమన' మతసంబంధమైన గేయమని జాతీయ గీతం కాదనీ పేర్కొన్నారు. కాని ఆయన 'వందేమాతరం' ను జాతీయ గీతంగా లెక్కలేనన్నిమార్లు ప్రశంసించారు.

జనగణమన మొదటిసారిగా పాడినప్పుడు అది విలక్షణత హుందాతనము కలదిగా శ్రోతలను ఆకట్టుకున్నది అని చెప్పబడింది. కాని దానికి సాక్ష్యమేమిటి? ఆ సమావేశంలో ప్రముఖులెవ్వరూ లేరా? దాన్ని గూర్చి వారేమీ చెప్పలేదా? పత్రికలలోగాని, గ్రంథాలలోగాని దానిపట్ల వారికిగల భావాలు నమోదుచేయబడలేదా? లేక ఇదికేవలం ఒక ఊహయేనా? జనగణమననుగూర్చి గాంధీగారి అభిప్రాయంతో 'హుమయూన్ కబీర్' ఏకీభవిస్తున్నాడు. 'ఒకవిధంగాచూస్తే ఏదేశానికైనా అది ఒక జాతీయగీతం అనటం

కంటెకూడా మొత్తం మానవ జాతికి అదిఒక తత్వపరమైనగేయం అనడం ఎక్కువ సమంజసం' (Ravindranath Tagore A Centenary Volume P. 152)

"ఇదిలా వుండగా ఇక వందేమాతరం జాతీయతయొక్క వ్యక్తీకరణం. జాతీయతకు ఆత్మ. అందుచేత అది జాతీయగీతం. అది వేగంగా భారతదేశమంతటా వ్యాపించి కోట్లాది ప్రజల నాల్కలపై జాతీయగీతంగా నిలబడింది." (Maha Yogi R. R. Diwakar, P. 47)

స్వదేశీ ఉద్యమం ప్రసాదించిన మహోన్నతమూ, చిరంతనమూ అయిన బహుమానం వందేమాతరం. సాటిలేని జాతీయగీతమిది. [The Camebridge History of India Vol. IV Page 608.]

"బంకించంద్ర ఛటర్జీయొక్క వందేమాతరం గీతం మొదటిసారిగా 1882 లో ఆయన "ఆనందమఠం" అనే నవలలో కనిపించింది. అంతే కాదు ఫ్రాన్సులో ఫ్రెంచి విప్లవ జాతీయగీతం వ్యాపించినంత వేగంగా అది భారతదేశమంతటా వ్యాపించింది". [A Book of India - B. N. Pande P. 67].

"వందేమాతరం :- బంకించంద్ర ఛటర్జీ నవలలోని గీతం. ఈ శతాబ్ది ప్రారంభంలో జాతీయోద్యమ కాలంలో ఇది అత్యధికంగా ప్రజాదరణ పొందిన గీతం. తరువాత యిది ఒకవిధమైన అనధికార జాతీయ గీతం అయింది". [Nehru-The First Sixty Years - Vol. II P. 577]

"20వ శతాబ్ది ప్రారంభంలో భారత జాతీయోద్యమగీతమైన బంకించంద్రుని వందేమాతరం గీతంలో మాతృభూమి మాతృమూర్తిగా రూపుదాల్చింది" [Tilak and the struggle for Indian freedom P. 253]

రవీంద్రనాథుడు అన్నట్లు - "శిలాసదృశమైన హృదయ కవాటాలను సైతం ఛేదించి, మనోసింహాసనం అధివసించగల అద్భుత శక్తి వందేమాతరం గీతంలోని ప్రతిమాటకు, పదానికి ఉంది" నిజం.

"ఈ భారత జాతీయగీతంలో మాతృభూమిపైగల ప్రేమ పరిపూర్ణ కవితారూపాన్ని పొందింది." (Resurgent India, P. 188, 189)

భారతీయులందరూ ఈ మహోన్నత జాతీయగీతం భారతదేశపు ఆధికారిక జాతీయగీతంగా కొనసాగుతుందని భావించడంసహజం. రాజ్యాంగ సభలో అదే వాడబడింది. శ్రీమతి సుచేతాకృపలానీ దానిని పాడారు, కాని వెంటనే అపశ్రుతులు వినిపించసాగాయి. ఆసభ సభ్యులకే అచ్చెరువు గొలిపే టట్లుగా జాతీయ గీతాన్ని నిర్ణయించే ప్రశ్నను మాటిమాటికీ వాయిదావేయ సాగారు. జాతీయతత్వానికి సంబంధించిన యీ వివాదంవెనుకఉన్నవారెవరు? వారి ఉద్దేశ్యాలేమిటి? సహజంగా ప్రజలు యదార్థం తెలిసికొనేందుకు ఆతురతచెందుతూవుంటారు. సభ్యులు ఒత్తిడిచేసిన మీదట 25-8-1948న రాజ్యాంగసభలో పండిత జవహర్లాల్ నెహ్రూ చేసిన యీ ప్రకటన గమనార్హము.

"1947లో న్యూయార్కులో జరిగిన ఐక్యరాజ్యసమితి సర్వసభ్య సమావేశం సందర్భంగా ఈ విషయం ఒక కొలిక్కి వచ్చింది. ఒక ప్రత్యేక సందర్భంలో వినిపించటానికి మన జాతీయగీతంకోసం అచ్చట మనప్రతినిధి వర్గాన్ని అడిగారు. మన ప్రతినిధివర్గం దగ్గర జనగణమన రికార్డు ఒకటి ఉన్నది. వారు దానితో అక్కడి వాద్యబృందానికి ఆ ఫణితిని అభ్యసించటానికి ఇచ్చారు. సభ్యులు అసంఖ్యాకంగాఉన్న ఆసమావేశంలో వాద్యములమీద ఆ గీతాన్ని వినిపించినప్పుడు అది గొప్ప మెప్పునుపొందింది. ఈ వాద్యసమ్మేళ నంతో వినిపించిన జనగణమన గీతాన్ని రికార్డుచేసి భారతదేశానికిపంపించారు. మన సైనికదళాలు, విదేశీ రాయబార కార్యాలయ ప్రతినిధులు అవసరమై నప్పుడు దీనిని ఉపయోగించుకొనసాగారు. దానికి లభిస్తున్న సర్వసాధా రణమైన మెప్పునట్లావుంచి ఏయితర జాతీయగీతపు వాద్యసంగీతపు రికార్డు కూడా మనవద్దలేదు. అప్పుడు నేను జనగణమననుగాని లేక మరియొక గీతాన్నిగాని మన జాతీయగీతంగా తీసుకోవడాన్నిగూర్చి వారివారి అభి ప్రాయాలను కోరుతూ మన రాష్ట్ర గవర్నర్లకందరకూవ్రాశాను. వారు

సమాధాన మిచ్చేముందు తమతమ ముఖ్యమంత్రులను సంప్రదించవలసిందిగా కూడా కోరాను. విదేశీ రాయబారకార్యాలయాలకు. సైనికదళాలకు సత్వరంగా ఏదోఒక ఆదేశాన్ని పంపవలసిన అవసరం దృష్ట్యా ఒక తాత్కాలిక నిర్ణయం తీసుకోవటం తప్పనిసరి అయిందని అయితే యీ విషయంలో తుది నిర్ణయం రాజ్యాంగసభదేనని స్పష్టంచేశాను. ఒక్క మధ్యపరగణాల గవర్నరుతప్ప మిగతాగవర్నర్లందరూ "జనగణమన"కే తమ ఆమోదాన్ని తెలిపారు. దానిమీద మంత్రివర్గం యీవిషయాన్ని పరిశీలించి రాజ్యాంగ సభ తుది నిర్ణయం చేసేదాకా తాత్కాలికంగా 'జనగణమన' జాతీయగీతంగా ఉపయోగించాలనే నిర్ణయానికి వచ్చింది.

"తరువాత బెంగాల్‌యొక్క క్రొత్త ముఖ్యమంత్రి తాను తన ప్రభుత్వమూ జనగణమనకంటే వందేమాతరాన్ని ఎక్కువగా ఇష్టపడుతున్నట్లు తెలియచేశాడు".

నెహ్రూ పండితుని కథనం ఎంత చమత్కారంగా ఉంది! ఐక్యరాజ్య సమితిలోని మన ప్రతినిధివర్గం దగ్గరకు జనగణమన రికార్డు ఎలా వచ్చిపడింది? ఇది నిస్సందేహంగా ముందుగా ఏర్పాటుచేసుకున్న నాటకమే. పైగా ఆనాటి గవర్నర్లు నెహ్రూగారు 'నందంటే నంది పందంటే పంది' అనటంలోనే తమ భవిష్యత్తున్నదని గమనించారు. ముఖ్యమంత్రుల సలహా ఏవిధంగా ఉంటుందో వారికి తెలుసు. అందుచేతనే తెలివిగా ప్రభుత్వాలను సంప్రదించకుండా తమ అభిప్రాయాన్ని పంపించేశారు. బెంగాల్ ఉదాహరణ దీనిని స్పష్టపరుస్తున్నది. నెహ్రూ యింకా యిలా అన్నారు:

జనగణమన – వందేమాతరం మధ్య ఒకవిధమైన వివాదం చెలరేగటం దురదృష్టకరం. వందేమాతరం మన స్వాతంత్ర్య పోరాటంతో సన్నిహిత సంబంధం కలిగివుండి గొప్ప చారిత్రక సంప్రదాయం కలిగినట్టి గీతం. అది నిర్వివాదంగానూ విస్పష్టంగానూ భారతదేశపు ప్రధాన జాతీయ గేయం. ఈస్థానాన్ని అది నిలుపుకొని తీరాలి. ఏ యితరగీతంకూడా దాన్ని

ఆ స్థానంనుండి తొలగించలేదు. అది ఆ పోరాటంయొక్క ఉద్రేకానికి తీక్షతకు ప్రాతినిధ్యం వహిస్తుంది. కాని పర్యవసానానికి కాదు. జాతీయ గీతపు ఫణితికి సంబంధించినంతవరకు ఆ గీతంలోని మాటలకంటేకూడా ఫణితి ముఖ్యమని భావింపబడుతున్నది. ఆ ఫణితి భారతీయ సంగీతపు ప్రతిభనూ, కొంతవరకు పాశ్చాత్య సంగీతాన్నికూడా ప్రతిబింబించాలని అందువల్ల అది వాద్యములమీద బ్యాండ్‌మీద సులభంగా వాయించటానికి వీలవుతుందని విదేశాలలో వినిపించటానికి అనువుగా వుంటుందని భావించ బడింది. జాతీయగీతపు నిజమైన ప్రాముఖ్యత స్వదేశంలోకంటే విదేశా ల్లోనే ఎక్కువ. జనగణమన ఫణితి విదేశాల్లో గొప్పగా మెప్పుపొందిందని గత అనుభవం తెలుపుతున్నది. అది ఒక ప్రత్యేకతను సంతరించుకొని జీవంతోనూ లయతోనూ కూడుకొని వుంది. వందేమాతరం ఎంత ఆకర్ష ణీయమూ చారిత్రాత్మక ప్రాతిపదిక కల్గినదీ అయినప్పటికీ దాని ఫణితి విదేశాలలో వాద్యములమీద పలికించటానికి సులభంకాదనీ దానిలో తగి నంత లయలేదనీ కొందరు భావించారు. అందుచేత వందేమాతరం భారత దేశంలో విశిష్టమైన జాతీయగేయంగా కొనసాగుతూ జాతీయగీతపు ఫణితి జనగణమనదే కావాలని జనగణమనలోని పదములు ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా మార్చుకోవాలని తోస్తున్నది". [Glorious Thoughts of Nehru P. 139]

ఈ కథనం అంతటా ఆధికారిక జాతీయగీతంగా జనగణమన పేర్కొనబడుతూ వందేమాతరం ఒక జాతీయగేయంగా మాత్రమే పేర్కొనబడింది".

గీతంలోని మాటలకంటే దాని ఫణితి ముఖ్యం; జాతీయగీతం యొక్క ప్రాముఖ్యం స్వదేశంలో కంటే విదేశాల్లో ఎక్కువ; - ఈ మొదలైన కథనాలు ప్రజలను దిగ్భ్రాంతులను చేసినవి. ఇవి పత్రికల లోనూ వేదికలమీదనూ తీవ్రంగా విమర్శింపబడ్డవి. అనేక ప్రజాసంస్థలు ప్రజాభిప్రాయ సేకరణతో ముందుకు వచ్చినవి. 1948 లో అఖిల భార

తీయ విద్యార్థి పరిషత్ ఒక గాలప్‌పోల్ (ప్రజాభిప్రాయ సేకరణ) నిర్వ హించింది. అందులో పదిలక్షలమంది ప్రజలు తమ అభిప్రాయాలను వ్యక్త పరిచారు. అందులో నూటికి 95 మంది జాతీయగీతంగా వందేమాతరం స్వీకరింపబడాలనే అభిప్రాయానికి అనుకూల్యత తెలిపారు.

"వందేమాతరం జాతీయగీతంగా స్వీకరింపబడటానికి దానిలో విగ్రహారాధనతత్వం ఉంది అని అభ్యంతరం తెలుపబడినప్పుడు 'అర విందుడు' అందులో ఆరాధింపబడిన దుర్గ విజ్ఞానానికీ, శక్తికీ ఘనతకూ, కీర్తికీ ప్రతీకగావున్న భారతమాతయేగాని అన్యంకాదు" అని చెప్పారు. దాదాపు అదేకాలంలో అరవిందాశ్రమంనుంచి ప్రచురించబడిన "Mother India" వందేమాతరం సమస్యను కొంత విపులంగా చర్చించింది.

"ఒక గీతం అత్యధికంగా ప్రజాదరణ పొందిందంటేనే దానిలో బృందగానానికీ, వాద్యాలమీద పలికించటానికీ అవకాశాలున్నాయని అర్థం. సరియైన బాణి సులభంగా అమరదు (కాని అదే ఇప్పుడు చక్కగా అమ రింది). ఏదో ఒక చిన్న పాటను పచ్చి పక్షపాతబుద్ధితో సమర్థించ పూను కొని ఎంతో ప్రజాదరణ పొందిన గీతం (వందేమాతరం)లో ఏదో మౌలికమైన లోపం ఉందనీ, సరియైన బాణి లభించడం అసంభవమనీ చెప్పటం సాహసమేగాక ఒకదేశపు సంగీత పరిజ్ఞానాన్ని కించపరచడం కూడా అవుతుంది. వందేమాతరం గీతానికి అనేకమైన అత్యద్భుతమైన సంగీత ఫణితులు ఎన్నో ఇప్పటికే వున్నాయి. జాతీయగీతానికి సంబంధిం చిన వివాదంలో అందునా ఒక ప్రజాదరణ పొందిన గీతానికి సంబంధించిన విషయంలో సంగీతపరమైన ఒక చిన్నవిషయాన్ని ప్రధానాంశంగా తీసుకోకూడదు. ఆ గీతంయొక్క ప్రాముఖ్యతను, భావావేశాన్ని చారిత్రక ప్రాధాన్యతను, సమకాలీన జీవనంపై దాని ప్రభావాన్ని పరిశీలించడం ముఖ్యం.

ఆదర్శవంతమైన జాతీయగీతం ధ్యేయం ఒకకాలానికి సంబంధించిన రాజకీయ సాంఘికపరమైన వ్యక్తిజీవనాన్ని లేక ఇలాంటి వ్యక్తులతోకూడిన

ఆనాటి ప్రజల సంపూర్ణ మనోభావాలను, ఆలోచనాపద్ధతిని తెలియజేయడం మాత్రమే కాదు. ఒక జాతీయ జీవనంయొక్క యదార్థ స్వరూపాన్ని వెల్లడించాలి.

దేశం అంటే ఒక విశాల భూభాగం కానట్లే జాతిఅంటే కొందరు వ్యక్తుల సమూహంకాదు. భారతదేశాన్నిగురించి మాట్లాడుతున్నప్పుడు మన మనోనేత్రాలముందు ఒక మహిమాన్వితమూర్తి నిలబడుతుంది. ఈ మూర్తి యొక్క బాహ్యస్వరూపాన్ని మనకు దేశపటాల్లోకనపడే ప్రాదేశిక సీమలు సూచిస్తాయి. ఇచ్చట విలసిల్లిన సంస్కృతికి వారసులుగా జీవనాన్ని కొనసాగిస్తున్న వ్యక్తుల సమూహం ఈదేశపు సూక్ష్మతమమైన అంతర స్వరూపాన్ని విశదపరుస్తుంది. చైతన్యమూర్తియైన ఒకానొక మహాద్భుత శక్తి అంతర్నిహితమైన ఒక అదృశ్యదేవత ప్రేమాన్విత మాతృమూర్తి ప్రేరణచేగాక తదన్యమైన మరేభావనచేతనూ ఏదేశభక్తుడూ పోరాడి ప్రాణాలు విడిచిన ఉదంతం కానరాదు. ఈదేశంలో నివసిస్తున్న కోట్లాది ప్రజలు కలిసి జీవించడానికి కారణభూతమైన దేశమాత పిలుపు వినికూడా హృదయంలో కదలికరాని దేశభక్తుడు నయవంచకుడు, నపుంసకుడు మాత్రమే. అసంఖ్యాకమైన దేశప్రజలద్వారా వెల్లడవుతున్న ఏకాత్మ భావాన్ని పరిపూర్ణంగా ప్రతిబింబింపచేసేదే ఆదర్శవంతమైన జాతీయ గీతం అవుతుంది.

ఈ గీతంలో వెలువరించబడిన భావాలు ఇస్లాము మతానికి, క్రైస్తవానికి, యూదు, జొరాష్ట్రియన్, శిఖు, జైన, బౌద్ధ మతాలకు వ్యతిరేక భావాలు అని ఎవరైనా అభ్యంతరపెడితే వారు భారతదేశం అంటే ఏమిటో అర్థంచేసుకోలేకపోతున్నారనాలి. ఆమెయొక్క సాంస్కృతిక విలువలను పూర్తిగా దోచుకోవడానికి ప్రయత్నిస్తున్నారనాలి. యుగయుగాలనుండి భారతదేశంలో విశాల దృక్పథంతో ఆరాధింపబడుతున్న ఆత్మసౌందర్యం యావత్ప్రపంచ మన్ననలను పొందినదన్న సత్యాన్ని

ప్రతిబింబింపజేయలేని జాతీయగీతం ఆదర్శవంతమైంది కాజాలదు. అలా కాని పక్షంలో ఆమె యావచ్చరిత్ర ఒక పెద్ద సున్నా అవుతుంది.

వందేమాతరం గీతంలో ఇమిడిఉన్న మంత్రాక్షర ధ్వనుల దివ్య కంపనం, ఆశ్చర్యాన్ని గొల్పే భవ్యదర్శనం ఆ గీతానికి ఔన్నత్యం తెచ్చిపెట్టాయి. దానితో పోల్చి చూచినప్పుడు జనగణమన పేలవంగా కన్పిస్తుంది. భారతదేశపు స్వాతంత్ర్య పోరాటానికంతటికీ చైతన్యశక్తి బంకిం గీతమేకాని, ఠాగూరు గీతం కాదనటంలో ఆశ్చర్యమేంలేదు. ఆ గీతం మన దేశభక్తుల గుండెలలో ప్రజ్వరిల్లేవరకూ ప్రకంపించేవరకూ, వారి పెదవులపై ప్రార్థనగా మంత్రోచ్చారణగా నాట్యమాడేంతవరకూ మనదేశం తన గొప్పదనాన్నే గుర్తించలేని ఒక అవ్యక్తమైన అంధకార సదృశమైన స్థితిలో తడవుకొంటూ ఉంది. అంతటా ఒక అవ్యక్తస్థితి - ఎవరికీ ఏమీ పట్టనిస్థితీ, ఒక భయమూ ఆవరించి ఉన్నాయి. మన విదేశీ పరిపాలకులయొక్క భౌతిక ఆధిక్యత ఆడంబరమూ చూచి మనం భయ భ్రాంతులమైనాము. మన జాతియొక్క జీవనాడిని, మనం గుర్తించలేదు. మొట్టమొదటిసారిగా వెలువడినప్పుడు నిర్లక్ష్యం చేయబడిన గ్రంథంలోంచి వందేమాతరం సంగీతం, అస్పష్టతతో ఆందోళన చెందుతున్న జాతీయ పునర్జాగృతీకరణ చైతన్యవాయువులలో ప్రతిధ్వనించింది. నవ్వుతూ తుళ్ళుతూ పాడుతూ దేశభక్తులు పోరాడారు, సేవచేశారు. వీరమరణం పొందారు. ఆధునిక భారతీయ చరిత్రను సృష్టించిన ఏకైక నినాదమది. ఈ ఐంద్రజాలిక గీతం మనకు స్వాతంత్ర్యాన్ని తెచ్చింది. అలా మనలను సముద్ధరించిన గీతాన్ని జాతీయగీతపు స్థానంలో కాకుండా మరేస్థానంలో ఉంచినా మనకు పునర్జన్మ నిచ్చిన శక్తిపట్ల మనం అవిధేయులమై ఉండటమే అవుతుంది.

రాజ్యాంగసభ ఆమోదించక పూర్వమే మన ప్రభుత్వం జనగణమన వాడుకలోకి తెచ్చింది. ఢిల్లీనుండి వెలువడిన ఒక ప్రముఖ ఆంగ్ల వారపత్రిక జనులందరియొక్క మానసిక వేదనను యిలా వ్యక్తీకరించింది. 'రాజ్యాంగ

వల జాతీయగీతంవిషయంలో ఇంకా తుదినిర్ణయం చేయకుండానే జనగణమన జాతీయగీతంగా తీసుకొనబడింది. ప్రజాప్రతినిధులైన పాలకులు ప్రజల మనోభీష్టాన్నీ కాలరాచి వికృతమైన ఆనందాన్ని పొందినట్లే కనబడుతుంది. 'వందేమాతరం' అనే యీరెండు చిన్నపదాలయొక్క అద్భుత చరిత్ర పండిత నెహ్రూకు, ఆయన మంత్రివర్గానికి తెలియదని అనుకోనక్కర లేదు. వీళ్ళేకాదు, ఈ మాతృభూమిలో జీవించిన వేలాది దేశభక్తుల జీవన లక్ష్యం వందేమాతరం అనే బీజాక్షరాలలో ఇమిడి ఉంది.

అయితే యేం? బ్యాండుమేళానికి అవి ఎంతమాత్రము తగవని నెహ్రూగారంటారు. తమ వాదాన్ని గట్టిపరుచుకునేందుకు లండన్ వాద్యబృందాలుకూడా వాద్యాలపై వానిని పలికించే విషయంలో అనుకూల అభిప్రాయాన్నివ్వలేదంటారు. చివరకు జాతీయగీత నిర్ణయం బ్యాండువాళ్ళ చేతిలోపడింది. ఔరా అంతర్జాతీయగాయకులు మెచ్చని జాతీయగీతాన్ని కలిగిఉండేందుకు మనం సహించటమా? ఇకపోతే జనగణమన దాని జాతీయ భావావేశంవల్లగాక అనేక విధాలైన మేళాలను అనుకూలంగా ఉండటం వల్ల అతికినట్లు సరిపోయింది,

జాతీయగీతంగా వందేమాతరం ఉండాలన్న విషయం సంఘాలుగాని ఉపసంఘాలుగాని ఆమాటకొస్తే ప్రభుత్వాలుగాని నిర్ణయించలేదు. ఈనాడు మనం మర్చిపోయిఉండవచ్చు. కాని వీరావేశంతో ప్రాణాలర్పించి అమరులైన వీరుల త్యాగాలే వందేమాతరానికి ఆ అర్హతను సంపాదించి పెట్టాయి. జాతీయగీతమనేది తాత్కాలిక ప్రభుత్వంవలె ఒక వినిమయ వస్తువుకాదు. అలాంటప్పుడు రాజ్యాంగసభయొక్క తుదినిర్ణయం ఇంకా రాకముందే యీ ప్రభుత్వాన్ని ఇలాంటి నిరంకుశనిర్ణయం తీసుకోమని ఎవరు చెప్పారు? అలా చేసేందుకు వీరికిగల నైతిక హక్కేమిటి?

ఈ నిర్ణయంద్వారా మనకు అంటే ప్రజలకు ఈ ప్రభుత్వం ప్రాతినిధ్యం వహించటం లేదన్న సంగతి స్పష్టంగా ఋజువైపోయింది.

అందుచేత మేము వందేమాతరమును తిరిగి దానియొక్క సముచిత గౌరవ స్థానంలో నిలుప వలసిందిగా రాజ్యాంగసభకు విజ్ఞప్తిచేస్తున్నాం. ఒకవేళ వందేమాతరం స్థానంలో జనగణమన ఖాయపరచబడినట్లయితే మన 'వందే మాతరం' అనగా 'తల్లికి నమస్కరిస్తున్నాను' అనే హక్కును కోల్పోతున్నాము అన్నమాట. అంతేగాక నమాధిపై జనగణమన అనేమాటలతో వందేమాతరాన్ని జీవ సమాధి చేసినట్లుగా భావించాలి. అంటే ఆసమాధి 'జనగణమన' (ప్రజల అభీష్టం)కే కాదా? (Organiser 28-12-1948)

ఈ విషయాన్ని స్పృశిస్తూ సుప్రసిద్ధరచయితలెందరో వ్రాశారు. 'జాతీయగీతానికి సంబంధించిన సమస్య ఇంచుమించు భావావేశానికి సంబంధించినది. త్రివర్ణపతాకానికి ప్రజల హృదయంలో ఎటువంటి స్థానమున్నదో వందేమాతరగీతానికికూడా అటువంటి స్థానమేఉన్నది. ఈ రెంటికీగల భేదం ఏమంటే త్రివర్ణపతాకం మహమ్మదీయుల రంగుకూడా ఉండేటట్లు రూపొందించబడింది. ఇక ఈ యీగీతంలో మహమ్మదీయుల భాషలేదు. వారు వందే మాతరం గీతాన్నిమాత్రం త్రోసిపుచ్చారు.

ఈ మొత్తం సమస్యను హిందువులు వేరొక దృక్కోణంలోంచి చూస్తారు. ఈగీతం ప్రజల మనస్సులలో దేశభక్తి ఆవేశాన్ని రగుల్కొల్పే ఉద్దేశంతో రచింపబడింది. 1903 నుండి 1943 వరకూ 40 సంవత్సరాలు యువకులు తమ సమస్తాన్నీ దేశమాతముందు త్యాగం చేయడానికి పురికొల్పటంలో ప్రముఖపాత్ర వహించింది ఈ గీతం.

ఇక జనగణమన మహాకవియైన రవీంద్రనాథ్ టాగూర్‌చే వ్రాయబడింది. కాని అది వ్రాయబడిన సందర్భమేదో తెలిసినవారి హృదయాలలో అది అసంతృప్తిని నింపుతుంది. భారత ప్రజల హృదయాలలో దేశభక్తిని రగుల్కొల్పటానికి వ్రాయబడిందికాదు. వాస్తవానికది ఒక కృతజ్ఞతాపూర్ణమైన బెంగాలీ హృదయం ఐదవ జార్జి చక్రవర్తి పాదాల ముందు సమర్పించిన కృతజ్ఞతాంజలి.

జనగణమన చరిత్ర ఎంతమాత్రమూ ఉత్సాహజనకం కాదు. అది జాతీయగీతంగా ప్రజల మనస్సులలో ఎటువంటి ఉత్సాహోద్రేకాలనూ కలిగించజాలదు. త్వరలోనే అది శుష్కమూ, యాంత్రికమూ అయిపోతుంది. నెహ్రూ పండితుడు దానిని బలపరుస్తున్నట్టు కనిపిస్తున్నది. అందుకు ఆయన చెప్పేవాదం దాని 'లయ, ఫణితి'. కేంద్ర శాసనసభలో ఒకప్రశ్నకు ఆయన సమాధానం చెపుతూ, వాషింగ్టనులోని భారత రాయబారి అంతర్జాతీయ శ్రోతలకు దానిని వినిపించినప్పుడు అందరు దానిని పసందుచేశారని చెప్పారు. ఆ గీతాన్ని విన్నవారందరూ సంతోషించే విధంగా ఒక ఫణితిని ఆయన ఏర్పాటు చేయించారు. అలాంటి ఏర్పాటేదీ 'వందేమాతరమ్'కు సమకూర్చలేదు.

'వందేమాతరమ్'కు సంగీతాన్ని సమకూర్చటం సాధ్యం కాదనేది ఇంకా ఋజువుకాలేదు. రాజ్యాంగసభ ఏగీతంయొక్క సంగీతం ఇంపుగా వుంటుందో తెలిసికోటానికి పండిత నెహ్రూను నియోగించలేదు. ఆయన తనంతటతానుగానే ఆపనిచేశాడు అదికూడా ఒకగీతానికే, పైగా వాషింగ్టన్‌లో కూర్చునిఉన్నా విదేశీయుల అభిప్రాయములను అనుసరించి మనం జాతీయ గీతాన్ని ఎంపిక చేయలేం. జాతీయగీతం విదేశీయుల వీనులకు విందుగూర్చ దానికి ఉద్దేశింపబడిందికాదు. మనయువకులమనస్సులలో ఏగీతం. ఏ ఫణితి దేశభక్తిభావాలను ప్రేరేపిస్తాయో చూడాలి. ఈ దేశపరిస్థితులను ఆకళింపు చేసుకొనేవ్యక్తి ప్రధానిగా ఉండాలనేది మనందరి అభిప్రాయమైతే నెహ్రూ పండితుని చూపులుమాత్రం ఎప్పుడూ సముద్రాలకవతల తచ్చాడుతూ ఉంటాయి. అదే ఆయనతో వచ్చిన చిక్కు.

'ఒక్క విషయం మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చు. జాతీయగీతం కేవలం సంగీత ఫణితికాదు. అంతకంటె ఎక్కువైంది, అది జాతియొక్క ఆత్మ, రాజ్యముయొక్క సారము, జాతీయ సంప్రదాయాలకు దర్పణమూ, జాతి భవిష్యత్తును చాటిచెప్పేదిగాఉండాలి. 'జనగణమన' యొక్క సంగీత ఫణితి ఎంత ఇంపుగావున్నా, అది జాతియొక్క అనూచాన సంప్రదాయాలకు

గాని భవిష్యత్తులోని కోర్కెలకుగాని ప్రాతినిథ్యం వహించదు. ఈషరతు లన్నింటినీ 'వందేమాతరమ్' పూర్తిగా సంతృప్తి పరుస్తుంది. సరియైన సాంకేతిక సహాయాన్ని తీసుకుంటే ఇప్పుడున్నదానికంటె మధురమైన సంగీత బాణిని సమకూర్చటం సాధ్యమౌతుంది. (The First year of Congress Rule, Guru Datt, P. 70-74)

కాని ప్రభుత్వం 'వందేమాతరమ్' కు సంగీతాన్ని సమకూర్చేందుకు గల అవకాశాలను కనుగొనే ప్రయత్నంచేయలేదు. అందువల్ల సహజంగానే ప్రజలకుగల భయసందేహాలు అధికమైనాయి. అధికారంలో ఉన్నవారికి 'వందేమాతరమ్'కు బహిరంగంగా త్రిలోదకాలివ్వటం సాధ్యంకాదనితెలుసు. అందుచేత రాజ్యాంగసభ కావాలనే జాతీయగీతం విషయంలో నిర్ణయాన్ని వాయిదా వేస్తుందని ఈలోపల దొడ్డిదారిని "జనగణమన" ను జాతీయ గీతంగా చెలామణి చేయచూస్తున్నారని ప్రజలు అనుమానించారు.



# 13. భగీరథ యత్నం

నెహ్రూ పండితునకు 'వందేమాతరమ్' సంగీత వాద్యములపై పలికించుటకు అనుకూలం కాదనే అభిప్రాయం ఉండేది. తన వాదాన్ని సమర్థించుకుంటూ ఆయన ఇంగ్లండులోని వాద్య నిపుణుల అభిప్రాయాన్ని ఉదహరించాడు. ఇతరయోగ్యతలు ఇంకెన్ని ఉన్నప్పటికిన్నీ – ఈ ఒక్క కారణంచేత – ఆ గీతం జాతీయగీతంగా తగదని తలంచబడింది. ఇది భారతీయ సంగీతానికి ఒక కళంకాన్ని ఆపాదించటమే అవుతుంది, ఈ మచ్చను మాపుకోటానికి దేశభక్తులైన కొందరు సంగీత విద్వాంసులు ఈ సవాలును ఎదుర్కొన్నారు.

"వందేమాతరం" ను సంగీతవాద్యములపై పలికింపటానికి తగిన 'బాణి' లేదనికాదు. మాస్టర్ కృష్ణారావు రామచంద్రపులాంబికర్ దీనికి చక్కని బాణీ సమకూర్చారు. ఆయన 'పూనా' నివాసి. 'మాస్టర్ కృష్ణ అనే పేరుతో ప్రసిద్ధులు. వందేమాతరమ్‌కు తగిన సంగీతాన్ని సమకూర్చటానికి, ఆయన చేసిన కృషి లోకానికి తెలియదు. ఇటీవల బెంగుళూరులో "రాష్ట్రోత్థాన సాహిత్య" పక్షాన సంగీత శాస్త్రంలో ప్రమాణభూతుడైన బాపూరావుదాత్యా, పులాంబ్రికర్‌ను కలుసుకొని మాట్లాడారు. వారిసంభాషణ 7-4-1968న రికార్డుచేయబడింది. పులాంబ్రికర్ ఈ వయస్సులో (ఆయన

వయస్సు 72 సంవత్సరాలు) తనకు తేదీలు సరిగా గుర్తులేవని చెప్పినప్పటికీ వారి సంభాషణ యీ సమస్యపై ఎంతో ఆసక్తికరమైన సమాచారం అందిస్తున్నది.

మాస్టర్ కృష్ణ ప్రభాత్ ఫిలిమ్స్‌లో చాల సంవత్సరాలు సంగీత దర్శకులుగా ఉన్నారు. దేశభక్తుడు కావటంచేత ఆయనకు సహజంగానే 'వందేమాతరం'పై ఎంతో ప్రేమ ఉంది. బాలుడుగా ఆయన ఆ గీతాన్ని విన్నాడు. కాపీ, దేశ్ మొదలైన ఎన్నోరాగాలలో దాన్ని పాడాడు. బాలురు, వృద్ధులు అందరూ కలిసి సమష్టిగా సులభంగా ఆ గీతాన్ని పాడేటందుకు వీలుగా దానికొక 'బాణీ' సమకూర్చాలని ఆయన కోరిక. 1937-38 ప్రాంతాలలో ఆయన యీ పనికి పూనుకున్నాడు. ఆయన రాత్రి చాల ప్రొద్దుపోయేవరకు తనగదిలో కూర్చొని ఆ గీతాన్ని పాడుకుంటుండేవాడు. ఒకనాటి రాత్రి ఆయనకు కావలసినరాగం అకస్మాత్తుగా స్ఫురించింది. ఆయనకు సరస్వతీదేవియే స్వయంగా పాడి వినిపించినట్లనిపించింది. మరునాటి ఉదయం ఆయన సినిమా నిర్మాత 'వి. శాంతారాం'కు కబురుచేసి దానిని రికార్డు చేయించాడు. శాంతారాం, ప్రభాత్ ఫిలిమ్స్‌వారు దానినెంతో మెచ్చుకున్నారు.

కృష్ణారావు ఆనందానికి అవధులు లేవు! ఆయన శంకరరావుదేవ్, బాలాసాహెబ్ ఖేర్, అచ్యుతరావు పట్వర్ధన్, కేశవరావు జేథే, యన్. వి. గాడ్గిల్ మొదలైన ప్రముఖ మహారాష్ట్ర నాయకులవద్దకు వెళ్ళి 'వందేమాతరమ్' పాడి వినిపించాడు. ఆయన పాడిన రాగానికి పేరు లేదు. ఒక ప్రశ్నకు సమాధానమిస్తూ ఆయన దానిని 'రాష్ట్రీయరాగం' అన్నాడు.

బృందగానానికి వీలైన ఆరాగం ఆయనకెంతో సంతోషాన్ని కలిగించింది. ఇక ఆయన మనస్సు మిలటరీ కవాతుకు అనువైన బాణీని కనిపెట్టటంపై కేంద్రీకృతమైంది. పోలీసువారివద్ద ఆయన కవాతు లయలు నేర్చుకున్నాడు. దాదాపు 30, 40 రోజులు పోలీసు మైదానానికి వెళ్ళి

వారు కవాతు చేసేటప్పుడు వారి అడుగులు గమనించాడు. వారితోపాటు తానూ అడుగులువేస్తూ 'వందేమాతరం' పాడాడు. తక్కువ వేగంతో కవాతు జరిగేటప్పుడు బాణీ సరిగా సరిపోయింది. దానిని ప్రభాత్ ఫిలిమ్స్ చేత రికార్డు చేయించి, మళ్ళీ నాయకులకు వినిపించాడు. వారు ముగ్ధులై రాగం సులభంగాను, చెవికింపుగాను ఉన్నదన్నారు.

ఒక సుప్రసిద్ధ గాయకుడు 'వందేమాతరమ్'కు సంగీతాన్ని సమకూర్చేందుకు చేసిన యీకృషి జాతియొక్క అంతరాంతరాలలో నిబిడీకృతమై ఉన్న కోర్కెను సఫలీకృతం చేయటమే! 'వందేమాతరమ్'ను జాతీయగీతంగా పొందాలనే ప్రజలందరియొక్క బలవత్తరమైన నిర్నిరోధమైన కోర్కెకిది వ్యక్తీకరణం!

ఈ విజయంతో కృష్ణారావు ఉప్పొంగిపోయినాడు. తాను కనిపెట్టిన రాగం మహారాష్ట్ర సరిహద్దులనుదాటి, దూరానఉన్న ఢిల్లీని చేరాలని ఆయన తహతహలాడాడు. ఆయన ఆ గీతాన్ని, దాని వాద్యసంగీత బాణీని 'హిజ్‌మాష్టర్స్ వాయిస్'లో విడివిడిగా రికార్డు చేయించాడు. పత్రికలవారు 'వందేమాతరమ్'తో కృష్ణారావు పేరు జాపించడం ప్రారంభించారు. ప్రజలు ఆయనను 'వందేమాతరం కృష్ణారావు' అని పిలువసాగారు. "వందేమాతరంను తామగూడ పాడగలిగినంత సులభం చేసినందుకు నాభార్య నన్ను అభినందించింది" అని కృష్ణారావు అప్పటి సంగతులను జ్ఞాపకం చేసుకుంటూ అన్నారు.

సుప్రసిద్ధగాయకుడైన కృష్ణారావు "ఆల్ ఇండియా రేడియో"లో ఆ గీతం పాడడానికి ఎంతో శ్రమపడ్డారు. ఎ. ఐ. ఆర్, లో వందేమాతరం పాడాలనుకున్నాడు. ఆయన అధికారులకు వ్రాశాడుగాని అనుమతి లభించలేదు. ఆయన అప్పుడు డైరెక్టరు బుఖారీకి ఇలా వ్రాశాడు. 'ఎ.ఐ.ఆర్ లో 'సారే జహాఁసే అచ్ఛా' వినిపిస్తున్నారు. అలాంటప్పుడు వందేమాతరం ఎందుకు వినిపించరాదు? నిగూఢమైన సమాధానం వచ్చింది. "వీలులేదు"

అని. మరాఠీ సాహిత్యసామ్రాట్టు 'కేసరి' పత్రిక సంపాదకుడు అయిన ఎన్. సి. కేల్కర్ ఆయన తరఫున మధ్యవర్తిత్వం చేశాడుగాని ఫలితంలేక పోయింది.

కృష్ణారావు అంత సులభంగా వదిలిపెట్టేవాడు కాడు. ఆయన తన ఎ. ఐ. ఆర్ కార్యక్రమాలలో ఒకదానియందు సజల నతల జనరజ' అనే గీతాన్ని ఎన్నిక చేసుకున్నాడు. దానిరాగం వందేమాతరం రాగం వలెనే ఉంటుంది. హార్మోనియం వాయించే హరిదేశపాండేకు ఆ గీతం తరువాత వందేమాతరం పాడుతానని ఆయన సూచించాడు. ఆయన వందేమాతరం మొదలుపెట్టగానే బుఖారీయే స్వయంగా మైకు స్విచ్ తీసివేశాడు. ఆ సందర్భాన్ని పురస్కరించుకొని కృష్ణారావు ఇలాఅన్నాడు. 'ఇంతకుముందు నాకార్యక్రమాల కెన్నింటికో ఆయన వచ్చాడు. ఆయన పెద్దమనిషి అను కున్నాను. ఇలా ప్రవర్తిస్తాడని నేనెప్పుడూ అనుకోలేదు. ఎ. ఐ. ఆర్ మీద నన్ను వందేమాతరం పాడనిచ్చేవరకు ఎ. ఐ. ఆర్ ను బహిష్కరించాలని నేను నిర్ణయించుకున్నాను. వాస్తవానికి ఎ. ఐ. ఆర్ వల్ల నాకు కొంత రాబడివున్నది. ఎ. ఐ. ఆర్ ను బహిష్కరించడంద్వారా నేనుకూడా కొంత త్యాగాన్ని చేశాననేభావం నాకు తృప్తినిచ్చింది."

కృష్ణారావు ఈవిషయమై జి.వి. మౌలంకర్‌కు వ్రాశాడు. కౌన్సిల్‌లో వందేమాతరంకు జరిగిన అన్యాయాన్ని గూర్చిన ప్రస్తావన తెచ్చేందుకు నారీమన్ ప్రయత్నించాడు. పూనానుంచి వెలువడే 'త్రికాల్' పత్రిక ఇలావ్రాసింది: 'వందేమాతరం అణచివేయబడుతున్నది. ఇది మాస్టర్ కృష్ణారావుకొక అవమానం. ఆపత్రిక ప్రతి కృష్ణారావువద్ద ఇంకా భద్రంగా ఉన్నది.

ఇంతటితోనిరుత్సాహపడక కృష్ణారావు తనకృషిని కొనసాగించాడు. ఆయన ఇలా చెప్పారు : "నేను రేడియోలో వందేమాతరంను పాడాలనే నా వాంఛను తెలియజేస్తూ మౌలంకర్‌కు మళ్ళీవ్రాశాను. ఆయన ఆ లేఖను

సర్దార్ పటేల్‌కు పంపారు. తరువాత 1947 ఉగాది సందర్భంలో రేడియోలో 'వందేమాతరమ్' పాడవలందిగా ఎ.ఐ.ఆర్ నుంచి నాకు ఆహ్వానం వచ్చింది. ఆసమయంలో నేను జాట్ మహారాజాగారి ఆతిథ్యాన్ని పొందు తున్నాను. ముందుగా ఆయనే ఆ ఉత్తరాన్ని చూచారు. నాతో ఇలా అన్నారు: "మాష్టర్ నీవునాకు 'మిఠాయి తినిపించాలి". నాకేమీ సంతానం కలుగలేదుకదా! అని అడిగాను. ఇది అంతకంటె పెద్దవార్త!' అంటూ ఆ ఉత్తరాన్ని నాకు అందించారు. ఆయనే ఇరవై ఐదురూపాయలకుమిఠాయి తెప్పించారు.

వందేమాతరం పాడడానికి మాష్టర్ కృష్ణారావు ఎ. ఐ. ఆర్. స్టూడియోకు వెళ్ళినప్పుడు, అప్పటికింకా బుఖారీయే డైరెక్టరుగా ఉన్నాడు. "చివరకు మీరే గెల్చారు" అన్నాడాయన.

బ్రిటిషువారు మనదేశాన్ని వదిలి వెళ్ళినతర్వాత 'టైమ్స్ ఆఫ్ ఇండియా', ఇతర పత్రికలు 'వందేమాతరమ్'ను జాతీయగీతం చేయవలసిందని కోరుతూ వ్రాసాయి. అప్పుడు మాష్టర్ కృష్ణారావు తన స్నేహితుడైన బాలాసాహెబ్ సవాదేవద్ద ఖాందేడ్‌లోని 'సవర'లో ఉన్నారు. సవాదే కృష్ణారావుకు ఆ వ్యాసాలను చూపించి "మాష్టర్జీ! ఇప్పుడు మీరు ముందుకువచ్చి ప్రయత్నించాలి" అన్నాడు. తరువాత ఏమి జరిగిందీ కృష్ణారావు యిలా చెప్పారు :

"అది సరియైన సమయమనీ, నాఅంతట నేనే ఢిల్లీకి వెళ్ళాలనీ నిశ్చయించుకున్నాను. నేను 'వందేమాతరమ్'కు సంగీత బాణీ సమకూర్చాననీ అందుచేత జాతీయగీతాన్నిగూర్చి నిర్ణయించేముందు నాతోకూడా సంప్రదించవలసిందనీ కోరుతూ నెహ్రూగారికి టెలిగ్రాం ఇచ్చాను. తరువాతి ఆదివారంనాడు న్యూఢిల్లీలో తనను చూడవలసిందిగా ఆ మరునాడే

నెహ్రూగారివద్దనుంచి నాకు టెలిగ్రాం వచ్చింది. నేను వెంటనే పూనావెళ్ళి, ఢిల్లీ రైలెక్కాను. నెహ్రూజీని కలుసుకొని వందేమాతరమ్ వినిపించాను. ఆయన "ఇది మిలటరీ బ్యాండుకు సరిపోతుందో లేదో చూడా"లన్నారు. నేను "ఇది సరిపోతుంది. కావాలంటే ప్రయత్నిద్దాం" అన్నాను. అప్పుడు అక్కడనేవున్న జనరల్ కరియప్ప "మంచిది. దానికి ఏర్పాటుచేద్దాం" అన్నారు. ఆయన మిలటరీ బ్యాండువారికి తగిన ఆదేశాలనుపంపి, మిలటరీ బ్యాండు ముఖ్యాధికారి లజపత్‌సింగ్ వద్దకు నన్ను పంపారు. మిలటరీ బ్యాండుమీద యీ బాణీని పలికించిచూచి వారు 'ఇదిబాగా సరిపోయిం'దని సిఫారసు చేశారు. వందేమాతరం వాద్యసంగీతానికి పనికిరాదనే విమర్శకులకు ఇది గొంతులో పచ్చివెలగ అయింది. నేను గవర్నరు జనరల్ సి. రాజగోపాలాచారికిది పాడి వినిపించాను. మహావీర్ త్యాగి, సర్దార్ పటేల్, మవ్‌లంకర్, సత్యనారాయణసిన్హా, తదితరులవద్దకూడా ఇది పాడి వినిపించాను. వారందరికీ ఇది నచ్చింది. నేను బాబూ రాజేంద్రప్రసాద్‌గారివద్దకు వెళ్ళి, 'ఇది మన జాతీయగీతం. దీన్నిపాడే కంఠం మధురంగాను, హుందాగాను ఉండాలి. అది భక్తి గౌరవాలను ప్రేరేపించాలి' అన్నాను. తగిన తాళంతో నేనుపాడాను. ఆయనసంతోషించి చిరునవ్వునవ్వుతూ, 'అద్భుతం! దీన్ని ఇంత మనోహరంగా ఎక్కడచేశావు?' అన్నారు. నేను పూనాలో ఒక నెల కవాతు చేశాననిచెప్పి, 'మీకు ఇది నచ్చిందా ?' అనిఅడిగాను. ఆయన అందుకెంతమాత్రమూ సందేహంలేదన్నారు. నేను ఆవిధంగా ప్రముఖవ్యక్తులందరి ఎదుట రాత్రింబవళ్ళూ వందేమాతరం పాడుతూ ఢిల్లీలో పదిరోజులు గడిపాను. అప్పుడునాకు 'బోసు' అనే బెంగాలీ మిత్రుడు చాలా సహాయపడ్డాడు. అతడు 'బెంగాల్‌లో మేమూ పాడుతాం కాని అందులో రాగాలాపన ఎక్కువ; అందుచేత అది బృందగానానికి కష్టమౌతున్నది. మీరుదీన్ని చాలా సులభంచేశారు" అన్నాడు.

మాష్టర్ కృష్ణారావుగారి ఆందోళన కొంత ఉపశమించింది. ఆయన పూనాకు తిరిగివచ్చారు. కాని ఆ ఉపశాంతి ఎక్కువకాలం నిలువలేదు. బ్రిటిషు నిపుణులు ఆమోదిస్తేనేగాని ఢిల్లీలోని నాయకులు 'వందేమాతరం'ను

స్వీకరించరని తెలియవచ్చింది. పైగా వారు దాన్ని 'మిలటరీ బ్యాండు'చేత 'రికార్డు' చేయించలేదు. అందుచేత మాష్టరు కృష్ణారావు వెంటనే మళ్ళీ ఢిల్లీ వెళ్ళాడు. మహావీర్‌త్యాగీ యీయనపట్ల ఆసక్తి చూపించి బాబూ రాజేంద్రప్రసాద్‌వద్దకు తీసికొని వెళ్ళాడు. కృష్ణారావు వందే మాతరం గీతాన్ని మిలటరీ బ్యాండుచేత రికార్డు చేయించేందుకు ఏర్పాటు చేయించవలసిందని ఆయనను అభ్యర్థించాడు. "ప్రస్తుతం ఇక్కడ అది కొంత కష్టమౌతుం"దంటూ ఆయన "నీవు బొంబాయిలో ప్రయత్నించ రాదా ?" అన్నాడు.

"నేను ప్రయత్నిస్తాను. నాకేమైనా చిక్కులేర్పడితే మీకు టెలి గ్రాం పంపుతాను. బొంబాయి ప్రభుత్వంవారికి మీరొకమాట చెప్పి నాకు సహాయం చేయండి" అని కోరాను. రాజేంద్రప్రసాద్ అంగీకరించారు.

కృష్ణారావు బొంబాయి వచ్చాడు. అక్కడ బ్రిటిష బ్యాండు కమాం డరు 'సి. ఆర్. గోర్డన్', కృష్ణారావు ఆయనను ఇంటివద్ద కలిసికొని తన కోర్కెను తెలిపాడు. ఆయన "డ్యూటీలో ఉండగా ఇది సాధ్యంకాదు. పదిరోజులు సెలవు దొరికితే మీరుకోరిన పని చేయగలను. మీరుకూడా నాకు ప్రయత్నించి, నాకు సెలవు దొరికేందుకు సాయపడండి" అన్నాడు. కృష్ణారావు ఆయా అధికారులను కలిసికొని సి. ఆర్. గోర్డన్‌కు సెలవు మంజూరు చేయగోరాడు. వారు "మీరు మంచిపని చేస్తున్నారు. సెలవు ఎందుకివ్వమూ ?" అంటూ సంతోషంతో అంగీకరించారు.

కృష్ణారావు, గోర్డను అభ్యాసం సాగించారు. వందేమాతరం బ్రిటిష బ్యాండు సంగీతానికి బాగా సరిపోయింది. గోర్డను పదవీవిరమణ చేశాడు. ఆయనపై కృష్ణారావు ప్రభావం ఎంతగా ఉందంటే ఆయన ఇంగ్లాండులో కూడా 'వందేమాతరం'పై ఆసక్తి చూపసాగాడు. ఆయన కృష్ణారావుకు ఒక లేఖ వ్రాశాడు. ఆలేఖ ఇంకా కృష్ణారావువద్ద ఉంది. ఆలేఖలో ఇలా ఉంది : "నేను ఇక్కడకూడా బ్యాండుపై వందేమాతరం బాణీని ప్రయ

త్నించాను. అది అందంగా పొందికగా ఉంది. జనగణమనలో లేని ఒక హుందాతనం వందేమాతరంలో ఉంది". కృష్ణారావు బ్రిటిషు బ్యాండు బాజీలో వందేమాతరం రికార్డు చేయించి నెహ్రూగారికి ఒక టెలిగ్రాం పంపాడు. వందేమాతరం బ్రిటిషు బ్యాండు బాజీలో పాడటానికి వీలౌతుం దని స్వయంగా మీముందు ప్రదర్శించేందుకు దయచేసి అవకాశం ఇవ్వండి'' అని.

నెహ్రూగారు తనను కలుసుకునేందుకు సమయం నిర్ణయిస్తూ తంతి పంపాడు. కాని కృష్ణారావు నెహ్రూను చూడటానికి వెళ్ళినప్పుడు ఆయనకు ప్రవేశం లభించలేదు. ఆయన అంతరంగిక కార్యదర్శి జాన్‌మత్తయ్ "నెహ్రూగారికి తీరికలేదు. ఆయనను కలుసుకోవటానికిప్పుడు వీలుకాదు" అని కాస్త కటువుగా చెప్పాడు. ఆవిషయమై కృష్ణారావు ఇలా అంటారు. "నేను చాలా చింతించాను. తనను కలుసుకోవలసిన సమయం నిర్ణయిస్తూ నెహ్రూగారు పంపిన టెలిగ్రాం ఉంది. నేను పూనానుంచి వచ్చాను. మత్తయి నన్ను లోనికి పోనివ్వడు. ఎంత కాలం వ్యర్థమౌతున్నది?" కృష్ణారావు సాధుస్వభావం గలవాడు. పరుషవాక్కులు పలుకలేడు. ఆయన ఎంతో ఓర్పుతో గంటసేపు ఆశతో వేచివున్నాడు. అప్పుడు అటువెళ్తున్న యస్.కె.పాటిల్ ఆయననుచూచి "హలో మాష్టర్జీ! ఏంపనిమీద వచ్చారు?" అని అడిగాడు. కృష్ణారావు నెహ్రూ పంపిన టెలిగ్రాం ఆయనకు చూపించాడు. "మరి నెహ్రూగారిని కలుసుకున్నారా?" అని పాటిల్ అడిగాడు. "లేదండీ! "గంటసేపటినుంచి ఇక్కడ వేచిఉన్నాను" అన్నాడాయన. అప్పుడా టెలిగ్రాం నెహ్రూగారివద్దకు పంపగా ఆయిన తనను రాత్రిగం 8-30 కు ఇంటివద్ద కలుసుకోవలసిందిగా చీటీ పంపారు.

"నిర్ణీతసమయానికి నేను నెహ్రూగారి నివాసానికి వెళ్ళాను. ఆయన బయటకువచ్చి సాదరంగా నన్ను లోనికి తీసుకుపోయినారు. అప్పుడక్కడ షేక్ అబ్దుల్లా, బక్షీగులాం అహ్మద్‌గూడాఉన్నారు. నేను నా కృషిఫలితాన్ని

వారికి వివరించాను. పండిట్జీ "చాలా బాగుంది" అన్నారు. సత్యన్నారాయణ సిన్హా "రేపు సాయంత్రం మీరు పార్లమెంటుభవనానికి రండి. గం 5-30కు రాజ్యాంగసభ సభ్యులముందు ఇది వినిపించండి" అన్నారు. మరునాడు నేను దీని సంగీత స్వరకల్పనను హిందీలో అచ్చువేయించి సభ్యులకు పంచిపెట్టించాను. సాయంత్రం గం 5-00 లకు నేను ప్రేక్షక విభాగంలో నాలుగవ వరుసలో కూర్చున్నాను. నాతో నాభార్యకూడాఉంది. పంజాబు రావు దేశ్ ముఖ్, హెచ్. వి. కామత్, మణిబెన్ పటేల్ మొదలైనవారు నాచుట్టూ ఉన్నారు. నెహ్రూరాగానే, నేను అక్కడ ఉన్నట్లు ఆయన గమనించేందుకుగాను. లేచినిలబడి ఆయనకు నమస్కరించాను. బాలకృష్ణశర్మ నన్ను సభ్యులకు పరిచయంచేశాడు. రెండునిమిషాలైనతర్వాత నెహ్రూ నన్ను పిలిచారు. నేను వేదికమీదకివెళ్ళి, "నేను రాజకీయ వేత్తనుగాని, వక్తనుగాని, రచయితనుగానికాను, నేనుకేవలం ఒక గీత దర్శకుణ్ణి, నేను వందేమాతరం రాగాన్నిగూర్చి చెప్పేందుకు మీముందు ఉన్నాను" అన్నాను.

నేను వందేమాతరం పాడాను. దానిని రికార్డు చేశారు, ఇదంతా సుమారు ఒక అరగంటపట్టింది. సభ్యులు ఆనందపరవశులై చాలాసేపు హర్షధ్వానాలు చేశారు. నెహ్రూ, రంగా మున్నగువారు 'జనగణమన' ను గూర్చి నా అభిప్రాయం అడిగారు. రేడియోలో హెర్బర్టుమూలే యొక్క జనగణమన రికార్డు విన్నాను, నాకు నచ్చలేదు. నేను ఏమిచెప్పాలి? "జనగణమనలో కొఱవడ్డ ఒక హుందాతనం వందేమాతరంలో ఉంది" అనే బ్రిటిషు బ్యాండు కమాండర్ గోర్డను అభిప్రాయాన్ని ఉటంకించాను. ఒక బెంగాలీ సభ్యుడు ఆశ్చర్యంతో "ఒక ఇంగ్లీషువాడు అలా ఇన్నాడా? అని నన్ను అడిగాడు. నేను "అవును. ఆయన అలాగే అన్నాడు". 'నాకుకూడా ఒక అభిప్రాయం ఉంది. కాని అది మీకు సంతోషాన్ని కలిగించదు" అన్నాను.

వందేమాతరం నిర్వివాదంగా మన జాతీయగీతం కావాలని నాకోరిక, దానికి తగిన రాగాన్ని, తాళాన్ని సమకూర్చేందుకు సంవత్సరాలతరబడి గట్టికృషి చేశాను, కాని దానిని జాతీయగీతంగా చెయ్యటమనేది నాశక్తికి మించినపని. అందుకు నేను ఒత్తిడి చెయ్యలేక పోయినాను. నేను సభ్యులతో ఇలా అన్నాను. "వందేమాతరంలో మాతృభావన ఉంది. జనగణమనలో పితృభావన ఉంది. మాతృభావన గొప్పదిగదా!" అందరూ హాయిగా నవ్వారు. తర్వాత వాద్యబృందం వందేమాతరం వాయించింది. నెహ్రూ నావద్దకువచ్చి నాభుజంమీద చెయ్యివేసి 'నీవు చాలా గొప్పపనిచేశావు నీవు భారతీయ గాయకులలో చాలా గొప్పవాడవు" అన్నాడు. బాబూసాహెబ్ గుప్తే "మనం వందేమాతరంకు కూడా జాతీయగీతపు ప్రపత్తి ఇద్దాం" అన్నాడు, నెహ్రూ 'సమాన ప్రతిపత్తి' అన్నాడు. కాకాసాహెబ్ గాడ్గిల్ 'నీపాటతో పార్లమెంటుభవనం పవిత్రమైంది' అన్నాడు, అనంతశయనం అయ్యగార్ నాభార్యతో 'నీ భర్త శుభకరమైన ప్రారంభంచేశాడు, ఆ సంగీతానికి అందరూ ఆనందించారు" అన్నాడు.

ఆ రోజుల్లో 'దిలీప్ కుమార్‌రాయ్' అనే మరొక సమర్థుడైన భారతీయగాయకుడుకూడవందేమాతరం జాతీయగీతంగా ప్రతిష్ఠింపబడేందుకు శక్తివంచన లేకుండా కృషిచేశాడు, ఆయన 'గొప్పవారిమధ్య' (Among the Great, P.93-94) అనేతన గ్రంథంలో తాను చేసిన ప్రయత్నాలను విపులంగా తెలిపాడు.

"నేను అందరికీ ప్రీతికరమైన 'వందేమాతరం' గీతానికి సంగీతం సమకూర్చాను కాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ ఒక తక్కువరకం గీతాన్ని జాతీయగీతంగా మనమీద రుద్దబోతున్నారని విన్నాను. ఇది మా అందరికీ చాలా బాధ కలిగించింది. అందుచేత అందరూ కలసి సుల భంగా పాడుకునేందుకు వీలుగా నేను సంగీతం సమకూర్చిన ఆగొప్ప గీతా

నికి, నాకు చేతనైతే, గాంధీగారి ఆమోదం పొందాలనుకున్నాను, అక్టోబరు 28 సాయంత్రం ఆయన ప్రార్థన సమావేశంలో నేను కట్టినబాణీలో వందే మాతరం గీతాన్ని పాడేందుకు అనుమతించవలసిందిగా ప్రార్థిస్తూ గాంధీజీకి అహమ్మదాబాదు నుండి అక్టోబరు 27న ఒక తంతి ఇచ్చాను. మా విమానం ఢిల్లీకి ఆలస్యంగా చేరింది. నేను వెంటనే ఆయనకు ఫోనుచేశాను. మరునాటి ఉదయం బిర్లా భవనంలో తనను కలుసుకోవలసిందిగా ఆయన తెలిపారు.

అక్టోబరు 29 ఉదయం, రాయ్ బిర్లా భవనంలో గాంధీజీని కలుసు కొని తన మధురకంఠంతో తాను క్రొత్తగా కూర్చిన బాణీలో వందే మాతరం పాడాడు. గాంధీగారి కోరికపై 'హిందూస్థాన్ హమారా'కూడా పాడాడు.

సాయంత్రం ప్రార్థన సమావేశంలో రాయ్‌ని ప్రేక్షకులకు పరి చయం చేస్తూ గాంధీజీ "ఈ ఉదయంకూడా ఇతడు రెండు సుప్రసిద్ధ జాతీయగీతాలను పాడి నాకు వినిపించాడు: అవి 'వందేమాతరం', 'హిందూస్థాన్ హమారా' అనేవి. ఇవి రెండూ ఆయన తన స్వంత బాణీలలో పాడాడు. వీటిలో మొదటిది నాకు ప్రత్యేకంగా బాగా నచ్చింది. ఆ ఉదాత్త గీతానికి కూర్చిన సంగీతం ఆ పాటలోని భావస్పందనకు బాగా సరిపోయింది'' అన్నారు.

మహాత్మాజీ వందేమాతరం గీతాన్నీ దాని సంగీతాన్నీ స్వయంగా మెచ్చుకుంటున్నందుకు దిలీప్‌కుమార్‌రాయ్ చాలా సంతోషించాడు, తన ప్రయత్నాలు ఫలించే సూచనలు కనపడుతున్నాయన్న తృప్తితో, ఆశతో తిరిగి వెళ్ళాడు.

కాని అతని శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరైంది. వందే మాతరం దానికి తగిన గౌరవస్థానాన్ని పొందలేదు. కారణం మాటిమాటికి

బుజువైన అబద్ధమే! – బ్రిటిషు నిపుణుల అభిప్రాయమంటూ ఉటంకింపబడేదే! నిజంగానే ప్రజాభిప్రాయం వ్యథచెందింది – యదార్థమేమిటి ?

మన మాతృభూమి ముక్కలు చెక్కలుగా చీల్చబడి వికలాంగయై, అవమానభారంతో కృంగి ఉన్నప్పుడు వందేమాతరం గీతంలో మాతృభూమిపై వెల్లడించబడిన ప్రగాఢ ప్రేమ రుచించి ఉండదు. అవమానకరము, లజ్జాకరము అయిన పరిస్థితులలో పరిపూర్ణ స్వాతంత్ర్యాన్ని గాకుండా అంతకు తక్కువదానికి రాజీపడి అంగీకరించిన పెద్దమనుషులకు వందేమాతరం గీతంలోని వీరత్వము, స్వతంత్ర భారతదేశాన్ని గూర్చిన సమగ్ర స్వప్నము ఇబ్బందిని కలిగించి ఉండవచ్చును.

*

## 4. అనర్ఘపూజనం

1950 జనవరి 26 భారత రిపబ్లిక్ అవతరణ దినంగా నిర్ణయింప బడింది. అధ్యక్షుని ఎన్నికకు ముందుగానే జాతీయగీతాన్ని ఎన్నుకోవాలి. వందేమాతరం జాతీయగీతంగా ఎన్నుకోబడటానికి "జనగణమన" వలె బాండుసంగీతానికి అదిఅనుగుణంగాలేదనేది అవరోధంగా నిలిచింది. అయితే ఆఇబ్బందిని మాస్టర్ కృష్ణారావు సులభంగానే తప్పించాడు. జాతీయగీతాన్ని నిర్ణయింపవలసిన రాజ్యాంగ సభముందు అతడు బాండుమీద దానిని వాయించి చూపించాడు. బొంబాయిలోనినిపుణులు, అధికారులు, విద్వాంసులు దానిని మెచ్చుకున్నారు. ఏదో ఒక మిషకల్పించి దానిని ప్రక్కకునెట్టాలనుకుంటేతప్ప వందేమాతరాన్ని జాతీయగీతంగా రాజ్యాంగసభ ఆమోదిస్తుందనే అంతా భావించారు. ప్రభుత్వం లేవనెత్తిన అడ్డంకులన్నిటిని అధిగమించి బయట పడినందుకు జాతియావత్తు సంతోషంతో ఒక నిట్టూర్పు విడిచింది.

మహాత్మాగాంధీ వందేమాతరాన్ని మన జాతీయగీతంగా వుండాలని కోరుకొన్నాడు. ఆ గీతము ఆయన ప్రార్థనా సమావేశాలలో తప్పకుండా గానంచేయబడుతుండేది. 1947 ఆగష్టు 29న వందేమాతరగీతం పాడిన

తరువాత మహాత్ముడిలాచెప్పాడు; కోట్లకొలది భారతీయులు కలిసి పాడుకునేందుకు దాని భావాన్ని, అనుభూతిని పొందేందుకు ఒక సంగీత పద్ధతిని నిర్ణయించాలి. అది అందరు ఒకేరాగములో ఒకే భావనతో గానంచేయాలి. శాంతినికేతనముగాని మరి యేయితర సమర్థమైన సంస్థగాని దాని రాగమును నిర్ణయించాలి. "గాంధిజీయొక్క ఈ కోరిక మాస్టర్ కృష్ణారావుయొక్క పనితనము వలన నెరవేర్చబడింది.

అదే సమయంలో బెంగాలు అంతటా దాని ప్రధాని అయిన డాక్టరు విధాన చంద్రరాయ్ నాయకత్వంలో వందేమాతరానికి అనుకూలంగా ఒక ఉద్యమము లేవదీయబడింది.

జనగణమన సృష్టి వందేమాతరానికి ఒకరకంగా అనుకూలమైంది. జనగణమన 1911 లో మొదటిసారిగా పాడబడింది. కలకత్తా కాంగ్రెసు మహాసభ డిశంబరు 26న మొదలైనది. ఆ మహాసభలో మొదటిరోజు కార్యక్రమము వందేమాతరం గీతాలాపనతో ప్రారంభమైనది. ఆ మరుసటి దినము జనగణమన పాడబడింది. చివరిరోజున రాజభుజదత్తచౌదరి యొక్క "బాద్‌షాహ్ హమారా" అనేగీతం పాడబడింది. మూడవ దినమున సరళాదేవి తను స్వంతంగా వ్రాసిన "నమో హిందూస్థాన్" అనే పాటను పాడింది. రెండవరోజు సమావేశము మొత్తము ఐదవజార్జి చక్రవర్తికి ఆహ్వానము ఇవ్వటం అనే చర్చతోనే గడిచిపోయింది. ఆనాటి పత్రికలు ఈవిషయాన్ని స్పష్టముగా ప్రకటించినవి.

"బెంగాలీ కవియైన బాబు రవీంద్రనాథ్‌టాగూర్ చక్రవర్తిని స్వాగతించేందుకు ప్రత్యేకంగా వ్రాసిన ఒక గీతాన్ని గానంచేశారు". (Statesman, 28-12-1911).

"ఆ కార్యక్రమాలు చక్రవర్తి గౌరవార్థం బాబు రవీంద్రనాథ్ టాగూర్‌చే ప్రత్యేకించి వ్రాయబడి, ఆయనచే పాడబడిన గీతంతో ప్రారంభమయ్యాయి". (English man 28-12-1911)

"1911 డిశంబరు 27 బుధవారం భారత జాతీయ కాంగ్రెసు కార్యక్రమంలో చక్రవర్తికి స్వాగతము పలుకుతూ బెంగాలీపాట ఒకటి పాడబడింది. చక్రవర్తికి, అతని భార్యకు స్వాగతమిస్తూ ఒక తీర్మానము ఏకగ్రీవంగా ఆమోదింపబడింది". (Indian, 29-12-1911)

ఆనాటి నాయకులలో చాలామంది చక్రవర్తికి విధేయత ప్రకటించడమంటే జాతికి విధేయత ప్రకటించినట్లుగానే భావించేవారు. ఐదవ జార్జి చక్రవర్తి చారిత్రాత్మకమైన బెంగాల్ విభజన రద్దు డిసెంబరు 12 వనే ప్రకటించాడు. కనుక కృతజ్ఞతా సూచకంగా 25 బెంగాలీ కవియైన రవీంద్రుడు చక్రవర్తిని పొగుడుతూ పాట వ్రాయడం అసందర్భకాని, అసహజంకాని కాజాలదు. అయితే అదే పాటను జాతీయగీతంగా అంగీకరించాలా అనే ప్రశ్న తలఎత్తినపుడు భేదాభిప్రాయాలు తప్పనిసరిగా పొడచూపుతాయి. జాతీయగీతాన్ని ఎన్నికచేసేప్పుడు దానిపుట్టుకలోని పవిత్రతను అది జాతిలో ఉవ్వెత్తుగా లేపిన ఉత్సాహాన్ని గణనలోకి తీసుకోవాలి.

ఐదవ జార్జి చక్రవర్తి గౌరవార్థం జనగణమన గీతం వ్రాయబడింది అని పత్రికలు వ్రాసిన సమాచారాన్ని రవీంద్రనాద్ ఠాకూర్ ఖండించలేదు. క్రమక్రమంగా జాతీయభావనా ప్రవాహం పాతనమ్మకాలను తుడిచిపెట్టనారంభించింది. చక్రవర్తికి విధేయత ప్రకటించటమంటే జాతికి విధేయత ప్రకటించినట్లే అన్నభావన అదృశ్యమవుతూ వచ్చింది. దేశాన్ని గౌరవించడం అంకితంకావడం, దేశాన్ని ప్రేమించడం అంటే చక్రవర్తిని గౌరవించడం, చక్రవర్తికి అంకితంకావడం, అతనినే ప్రేమించడం అనిభావించే రోజులుపోయి యివి రెండూ పరస్పర విరుద్ధమైనభావనలుగా గుర్తించడం మొదలైంది. జనగణమన గీతంమీద దాని రచయితమీద విమర్శలు వచ్చినపుడు శాంతినికేతనంలోని కొందరు పండితులు ఆ విమర్శలనుండి జనగణమనను కాపాడటానికి ప్రయత్నంచేశారు. ప్రబోధ్‌చంద్రసేన్ అనే పండితుడు జనగణమన గీతంలోని 'భారత భాగ్యవిధాత' 'రాజరాజేశ్వర'

అనే పదాలను వాటి భావాలను వివరిస్తూ, అవి ఐదవ జార్జిచక్రవర్తిని ఉద్దేశించి వ్రాయబడ్డవి కావనీ భగవంతుని ఉద్దేశించి మాత్రమే వ్రాయబడ్డవనీ పుంఖాను పుంఖంగా వ్యాసాలను గుప్పించాడు. తన వివరణకు అనుకూలంగా అతడు ఆగీతంలో కొన్నిచోట్ల మార్పులుకూడచేశాడు. అయితే ఆ పండితుడు పడిన వృధాప్రయాస, లేనిపోని అనుమానాలు రేకెత్తించడానికే ఉపయోగపడింది. రవీంద్రుడు యీచర్యలవల్ల చాలా బాధపడ్డాడని అతడే చెప్పాడు.

నాకు అత్యంత సన్నిహితుడైన ఒక ప్రభుత్వోన్నతోద్యోగి ఐదవ జార్జి చక్రవర్తిని స్వాగతిస్తూ ఒక గీతం వ్రాయవలసినదిగా సలహా ఇచ్చినందువలననే నేనాగీతాన్ని చక్రవర్తికి బదులు "భారత భాగ్యవిధాత"యైన పరమేశ్వరు నుద్దేశించే వ్రాశాను – అని రవీంద్రుడు స్వయంగా ప్రబోధచంద్రసేన్‌తో చెప్పినట్లు సేన్ వుటంకించారు. రవీంద్రునినుండి సరాసరి యీరకమైన అభిప్రాయం బయటకు రాలేదనేది గమనించదగ్గ విషయం. చలించని ప్రశాంత మనస్తత్వము, వ్యక్తిత్వముగల రవీంద్రునివంటి కవీంద్రుడు ఎవరో ఒక ఉన్నత ప్రభుత్వోద్యోగి సలహామీద ఉద్రేకానికి లొంగి ఒక గీతానికి బదులు మరొకగీతాన్ని వ్రాసాడని చెప్పడం నమ్మశక్యం కానివిషయం. ఆపాట పాడబడుతున్నప్పుడు వార్తాపత్రికలు ఆ గీతాన్ని చక్రవర్తికి అంటగట్టి ప్రచురించినప్పుడు రవీంద్రుడు మౌనం వహించాడు. కాని ఆగీతం ఉద్భవించిన 26 ఏళ్ళతర్వాత ఆయన శిష్యులు దాని పుట్టుపూర్వోత్తరాలమీద ఇంత వివరణ ఎందుకు చెప్పవలసి వచ్చిందో అర్థంకావటంలేదు ?

ఠాగూరు శిష్యులు వివిధ వివరణలతో, కట్టుకథలతో ముందుకు వచ్చారు. ప్రస్తుతానికి అలాంటికథే మరొకటి వివరిస్తాను.

డబ్ల్యు. బి. ఈట్స్ ఒక గొప్ప ఐరిష్ కవి. అతడు ఠాగూరుకు మంచి స్నేహితుడేగాక ఆయన గ్రంథాలను బాగా అభిమానించేవాడు.

టాగూరు గీతాంజలికి అతడొక చక్కని మున్నుడి వ్రాశాడు. టాగూరు శిష్యుడైన భారతీయుడొకడు ఈట్స్‌ని కలిశాడు. అమెరికాలోని లేడీ జార్జికి ఈట్స్ ఉత్తరంవ్రాస్తూ అందులో 5వ జార్జిమీద రవీంద్రుడు గీతం వ్రాసినందుకు సరోజినినాయుడుగారి సోదరుడు అసంతృప్తిగా వున్నాడని తనకు టాగూరు శిష్యుడు చెప్పినట్లు వ్రాశాడు. రవీంద్రుని శిష్యుడినుండి తను ఒక ఆసక్తిదాయకమైన కథను విన్నట్లు, దానిని రహస్యంగా ఉంచవలసిందిగాను ఆ వుత్తరంలో కోరాడు. అది జనగణ మన వ్రాయబడిన పరిస్థితులకు సంబంధించినది. "భారత జాతీయ కాంగ్రెస్‌వారు తమకు ఒక స్వాగతగీతం వ్రాసిపెట్టమని టాగూరును అడిగారు. అతడు వ్రాయటానికి ప్రయత్నించాడుగాని వ్రాయలేకపోయాడు. అతడు ప్రభాతసమయంలో లేచి, ఒక అందమైన గీతం వ్రాశాడు. తను వ్రాసిన రచనలలో ఉత్తమోత్తమమైనదేమీకాదుగాని మొత్తంమీద అందంగానే ఉన్నది. ఆయన మేడమీదనుండి క్రిందికి దిగివచ్చి మాలో ఒకళ్ళకి యీవిధంగా చెప్పాడు. నేను వ్రాసిన గీతమిదిగో. ఇది భగవంతుణ్ణి ఉద్దేశించిందైనా కాంగ్రెస్‌వారికి దీనిని ఇవ్వండి. అది వారిని సంతోషపెడుతుంది. వాళ్ళు ఆగీతం చక్రవర్తికొరకు వ్రాయబడిందని అనుకుంటారు. అది భగవంతుని ఉద్దేశించి వ్రాయబడిందని, అనుయాయులకు మాత్రమే తెలుసుగాని యితరుల కెవ్వరికీ విషయం తెలియదు.
[The Indian Express about Janaganamana, 3-6-1968]

ప్రబోధ చంద్రసేనుడు చెప్పినదానికంటే ఈకథ మరీ ఆకర్షవంతంగా, వీనులవిందుగా వుంది. టాగూరు చక్రవర్తిమీద స్వాగతగీతం వ్రాయాలనుకొని వ్రాయలేకపోయాడు. అప్పుడు ఒకగీతం వ్రాసి అది భగవంతుడిమీద వ్రాయబడినా కాంగ్రెస్‌వారు స్వాగతగీతంగా ఉపయోగించుకొంటారని ఇచ్చాడు. ఇదంతా చివరకు ఒక అభూతకల్పనగా గోచరిస్తున్నది.

1973లో ప్రబోధచంద్రసేనుని వ్యాసం రవీంద్రుని అభిప్రాయాన్ని ఉటంకిస్తూ ప్రచురింపబడగానే ప్రసిద్ధ బెంగాలీ పత్రిక "శనివారేర్‌చేటి" తన సంపాదకీయ వ్యాసంలో దానిని విమర్శించింది. 'ఈపాట రాజునుద్దేసించిదిగాక భగవంతుణ్ణి సంబోధించిందని నమ్మించడం అసాధ్యం' అని ఆ పత్రిక వ్రాసింది. కారణమేమిటంటే ఆగీతం అంతకుముందే చక్రవర్తి పాదాలమీద సమర్పింప బడింది.

ఏ ప్రభుత్వం వందేమాతరం గీతం పాడిన ప్రజలను ద్రోహులుగా ఆరోపించిందో ఆ ప్రభుత్వమే జనగణమన గీతానికి అత్యంత ఆదర గౌరవాలనిచ్చింది. బ్రిటిషు సింహాసనానికి విధేయతను పెంచే ప్రభుత్వ పాఠశాలలలోనూ స్కౌటు సమావేశాలలోను యీ గీతం పాడబడేది. బ్రిటిషు ప్రభుత్వం భారతదేశాన్ని వదిలిపోయే సమయంలో ఒక యుద్ధ విమానాన్ని మన దేశానికి బహుకరించిన సందర్భంలో జనగణమన గీతాలాపనం చేయబడింది. ఆంగ్లేయులందరు యీ గీతాన్ని ప్రస్తుతించారు. వారెందుకలా స్తుతించారో వూహించడం ఏమంత కష్టమైన విషయంకాదు.

నేపథ్యంలో జరిగినదంతా పరిశీలించిననాడు దేశభక్తిభావనా ప్రేరేపితులై రాజ్యాంగసభ సభ్యులు వందేమాతరాన్ని జాతీయగీతంగా తప్పక అంగీకరిస్తారనే భావన కలగడం సహజం. అయితే తెరవెనుక భాగోతం మరొకతీరుగాఉంది. 1950 జనవరి 24వ తేదీన ఉదయం 11 గంటలకు రాజ్యాంగసభ సమావేశమైంది. జాతీయగీతం విషయంలో తుదినిర్ణయం తీసుకోవల్సిఉంది. బాబూ రాజేంద్రప్రసాద్ అధ్యక్ష స్థానంలో ఉన్నారు. విచిత్రమేమిటంటే జాతీయగీతం విషయం సభలో చర్చకురాలేదు. దానికి మారుగా అధ్యక్షుడే ఒక ప్రకటన చదివాడు.

అధ్యక్షుడు :- "చాలకాలంగా చర్చించవలసిన విషయం ఒకటలాగే మిగిలిపోయింది. అది జాతీయగీతం ఏది అనేదానికి సంబంధించిన విషయం. ఒకప్పుడు యీవిషయం రాజ్యాంగసభలో చర్చకుపెట్టి దాని

నిర్ణయాన్ని ఒక తీర్మానంద్వారా తీసుకుందామనుకున్నాం. అయితే జాతీయగీతం విషయంలో తుది నిర్ణయాన్ని తీర్మానంద్వారా తీసుకోవటం కంటే నేనే ఒక ప్రకటన చేయటం మంచిదని భావించబడింది. కనుక నేనీ ప్రకటన చేస్తున్నాను.

"పదములు-సంగీతము కలిసిన జనగణమన గీతం భారతదేశానికి జాతీయగీతం. పరిస్థితుల కనుగుణంగా తగిన మార్పులు ప్రభుత్వం చేసుకోవచ్చు. జాతీయ స్వాతంత్ర్య సంగ్రామంలో అత్యంత చారిత్రాత్మక పాత్ర వహించిన వందేమాతరం గీతం జనగణమనతో సమానంగా గౌరవింపబడి, దానితో సమాన గౌరవ ప్రతిపత్తి కలిగివుంటుంది. (చప్పట్లు) కనుక సభ్యులకు ఈ నిర్ణయం తృప్తికలిగిస్తుందనే భావిస్తాను". (Constituent Assembly of India. Vol XII, 24-1-1950).

రాజ్యాంగసభలో జాతీయగీతం సంగతి చర్చకు పెట్టకుండా అధ్యక్షుని ప్రకటనకు వదలటమే మంచిదని ఎవరు భావించారు? ఎప్పుడు ఏవిధంగా "జనగణమన" జాతీయగీతానికి తగినదని నిర్ణయింపబడింది? అన్నవి చరిత్రలో సమాధానం దొరకని తికమక ప్రశ్నలుగానే నిలిచిపోయాయి. 1940-41 వరకు "జనగణమన"ను జాతీయగీతపు స్థాయిలో రవీంద్రనాథ్‌టాగూర్ కాని, జవహర్‌లాల్ నెహ్రూకాని ఎన్నడూ ఆలోచించలేదు. టాగూర్ శతజయంతి సంపుటికి పీఠిక వ్రాస్తూ నెహ్రూ ఈవిషయాన్ని అంగీకరించారుకూడ.

"స్వతంత్ర భారతానికి ఒక జాతీయగీతము వ్రాయవలసిందిగా నేను చివరసారి ఆయనను (రవీంద్రుని) కలిసినప్పుడు అభ్యర్థించాను. ఆయన దానికి కొంతవరకు అంగీకరించారుకూడ. ఆనాడు నా మనస్సులో ఈనాటి జాతీయగీతమైన జనగణమణ లేనేలేదు. ఆయన ఆతరువాత కొంత కాలానికి చనిపోయారు. స్వతంత్రము వచ్చిన తరువాత కొన్ని సంవత్సరాలకు మనము "జనగణమన"ను జాతీయగీతంగా నిర్ణయించినందుకు నాకు చాలా సంతోషం కలిగింది. దానిని జాతీయగీతంగా ఎన్నిక చేయటా

నికి నా పాత్రకూడ కొంత వున్నదనే తృప్తి నాకు ఉన్నది. ఎందు కంటే అది గొప్ప జాతీయగీతమేకాక ప్రజలకు రవీంద్రనాథఠాగూరును సర్వదా గుర్తుచేస్తుంది కనుక".

జనగణమనను జాతీయగీతంగా వుంచటానికి దానియొక్క గుణా గుణములను గూర్చి అనుమానాలు ఇద్దరికీ వున్నవనేది స్పష్టము. అందు వలననే ఆసమయములో దాని ప్రస్తావన రాలేదు, మరొక క్రొత్తగీతం వ్రాయాలనే ఆలోచన వచ్చింది. నిజంగా జనగణమణ ఒక గొప్ప జాతీయ గీతమూ అయినట్లైతే దానినిగూర్చి ఆనాడే ఆలోచించడం జరిగేది. అధి కారుల ఆదరణవలన, ప్రచారమువలన, ప్రభుత్వ ముద్రవలన మాత్రమే అది ఒక గొప్ప జాతీయగీతము అయింది. ఠాగూరు, నెహ్రూయొక్క కోరికను పూర్తిగా కాకుండా అపరిపూర్ణంగా అంగీకరించాడు. జాతీయ గీతానికి కావల్సిన సద్గుణాలన్నీగల వందేమాతరాన్ని జాతీయగీతంగా ఎందుకు నిర్ణయించకూడదని రవీంద్రుడు నెహ్రూను అడిగి వుండవల సిందని సహేతుకంగా ఎవడైనా భావిస్తాడు. తను వ్రాసిన పీఠికలో ఇది అసందర్భంగా వుంటుందని భావించడంవల్ల నెహ్రూ దీనిని ఉటంకించి ఉండలేదు. తను వందేమాతరాన్ని జాతీయగీతంగా ఆమోదించడానికి రవీంద్రుడు అంగీకరించినట్లు గాంధీజీ 23-8-1947 ప్రకటించిన ప్రకటన ద్వారా తెలుస్తోంది.

ఈ సందర్భంలో మరొక ముఖ్య విషయకూడా ఆలోచించాల్సి వుంది. 1939-40కి పూర్వమే నిర్దిష్టంగా జాతీయగీతపు స్థాయికి అందు కున్న వందేమాతరాన్ని పండిత నెహ్రూ ఎందుకు ప్రక్కకు నెట్టారు? అది చేసిన నేరమేమిటి? 1937లో ఠాగూరు సలహాతో. వందేమాతరం జాతీయ గీతంగా ప్రవేశపెట్టాలని నిర్ణయంచేసిన ఉపసంఘంలో పండిత నెహ్రూ కూడా ఒక సభ్యుడుకాదా?

వందేమాతరం చాలా పెద్దదనీ జాతీయగీతంగా దానిని పాడుతున్నప్పుడు సావధానులై చలనం లేకుండా చాలాసేపు నిలబడి

ఉండటం బాధాకరమని చెప్పబడింది. బ్రిటిష్‌వారుకూడా ఇదేరకమైన అభ్యంతరంచెప్పారు. 'చాలా దేశాలలో జాతీయ గీతాలు ఇంతకంటె సుదీర్ఘమై వినటానికి శ్రావ్యంగా లేకపోయినా జాతీయగీతాలుగా నిల్చిపోయి నాయి. ఆ గీతంవలన స్ఫూర్తి పొందిన ప్రజలు సాధించిన ఘన విజయా లను దృష్టిలో వుంచుకొని జాతీయగీత నిర్ణయం జరుగుతుందిగాని పాట లోని శ్రావ్యతను బట్టిగాదు' అని శ్రీ అటల్ బిహారీ వాజ్‌పాయ్ అన్నారు. విదేశాలు పర్యటించివచ్చిన అనేకులు యీభావనతో ఏకీభవించారు.

వందేమాతరం-జనగణమనల విలువలను సరిపోల్చి నిగ్గుతేల్చ టానికి ఎవరైనా వందేమాతరం ఉద్భవించిన సమయంలోను ఆ తరువాతి కాలంలోను ప్రచురింపబడిన అసంఖ్యాకమైన గ్రంథాలను అవలోకనం చేయాలి. వందేమాతరం విస్తారంగా ఉదహరింపబడటానికి కారణం తప్పని సరికావటం వల్లనే. అందులో కొన్నిటిని యీక్రింది ఉదహరిస్తాను.

1. ఫ్రీడమ్ స్ట్రగుల్ ఇన్ ఇండియా – పేజీ 214.
2. ది కాజ్ ఆఫ్ ప్రెజెంట్ డిస్‌కంటెంట్స్ ఇన్ ఇండియా – పేజీ 58.
3. హిస్టరీ ఆఫ్ ఫ్రీడమ్‌మూవ్‌మెంట్ ఇన్ కర్నాటకా – పేజీ 396
4. రిసర్జెంట్ ఇండియా – పేజీ 189-90.
5. ఎ బుక్ ఆఫ్ ఇండియా – పేజీ 67.
6. బంకిం – తిలక్ – దయానంద్
7. బంకించంద్ర్ బై ఎ. ఆర్. కృష్ణశాస్త్రి, మొదలగునవి.

ఈ పై వాటిలో చాలావరకు 1947 తర్వాత ప్రచురింపబడినవే. రవీం ద్రునిపేరు ఉటంకించబడినప్పటికీ జనగణమన ప్రస్తావనమాత్రం లేనేలేదు.

ఉదాహరణకు "Resurgent India" అనే పుస్తకము 1963లో ప్రచురింపబడింది. దానిలో "రవీంద్రనాథ ఠాగూరు అతని గ్రంథాలు' అనే విభాగమున్నది. అయినప్పటికీ అందులో జనగణమనను గూర్చిన ప్రస్తావన ఎక్కడనూలేదు అది జాతీయగీతముగా వుండటముగూర్చి ఆలోచనేలేదు.

తాగూరుయొక్క పది ప్రసిద్ధ గీతాలను 'A Book of india' ఉదహరించింది. అయితే అందులో జనగణమనలేదు. Neheru, the First Sixty years' అనే గ్రంధంలోని రెండవ సంపుటములో వందేమాతరమును గూర్చిన ప్రస్తావన వున్నదిగాని జనగణమననుగూర్చి ఎక్కడాలేదు. 'మోతీలాల్‌దాస్' యొక్క 'The Soul of India' అనే గ్రంధంలో 'తాగూర్ కవితాసారం' The Quintessence Tagores Poetry అనే శీర్షికగల భాగం వున్నది. అయినా అందులో జనగణమనను గూర్చిన ప్రస్తావన లేదు. 'Encyclopaedia Britannica' అనే గ్రంధములో బంకించంద్ ఛటర్జీయొక్క వందేమాతరాన్నిగూర్చి సుమారు ఒక పేజీదాకా వ్రాయబడింది. తాగూరును గూర్చి వ్రాస్తూ జనగణమనయొక్క ప్రస్తావన కూడాలేదు.

ప్రభుత్వము ఆధికారికంగా జనగణమనను జాతీయగీతంగా ప్రవేశ పెట్టిన తరువాత ప్రచురించబడిన Glorious Thoughts of Neheru, Glorious Thoughts of Tagore' తదితర గ్రంధాలలోను జాతీయ గీతముయొక్క ప్రస్తావన వచ్చినప్పుడల్లా 'వందేమాతరం' గీతమే ఉదాహరింపబడింది. ఆధికారికమైన గొప్ప తంత్రంవల్ల జాతీయగీత ప్రతిపత్తి జనగణమనకు ఇవ్వబడినప్పటికీ చరిత్రలోను, స్వాతంత్ర్య సమరంలోను కవిత్వపు విలువలలోను దానికున్న ప్రాధాన్యత అత్యల్పం.

ఏ. ఆర్. కృష్ణశాస్త్రి 'బంకించంద్' పై వ్రాసిన గ్రంధములో వందేమాతరాన్ని ప్రస్తావిస్తూ ఈవిధంగా చెప్పారు : స్వాతంత్ర్యమువచ్చిన తరువాత జాతీయగీతము నిర్ణయించటమువిషయంలో బంకించంద్రుని వందేమాతరము ఉండాలా? తాకూరు జనగణమన వుండాలా? అనే విషయమును గూర్చిన చర్చలు సమగ్రంగానే వచ్చినవి. చివరకు ప్రజలు (ప్రభుత్వము?) తాగూరు యొక్క గీతవైపుమొగ్గారు. నోబెల్ బహుమతి వచ్చిన తరువాత తాగూర్ పేరు బహుళ ప్రచారమై అందరికీతెలియవచ్చింది.' (Page-272) ప్రభుత్వం అన్నపదానికి ప్రక్కనున్న ప్రశ్నార్థకం హృదయావేదనను సూచిస్తున్నది. పైమాటలలో నోబెల్ బహుమానాన్ని గూర్చిన ప్రస్తావన వున్నదేగాని జనగణమన గీతంలోని విలువలకు ప్రస్తావనలేదు. నోబెల్ బహుమానానికి జనగణమనకు అసలు సంబంధమేమిటి?

## 15. కలలు కల్లలైనాయి

ఒక జాతి అంటే ఒక భూభాగమూ కాదు ప్రజాసమూహమూ కాదు. కేవలం ఈ రెంటికలయిక కూడాకాదు. అది ఒక మహాద్భుతమైన సంచలనాత్మకమైన సృష్టి. గుర్తింపదగిన సహజమైన ఎల్లలు కల్గి, ఒకేచరిత్ర, పరంపర కల్గియుండి, ఆశలు, ఆశయాలు, సుఖదుఃఖభావన, శత్రుమిత్ర భావన ప్రేమాసూయలు ఒకేవిధమైనవిగా ఉండి, ఒకతల్లి బిడ్డలవలె మనుగడ సాగిస్తున్న ప్రజలను జాతి అని పిలుస్తాము. సుప్రసిద్ధ ప్రపంచ రాజనీతిజ్ఞుల అభిప్రాయంకూడా యిదే. ఒక జాతి మనుగడ కేవలం కనిపిస్తున్న వర్తమానానికి మాత్రమే పరిమితముకాదు. సుదూరమైన గతానికి సంబంధించిన పరంపరానుగతమైన చరిత్రను సృష్టిస్తూ, అద్యతన భావిలోని ఆశలను, కోర్కెలను దృష్టిలో ఉంచుకొని సాగిపోతూ వుంటుంది.

సర్వప్రాణులకు వలెనే జాతికికూడా ఆత్మ ఉన్నది. దానిపిలుపు క్రియాపూర్వకమైన రూపము పొందినప్పుడు ఒక మహాద్భుతశక్తిని అది పొందుతుంది, అది ప్రజలను సంతోషముతో నాట్యము చేయిస్తుంది. వారిని పరవశత్వములో ముంచుతుంది. వారిని మహోన్నతమైన శౌర్య కార్యాలకు పురిగొల్పుతుంది. పెదవులపై చిరునవ్వులతో ఉరికంబాలవద్దకు నడిపిస్తుంది. ఇలాంటి ఆత్మానుగతమైన పిలుపుయే జాతీయగీత మౌతుంది.

ప్రతిజాతికి ఒక భాష ఉంటుంది. అది తన స్వంత జాతీయత కలిగి వుంటుంది. అనేకవిషయాలపై ఆధారపడి జాతీయగీతం రూపు దిద్దుకొంటుంది. భూమి-అక్కడి ప్రజలయొక్క స్వభావము, ప్రాచీనత సంప్రదాయము, జీవనమూల్యాలు మొదలగువాని ప్రభావం జాతీయగీతం మీద వుంటుంది.

మధుక్షీరాలలో పొంగిపొరలుతున్న యీ భూమిని జాతీయగీతంలో భూతలస్వర్గంగా వర్ణించడం జరుగుతుంది. పుటం పెట్టబడిన బంగారంవలె అనేక పరీక్షలకు తట్టుకొన్న జాతీయగీతం ఆర్తితో రక్షణ కోరుతున్నది. స్వాతంత్ర్యాన్ని కోల్పోయినభూమి తన స్వాతంత్ర్య పిపాసను జాతీయ గీతంలో ఎలుగెత్తి చాటుతుంది. చక్రవర్తులపాలనలోఉన్న దేశమైతే ఆ దేశపు జాతీయగీతం ఆ రాజవంశపు గొప్పతనాన్ని స్తుతిస్తుంది. అరుదుగా కన్పించేపక్షంలో ఒకపర్వతాన్నిగాని, లేక నదినిగాని, దివ్యాంశసంభూతంగా వర్ణించడం జరుగుతుంది. ఎక్కడ అరాచకము, రక్తపాతము పాలన చేస్తయ్యో అక్క జాతీయగీతం కడుపులు మండిస్తుంది. శత్రువుమీద ద్వేషం ప్రతిపంక్తిలోనూ ప్రత్యక్షమవుతుంది. ఆయాదేశాల జాతీయగీతా లలో భేదాలెన్ని ఉన్నప్పటికి హేతువాదానికతీతమైన వర్ణనాతీతమైన గౌరవం ప్రేమ, భక్తి, మాతృదేశంపట్ల సర్వసామాన్యంగా కనిపిస్తాయి.

ఇక మన దేశాన్నిగూర్చి ఆలోచిద్దాం. మన సంప్రదాయం ఈనాటిది కాదు. అదిచాలా ప్రాచీనమైనది. శాశ్వతమైనది, కొన్ని వేల సంవత్సరా లుగా ఈజాతియొక్క ఆత్మికశక్తి పెరిగి పెద్దదైంది. సాంఘిక జీవనంలో లెక్కలేనన్ని ప్రయోగాలు ఇక్కడ చేయబడ్డాయి. మన ప్రాచీనులు ఈ సంప్రదాయము నుండి గొప్ప సాంస్కృతిక మూల్యాలు. ఆదర్శ వంతమైన జీవనపద్ధతిని వెలికిలాగారు. వారు తమ దేశాన్ని మాతృ మూర్తిగా భావించారు. వారియొక్క భక్తి ప్రపత్తులను ఆమెయెడల తెలియచేశారు.

ఈ మాతృభావన ఎలా ఉత్పన్నమైనది ? ఇది మానవ నైజము. తాను ఉపయోగం పొందుతున్న చేతనాచేతన వస్తువులపట్ల మిక్కిలి భక్తి ప్రపత్తులు కల్గివుంటాడు. అల్పప్రాణులపట్ల యీ భావన భేదించవచ్చును. ఈ మాతృభావనాతత్వము పరిణామంవల్ల పెరుగుతుంది. జంతువులు తమ పిల్లలను వాటిక్షేమం అవి చూచుకొనేవరకు కాపాడుతాయి. పక్షులు తమ పిల్లలు ఎగిరేవరకు కాపాడుతాయి. తాను తన పిల్లలకు ఉపయోగపడేంత వరకు పక్షులలోనూ, జంతువులలోనూ ఆ మాతృభావన ఉంటూనే ఉన్నది. పరిణామక్రమంలో మానవుని స్థితి అత్యున్నతమైనది. మాతృమూర్తివలన తాను ప్రయోజనమును పొందుస్థితిని దాటినప్పటికిని ఆ తల్లిని పూజ్య మూర్తిగానే భావిస్తాడు. వాస్తవంగా అతని భక్తిప్రపత్తులు వయసుతో పాటు వృద్ధిచెందుతుంటవి.

మానవజీవితం పురోగమిస్తున్నకొద్దీ మాతృపూజాభావనకూడా రానురానూ ఉన్నతమై నిలచింది. విస్తృతంగాను పెరిగింది. మాతృదేవితో పాటు మిగతావాటికికూడా తాను ఋణపడి వున్నట్లు గ్రహించటం మొదలు పెట్టి వాటినికూడా తల్లితో సమానంగా గౌరవించటం ఆరంభించాడు. తనకు జలప్రదానం చేసిన నది 'గంగామాత' అయింది. తనకు క్షీరదానం చేసిన గోవు 'గోమాత' అయింది. ఏభూమి అయితే తను నిలబడటానికి కారణమయిందో, తనను కాపాడుతున్నదో, మరణానంతరం ఎవరి కౌగిలిలో దాగుతున్నాడో ఆ భూమికి మహోన్నతమైన మాతృదేవి స్థానం ఇచ్చి మాతృభూమిగా గౌరవించాడు. మాతృభూమియొక్క యీ పవిత్ర భావన మానవునియొక్క సాంస్కృతికమైన వికాసానికి పరిపూర్ణ రూపం. మనకు ఈ భారతభూమిలో మాతృభూమిభావన కవితాకల్పన మాత్రమే గాక సజీవ సత్యానికి నిదర్శనం.

ఈదేశం అందువల్ల మన తల్లి. ఇతరదేశాలవారికి మాతృభూమి అంటే ఒక అందమైన ప్రేమించదగిన జన్మభూమి అని మాత్రమే తెలుసు. అంతగా కాకపోతే వారు దానిని పితృభూమిగా స్వీకరిస్తారు. కాని మనకు

మాత్రం మన మాతృభూమి భరతమాత. సంస్కృతీసంపన్నులైన భారతీయులకు విశిష్టమైన ఈ మాతృమూర్తి భావన భారతీయభావనాస్రవంతిలో ఉత్పన్నమైన ఒక ప్రత్యేకత. ఈభావన భారతీయుల హృదయాలలో నిరంతరం భక్తిప్రపత్తులను నిల్పుతుంది. దీనికి ఋజువుగా మాతృభూమి రక్షణకై ఎన్నికష్టాలనైనా ఓర్చి ఎటువంటి త్యాగాలకైనా సిద్ధపడి ప్రాణాలను సహితం ఒడ్డడానికి భారతీయులు ముందుకురావడాన్ని పేర్కొనవచ్చు. భౌతిక ప్రపంచంలో యీరకమైన సాంస్కృతిక విలువలు అమూల్యమైనవి. ఆవశ్యకమైనవి. ఏ దేశభక్తుని హృదయంలో ప్రగాఢంగా మాతృభూమియెడల ప్రేమ ప్రజ్వరిల్లుతుంటుందో ఆతడు మాతృభూమిపట్ల జరిగిన చిన్న తప్పిదాన్నికూడా గొప్ప నేరంగా భావిస్తాడు. తన ఆయుధాలతో సన్నద్ధమౌతాడు. యుద్ధదేవతను ప్రార్థిస్తాడు. శత్రువును తిరిగి తల ఎత్తకుండా అణచివేసేవరకు ఆమెపగ చల్లారదు. శాంతి, సంతృప్తి కొరవడుతాయి.

తమఇళ్ళనూ వాకిళ్ళనూ, సుఖ సంతోషాలనూ త్యాగంచేసి, విచారణలకూ కష్టాలకులోనై వజ్ర సంకల్పంతో దేశసేవకు అంకితమైన దేశభక్తులను ఎందరినో యీ దేశంచూచింది. ఆదర్శవంతమైన రాజులుగాను, మహర్షులుగానువుండి చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగిన పవిత్రమూ నిష్కళంకమూ అయిన జీవనం గడిపినవారు లెక్కలేనంతమంది ఇక్కడ వుండేవారు. ఇతరులను బానిసలనుచేసే నిరంకుశులకు వ్యతిరేకంగా పోరాడి తమరక్తమోడ్చి జైళ్ళలోమ్రగ్గి, చిరునవ్వులుచిందిస్తూ బలిపీఠంపైకి ఎక్కినవారెందరో ఉన్నారు. ఎవరికొరకు వారీ త్యాగంచేశారు? పాదపద్మాలను పూజిస్తున్నారో, ఎవరికోర్కెలను ఆజ్ఞలుగాభావించి పనిచేస్తున్నారో ఆ భారతమాత కొరకు. ప్రజలయొక్క నాడిలో తమకు జన్మను ప్రసాదించిన మాతృభూమిపట్ల పూజ్యభావం ఉండటం సహజం. ఆమెయెడల భయభక్తులు కల్గిఉండటం అప్రయత్నపూర్వకము స్వచ్ఛందమూ అయిన కార్యం. అది తల్లిపట కుమారుని కర్తవ్యం. అది భారత జాతీయ ఆత్మయొక్క అంతర్గతమైన కోరికయొక్క రూపాన్ని తెలియచేసేపద్ధతి.

తమ భూమిని మాతృదేవితో పోల్చటం అనే మాతృభూమి భావన ప్రాచీనమైనదే. వేదాలలో ఆరకంగాఉన్నది. అధర్వవేదంలోని ద్వాదశాధ్యాయంలోనిభూమి సూక్తం యీ భావనను వ్యక్తపరచింది. (సకోభూమి స్త్వ్వషిం బలం రాష్ట్రే దధాతూత్తమే – ఈ భూమి జాతికి శక్తిని కీర్తిని తెచ్చునుగాక) దేశభక్తి భావ ప్రదర్శకమైన 63 మంత్రములు ఆ సూక్తములో ఉన్నవి. ఒకజాతి మహోన్నత కీర్తి పథానికెగరటానికి అత్యవసరమైన ఏడు సూక్తములు (సప్త సత్యాలనునవి) ప్రథమ మంత్రంలో వర్ణించబడినవి. దానిలోని 12వ మంత్రంలో 'మాతా భూమి, పుత్రోహం, పృధివ్యాః" అనివుంది. అనగా యీభూమి నాతల్లి నేను ఆభూమియొక్క బిడ్డనుఅని. 14వ మంత్రం మాతృభూమి పరిరక్షణకు పిలుపునిస్తూ, శత్రువును త్రిప్పికొట్టటానికి సంబధించినది. "మనల్ని బానిసలుగా చేయాలనుకున్నవారిని ఈ మాతృభూమి నాశనంచేయుగాక" అని అందులోవుంది. 45వ మంత్రం జాతీయ సమైక్యభావం క్రోడీకరించి చెప్పింది. "రకరకాల భాషలు మాట్లాడేవారు, పలురకాలైన ఆచారాలు విధానాలు అనుసరించేవారు, ఒక సమష్టికుటుంబంలోని సభ్యుల వలె యీ మాతృభూమిలో నివసిస్తారు." (వైదిక రాష్ట్రగీత – డి. సాత్వలేకర్)

ఇతర దేశాలవారి అభిప్రాయంలో జాతి. ఆజాతిని రక్షించే అధిదేవత వేరు యీరెండూ దేనికదే వేరుగాఉన్నవి. ప్రత్యేక ప్రతిపత్తి కలిగినవి. మనకుమాత్రం అవి రెండూ ఒకటే. మాతృభూమి అందరు దేవుళ్ళకు దేవతలకూ తల్లి. బ్రహ్మ విష్ణు మహేశ్వరులు ఆమె ఒడిలో చిన్నపిల్లలై ఆడుకుంటారు. పరవశత్వంపొందిన ఒక సమయంలో స్వామి వివేకానందు డిలాచెప్పాడు. "నేను తిరిగినచోటల్లా అమెహస్తాలు పాదాలు చూచాను." ఈ భారతభూమిలోని ప్రతిఅణువు అతనికి స్వర్గంకన్నా పవిత్రమైనది. అందుకే ఇలాచెప్పాడు "ఓ భారతీ పుత్రుడా! నీ సమాజం అనంత మాతృమూర్తి ఉఛ్వాసనిశ్వాసాలలో ప్రభవించిందనీ, అనంతమైన కాలమనే మాలలోని ఒక భావనా పుష్పమనీ, దానికి ఆద్యంతాలులేవనీ తెలిసికో".

విశాలమైన యీ పృధివిలో సర్వత్రా సర్వ ఆలయాల్లోనూ జరుగుతున్న పూజలు తల్లిని పూజించటమేగాని ఇతరంకాదు.

తల్లి మంచిది, దయగల్గినది, వాత్సల్యపూర్ణమైనది. అయితే ఆమె అమాయకులను రక్షించి దుష్టులను శిక్షించే శక్తికలది. మనమంతా ఆమె యొక్క శతశతానేక బాహువులము, గళాలము. జాతి మేల్కొల్పు తల్లిని మేల్కొల్పటమే. వివేకానందుడు యీవిధంగా చెప్పాడు. "భారతమాత యుగయుగాల సుదీర్ఘ నిద్రనుండి మేల్కొంచింది. ఏశక్తీ ఆమెను ఆప లేదు. ఇక యిప్పుడు, మహాకాళియై దీర్ఘ నిశ్వాసము వదిలి నిద్రనుండి లేచి తన కాళ్ళపై నిలబడ్డది చూడు!!

వేదకాలమునుండీ వివేకానందునివరకు యే మాతృభావన తరతరా లుగా ఉత్తేజపరచినదో ఆభావనకు బంకించంద్రునియొక్క వందేమాతరం రూపకల్పన చేసింది. కనుక అది తక్షణమే ప్రజల ఆశలకు ఆశయాలకు ఆలంబనమై నిలిచిపోయింది. కోట్లకొలది ప్రజలచే పాడబడుతూ వారి పవిత్ర మంత్రరాజముగా అంగీకరింపబడింది.

మన జాతీయ జీవితాన్ని పునరుజ్జీవింపచేయడంలో 'వందేమాతరం' పాత్రను ఎంతగా వర్ణించినా అసంపూర్ణమే అవుతుంది. గత శతాబ్దము చివరికాలములో యీదేశము విపరీతమైన దెబ్బలకు గురియై వంచబడి, తిరిగి కోలుకోగల ఆశలేని స్థితిలో అణగద్రొక్కబడి అమానుషంగా హింసింపబడింది. చట్టంపేరుతో రుద్దబడిన అసమానతలను చూచి భారతీయ ఆత్మ ఆక్రోశించింది. ప్రజలు భయభ్రాంతులయినారు. నిరాయుధులుగా చేయబడ్డారు. వారికి ప్రభుత్వబలంగాని, ధనబలంగాని, సైనిక బలంగాని లేకుండాపోయాయి.

తమను అణగద్రొక్కినవారికి విద్యావంతులు తమ ఆత్మలను అమ్ముకున్నారు. వారి నడకలను అనుకరించారు. వారిసేవకు తాపత్రయ పడ్డారు. ఆపనులు చేయటములో గర్వాన్ని, ఆనందాన్ని పొందారు.

జాతీయజీవనం తన ఔన్నత్యాన్ని కోల్పోయింది. అది అంధకారంలో కొట్టుమిట్టాడింది. గుప్పెడు మెతుకులకోసం, బెత్తెడు గుడ్డకోసం, సూర్యోదయంనుండి సూర్యాస్తమయంవరకు కోట్లకొలది ప్రజలు బానిసలుగా చేయబడ్డారు. స్వాతంత్రియ భావాలనుండి, ఉద్యమమునుండి వారు చాలా దూరమైనారు. స్వతంత్రాన్నిగూర్చి, ఉద్యమాన్నిగూర్చి మాట్లాడిన కొద్దిమందీ, ప్రజలదృష్టిలో పరిహాసాస్పదులుగా నిలిచారు వారికి జైలే నివాస యోగ్యముగా భావించి ప్రభుత్వం వారిని దానిలో ఫుంచినప్పుడు సంతోషించారు. బ్రిటిష్‌వారు పాలకులు, మనమంతా పాలితులము అనేభావన తిరుగులేని సత్యంగా అంగీకరించబడింది.

ఈ పరిస్థితులలో బంకించంద్రుని గీతము ప్రత్యక్షమై నిలిచింది. అజిత్ చక్రవర్తి చెప్పినట్లుగా "దేశంలోనికి ఒక తుఫాను కొచ్చుకొని వచ్చింది. ఒక జాతీయ మహోద్యమం 'వందేమాతరం' అనే మేళతాళాలతో ఆశలను ఆశయాలను చిగిర్చుకొంటూ ఉన్మత్తతతో ఉప్పెనలా ఊడి పడింది".

సస్యశ్యామలమైన మాతృభూమి భయంకర దుర్గరూపం దాల్చింది. రైతులూ, కూలీలు, బీదవారూ, నిరక్షరాస్యులు, ఒకరేమిటి సామాన్య ప్రజలందరూ ఆయుధదారులై నిలిచారు. వారు సుదీర్ఘమైన మతోపన్యాసాలనువినలేదు. స్వేచ్ఛనుగూర్చి స్ఫూర్తివంతమైన గ్రంధాలను పఠించలేదు. "వందేమాతరం" అనే రెండు పదాలతో తృప్తిపడ్డారు. ఈ పదాలు వారిని పోరాటానికి తయారుచేసే ఆయుధాగారపు కొలిమిలోకి నెట్టినవి. చరిత్రలో అపూర్వము అసమానము అయిన త్యాగాలకు, బాధలకూ సన్నద్ధులనుచేసినవి. ఎన్నడూ గడపదాటివచ్చి ఎరుగని స్త్రీలు వీధులలో కదంత్రొక్కారు. బానిసత్వపుకపీటలో జనించిన బాలబాలికలుకూడా యీ ఉద్యమంలో ప్రవేశించి కవాతుచేశారు. నినాదాలుకావించారు. సామాన్యప్రజలు లాఠీదెబ్బలను ఎదుర్కొన్నారు, గుండుదెబ్బలకు తమ గుండెలను ఎదురునిలిపారు. ఉరికంబాలెక్కినప్పుడు చిరునవ్వులు చిందించారు. ప్రభుత్వసేనల తుపా

కులు వారిని భయపెట్టలేకపోయినవి. నరకకంఠంటె నికృష్టమైన కారాగారాలనే అంధకారపు గుహల్లో మ్రగ్గినా వారుచలించలేదు. తమ జీవన అభివృద్ధినీ. భార్యా పిల్లలనుగూర్చి ఆలోచించే తీరికలేక పోయింది. వాళ్ళు ఉన్మత్తులయినారు. "స్వాతంత్ర్య సమర గీతంలో పిచ్చివాళ్ళయినారు. వాళ్ళచేతులు కాళ్ళు వాళ్ళవికావు. దుర్గాదేవి వారిని ఆవేశించి తనవిచేసుకుంది.

బ్రిటిషు వారి అడ్డంకులను గేలిచేస్తూ వందేమాతర ప్రవాహం ముందుకురికింది. ప్రాంతీయ, మత, భాషాపరమైన సర్వ సంకుచితత్వాలను చించి వేసింది. ప్రజలంతా ఐకమత్యతో లేచారు. ఏక కంఠంతో వారు వందేమాతరాన్ని ఆలాపించారు. హిమాలయాలనుండి కన్యాకుమారివరకు వినవచ్చిన యీప్రతిధ్వని తిరిగి యీదేశాన్ని ఒకటిచేసింది. నిస్సహాయులై నిరాశా నిస్పృహలు పురిగొన్న ప్రజలు అన్నిరకాల మారణాయుధాలతో సర్వసన్నద్ధంగాఉన్న జిత్తులమారి పైశాచిక, శక్తుల నెదిర్చి విజయపథాన పురోగమించారు. సూర్యడస్తమించని బ్రిటిష్ సామ్రాజ్యమనే భ్రమ వమ్ము చేయబడింది. అదిఒక వినూత్న అద్భుతం.

జాతులు వాటియొక్క జీవనమూల్యములలోనూ, తాత్విక స్ఫూర్తిలోను ఆదర్శ ధ్యేయమార్గాలలోనూ జీవిస్తవి. అవే ఆప్రజల భవితవ్యాన్ని తీర్చిదిద్దుతాయి. వివేకానందు డీవిధంగా చెప్పాడు. "అంతశ్శక్తులు బాహ్య శక్తులు మననెంతగా పీడించి బాధలకు గురిచేసినా పేదరికంతోను అవమానంతోను సతమతమవుతున్నా విశ్వశ్రేయస్సు నాశించిన ఒక జాతీయ ప్రయోజనంకొరకు మనమింకా జీవించియున్నాం. ఆ జాతీయ ప్రయోజనాన్ని కార్యరూపంలో వ్యక్తీకరించడానికి వందేమాతరం ఉపయోగపడింది. అరవిందుడు చెప్పినట్లుగా "ఆ మంత్రం యివ్వబడంగానే ప్రజలంతా దేశభక్తి మతంలోకి మార్పిడిచెందారు. తల్లే తనను తాను తెలియజేసుకొంది. ప్రజలలో ఒక్కసారి ఆదృష్టి రాగానే విశ్రాంతిలేదు, శాంతిలేదు, మరొక ఆలోచన లేదు. ఆమెకొక ఆలయం నిర్మాణంచేసి అందులో ఆమెను ప్రతిష్టించి సర్వస్వార్పణం చేశారు".

ఇప్పటికీ ఈదేశం వ్యాకులపడుతూనే వున్నది. ఎక్కడ మలుపు తిరగాలో ఎట్లా నడవాలో, ఏవిధంగా తమ జీవితాలను మలుచుకోవాలో ప్రజలకు తెలియదు. దేనికోసం జీవించాలో ఎందుకు మరణించాలో గ్రహించే పరిజ్ఞానాన్ని కోల్పోయారు. ఈదేశం మాటిమాటికి అవమానింపబడింది. భాషా, ప్రాంతీయ మతపరమైన అంతర్గత విరోధాలున్నాయి. ఈదేశం మొత్తం ఒకటి, మనమంతా ఒక పవిత్రమూర్తియొక్క సంతానం అనేభావన తగ్గిపోజొచ్చింది. మనమంతా ఒకే మాతృమూర్తియొక్క బిడ్డలము అనే భావన మేల్కొలిపి ప్రజ్వలింపచేయటానికి, మన మధ్యనున్న అంతఃకలహాలను పారద్రోలటానికి, మన హృదయాలన్నిటిని సోదర భావమనే త్రాటితో ముడివేయటానికి, కోట్లాది గొంతులలోనుండి వందే మాతరం అనే కేక తిరిగి ఉద్భవించాలి. ఆకేక విశాల విశ్వమంతటా వ్యాపించి, ఆకాశమంతా నిండిపోవాలి. గంగాతీర్థమువలె అది ఒక పవిత్ర స్ఫూర్తివంతమైన శాశ్వత ప్రవాహము. మాతృభూమి సేవకు తిరిగి మనల్ని సంసిద్ధులుగా చేయుటకు కావలసిన ఐంద్రజాలిక శక్తి దానివద్ద ఉన్నది.

వందే మాతరం! తల్లీ నీకు నమస్సులు. మాతృమూర్తికి అందరు కలసి చేసే వందనము కోట్లాది హృదయాలలో ఐక్యతాభావాన్ని ప్రజ్వలింపజేస్తుంది. వారు ఆమెను భాగ్యసౌభాగ్యాలకు అధిదేవత అయిన లక్ష్మిగాను, విద్యకు అధిదేవత అయిన సరస్వతిగాను పూజించనారంభిస్తారు. ఆమెపట్ల కించిన్మాత్ర మవమానము జరుప తలబెట్టినా, సహించలేక రక్త తర్పణంతో పగ తీర్చుకుంటారు! ఆవిధంగా తర్పణంచేయబడ్డ రక్తపు బొట్టొక్కటి అనేకమంది వీరులను సృష్టిస్తుంది. ఆమె యుద్ధదేవతగా మారి అసంఖ్యాకమైన ప్రజల మనస్సులలోను, హృదయాలలోను విహారము చేస్తుంది. ఆమె ఆజ్ఞతో అరవిందుడు, బ్రహ్మ బాంధవుడు, మాస్టర్ దా, పులిన్‌బిహారి, హెడ్‌గెవార్ లేచి నిలబడ్డారు. ఆనందమతములు అసంఖ్యాకముగా వెలువరింపబడ్డాయి. గుహ, సుశీల్, ఖుదీరామ్, ప్రఫుల్ల, ఢీంగ్రా, అజాద్, అష్ఫాక్, లహ్డీ, గోపీమోహన్ తిరిగి ఉద్భ

విస్తారు. బిస్మిల్, రోషన్, సుధీర్, దినేష్, నాసూ, దస్తిధర్‌లు తమ తల్లియొక్క గొప్పదనాన్నీ ఆమె పుత్రులయొక్క వీర పరాక్రమాలను మళ్ళీ ప్రదర్శింపచేయటానికి తిరిగి మనమధ్య జన్మనెత్తుతారు. వాళ్ళ యొక్క మహోన్నత నినాదాలద్వారా మహోపన్యాసాలద్వారా మహాద్భుత రచనలద్వారా శక్తివంతమైన ఆయుధాలద్వారా మనపై దండయాత్ర చేసినవానిని వెనక్కునెట్టివేస్తారు. మాతృగౌరవానికి జరిగిన ద్రోహానికి వారు ప్రతీకారం తీర్చుకుంటారు. పగ చల్లార్చుకోవాలనే తల్లికోర్కె నెరవేరేంతవరకు వారి రక్తంలోని వెచ్చదనం చల్లారదు. మాతృమూర్తి కోరిక నెరవేర్చబడేవరకు వారి ఉచ్ఛ్వాసములోని మత్తు తొలిగిపోదు. ఇది వందేమాతరంయొక్క ప్రాముఖ్యత. ఇదే వందేమాతరంయొక్క శక్తి.

ఈనాడు కావల్సింది దేశభక్తి. సంకుచిత విదేయతలను, కృత్రిమ కడ్యాలను పగులగొట్టి, సహజము, మనోహరమైన జాతీయ జీవన ఐక్యతకు, శక్తికి, ఒక బ్రంహ్మాండమైన ఝంఝూమారుతము దేశమంతటా ఉద్భవించాలి. ఈనాడు జనగణమన అధికారిక జాతీయగీతం. రాష్ట్రోత్సవాలలోనూ, ముఖ్య సందర్భాలలోనూ గానం చేయబడుతుంది. అయితే యీ దేశం సుభిక్షంగా సుసంపన్నమై ఉండాలంటే లక్ష్మీదేవి పూజించబడాలి జాతి విజ్ఞాన రోచిర్మయంగా నిలవాలంటే సరస్వతిని పూజించాలి. నలుమూలల దండయాత్రల బెదిరింపుల అంధకారం నిండిన దేశంలో శత్రువులను పారద్రోలి నిర్భయవాతావరణాన్ని నిర్మించటానికి తన పది చేతులతో ఆయుధాలను ధరించిన దుర్గామాతను మనం ప్రార్థించాలి.

అటువంటి దేవతయొక్క పాట పాడబడుగాక. ఆమెయొక్క అభినందనా మంత్రముచే ప్రతి ఇల్లు, ప్రతిధ్వనింపబడుగాక. వందేమాతరం కేక తిరగలి మోతనుండీ, ఊయల శబ్దమునుండీ జలజలమను ఆకులయొక్క చప్పుడులలోనుండీ, మందిరములోని ఢంకానాదములనుండీ తన ఒడ్లపై మ్రోగిస్తున్న సముద్రపు గంభీర గర్జనలనుండీ వందేమాతరం మ్రోగుగాక. ఆకేక నదులమీద వినిపించే సంగీతములో తేలియాడుగాక. జలపాతముల

గర్జనలో వినబడుగాక. రైతుల పొలములలోనుండి పనివారి కర్మాగారాల నుండీ, ఎత్తైన కొబ్బరిచెట్లనుండీ కోసిన పంట గింజలనుండీ మంచు బిందువులనుండీ నాట్యమాడుగాక. ఆకేక పిల్లలమట్టి ఆటలలోనుండీ తరుణుల హృదయ కుహరాలలోనుండీ లేచుగాక, నేలమీదనుండీ, గోడల మీదనుండీ, ఇంటియొక్క కప్పులనుండీ, ప్రతిధ్వనించుగాక. ఆచార్యుల చర్యలనుండి, శాస్త్రజ్ఞుల పరిశోధనావ్యాసాలనుండీ, సైనికుల తుపాకీ ధ్వనులనుండీ వినిపింపబడుగాక. జానపదుల పదాలనుండీ, పాటలనుండీ, స్త్రీ సమూహములు కుట్టుకొనే అల్లిక పనులలో నుండి, వందేమాతరం వెలువరింపబడుగాక.

ఈనాడు మనముందున్న కర్తవ్యమిదియే. వందేమాతరం బహిరంగ సభలలోను మహోత్సవములలోను, పండుగలలోను, వాడుకగా పాడబడుగాక. ఈ తరము, రాబోవుతరములు, దీనియొక్క అంతర్గత భావనను సంగీతంలోని అమృతత్వాన్ని గ్రహించును గాక. మారుతూవుండే ప్రభుత్వములయొక్క దయా దాక్షిణ్యములమీద వందేమాతరం నిలబడదు. క్రింద పడదు. నాలుగు గోడలమధ్య బిగింపబడిన సంఘముల, ఉపసంఘముల యొక్క తీయని నిర్ణయము మీద ఆధారపడలేదు. ఈపాట కోటానుకోట్ల ప్రజలయొక్క హృదయసింహాసనములను అధిష్టించింది. ఈనాటి రాజకీయాలలోను రాజకీయపార్టీలలోను కానవస్తున్న విభేధాలను చించుకొని వందేమాతరం విజయఢంకాను మ్రోగిస్తుంది, ఇప్పుడు పట్టించుకొనక పోయినప్పటికి ఆ గాన మాధుర్యం అణచివేయలేనట్టిది. బొంబాయిలోని గవాలియా మైదానములో 1967 ఆగష్టు 9న ప్రధానమంత్రిణి శ్రీమతి ఇంధిరాగాంధి మాట్లాడింది క్విట్ ఇండియా ఉద్యమము 25 సం॥ల నాడు జన్మించిన చారిత్రాత్మక స్థలమది, ఆ ఉద్యమములో బలిదానం కాబడిన త్యాగధనుల జ్ఞాపకాలు ప్రధాన మంత్రిణికి ఉద్రేకాన్ని కలిగించినది. ఆమె ఈ విధంగా చెప్పింది. "ఈనాటి కష్టమైన చిక్కులను ఎదుర్కొని వాటిని వదిలించుకోవలనంటే క్విట్ ఇండియా ఉద్యమంనాటి మహోన్నత ఆదర్శాలను మనలో మనం జాగృతం చేసుకోవాలి." ఇది ఎట్లా సంభవం? ఆ ఆవే

శాన్ని పొందే మార్గము ఎమిటి? అది వందేమాతరం. తల్లిపట్ల భక్తితో కూడిన వ్యక్తీకరణ. 1967లో శ్రీమతి గాంధీ బెంగాలుసందర్శించినప్పుడు కూడ ఇదేరకమైనదన్ని వ్యక్తంచేసింది. మనకు జాతీయగీతాన్ని, వందే మాతరాన్ని ఇచ్చిన బెంగాలు రాష్ట్రమంటే నాకు అత్యంత ప్రేమ' అని ఆమె చెప్పారు. అది తప్పనిసరి మనం ఎక్కడికివెళ్ళినా వందేమాతరం మనను వెంటనంటి వస్తుంది.

వందేమాతరంయొక్క సుఖదుఃఖాలు ఈజాతియొక్క సుఖదుఃఖాలు, దాని గెలుపు జాతియొక్క గెలుపు దానికి గ్రహణం పట్టిందంటే జాతికి గ్రహణం బట్టినట్టే. దానిని అశ్రద్ధతో బాధపెడితే జాతిని అశ్రద్ధతో బాధపెట్టినట్లే. దానిని ముక్కలుచేస్తే దేశాన్ని ముక్కలుచేసినట్లే, దానియొక్క కీర్తి జాతియొక్క కీర్తి. దాని పతనము జాతియొక్క పతనము దుఃఖకరమైనది క్లేశకరమైనవి.

శాశ్వతము సనాతనము అయిన యీజాతి కాల చక్రపరిభ్రమణంలో యీలాంటి ఒడుదుడుకులను అనేకసార్లు చవిచూచింది. మరొకసారి ఈజాతి విజయము పొందేముందు ఇది ఒక తాత్కాలిక తిరోగమనమే. కొద్దికాలము లోనే ఈ అంకం మారుతుంది. ఏది మోడువారిందో అది రేపు చిగురు స్తుంది. తాత్కాలికమైన గ్రహణం మన స్మృతిపథంలో అడుగున పడు తుంది. వందేమాతరం శతశతానేక కంఠాలనుండి బయటకు రాబడుతుంది. శిఖరాలనుండి కనుమలనుండి ప్రతిధ్వనిస్తుంది. సంపూర్ణంగా అది పాడ బడుతుంది. వారు దానియొక్క శాశ్వతత్వాన్ని ఆ తల్లియొక్క అమృ తత్వాన్ని ఆమె పుత్రుల మవటములోని పవిత్రతను ఎలుగెత్తి ప్రపంచానికి చాటుతారు. ఏ పాటైతే కోటానుకోట్ల నాలుకలపై నర్తించినదో బాధల లోను త్యాగాలలోను ఆవేశపరిచినదో, ఏది త్యాగధనుల రక్తములో పునీతమైందో ఆపాటను నేటి యువకులు వారి స్వంతంచేసుకొని రాబోయే తరాలవారికి అందిస్తారు. భవిష్యత్ తరాలవారు శాశ్వతము, అమృతమైన ఈ పాటకు వారసులు.

అప్పుడు తిరిగి భారతమాత మరొకసారి తన కాళ్ళపై తాను లేచి నిలబడుతుంది. మాతృభూమి రక్షణ, ఉజ్వలతలకొరకు తమ మనస్సులను హృదయాలను, కండరాలను అర్పించే కోట్లాది ప్రజలను ఆమె ఆవేశ పరుస్తుంది. ఒక ఉజ్జ్వల శకాన్నీ సమృద్ధినీ, మహత్వాన్నీ తీసుకరావటానికి ఆమె ఒక ఉపకరణం అవుతుంది.



అప్పుడు ఆతల్లి విశ్వమాతగా తననుతాను లోకానికి అభివ్యక్తం చేసుకుంటుంది.



ఆనాడు ప్రపంచంలోని చాలాదేశాల ప్రజలు భారతదేశమువైపు తిరుగుతారు. భారత పుత్రులతో కలిసిపోయి సామూహికముగా వందేమాతరం గీతం గానంచేస్తారు. ఇదిజరిగి తీరుతుంది.

వందేమాతరం !



